


# కృష్ణ భక్తి

(శీల రూపగోస్వామి భక్తిరసామృత సింధువు)



శాంతిశ్రీ

**జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి**

ప్రశాంతి నిలయం

మూల్యము : రూ. 35.00
ప్రతులు 1000
ప్రథమముద్రణ

This book is published with the Financial assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme Aid to Publish Religious books.

ప్రతులకు :
**'శాంతిశ్రీ'**
**జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి**
EP II/2, ప్రశాంతినిలయము 515 134

ముద్రణ
**రమేష్ ప్రింటింగ్ ప్రెస్**
గుల్జార్ పేట, అనంతపురం
☎ (08554) 41688 41038

# పాల సముద్ర తరంగాలు

# అంకితాబ్జం

శ్రీకృష్ణా! మురళీధరా! వికచరాజీవాక్ష లోకేశ్వరా
రాకాచంద్ర నిభాననా! జన మనః ప్రాణావనా! స్వామి! ఏ
కైకారాధ్య జగద్గురూ! హృదయవాసా! స్వామి గోపాల దే
వా! కైంకర్య పదంబుకై పదయుగంబర్పించి ప్రార్థించెదన్

మురళీ గాన విలోల! భక్త వరదా! మోక్షప్రదా! దోష సం
హరణా! గోప వధూ మనోరమణ! బ్రహ్మానంద సంగీత సుం
దరగాత్రా! నవనీత మానసహరా! నందాంగనా బాలకా!
పరుగుల్ పెట్టి ముకుంద కృష్ణ! యిటురావయ్యా! ప్రశాంతి ప్రభూ!

మురళీగానము మూడులోకముల మార్మోగెన్ మహాజ్ఞాన భా
సుర పీయూష నదీ ప్రవాహలహరీ శుభ్ర ప్రభా కీర్ణ సుం
దర శృంగారకళా కలాప నటనా నాట్యైక్య నైపుణ్య మా
ధురులుప్పొంగి జగజ్జనంబులతి సంతోషంబు తోగ్రోలగన్

మురళీ మంత్రమదేదొ నూదితివి వ్యామోహంబు పొంగెత్తి మై
మరచెన్ లోకములన్ని కృష్ణ పరమాత్మా! బ్రహ్మ రుద్రాదులున్
శిరముల్ మోడ్చి 'నమో నమో!' మురహరా! సాయి కృష్ణా! పరా
త్పర! నీ మాయనెరుంగ జాలమనుచున్ పాదాలపై వ్రాలెడిన్

మాస్వామి పాదాలు మందార పుష్పాలు
మాధవీ మాలతీ మంటపాలు
మా స్వామి చరణాలు మాణిక్యదీపాలు
మహిత మహాదేవ మందిరాలు
మా స్వామి అంఘ్రులు మధురవిజ్ఞానాలు
మానస కైలాస మాతృకాలు
మాస్వామి పదములు మహిమంగళ శ్రీలు
మంగళకైశికీ మధురవాలు
ప్రణవనాదాలు - వేదాలు - పారదాలు
నవ సనాతన ఋషుల ప్రాణప్రదాలు
నిత్య కైవల్య సుఖదాలు నీరదాలు
స్వామి పదపారిజాతాలు భక్తిదాలు

ఓ దయాసింధు ! త్రిజగత్ప్రభూ ! సుభక్త
బంధు! 'భక్తి రసామృత సింధువును' మ
థించి 'కృష్ణభక్తి యనెడి వెన్న తీసినాను
స్వీకరింపుము కృష్ణ సాయీ ! కృపాళు !

దేవ! కృతికర్త కృతిభర్త వీవె - నేను
తగుదునే కేవలము నిమిత్తమ్ము కాక !
ప్రేమమయమూర్తి ! అఖిల రసామృతాబ్ధి !
ఇది గ్రహింపు మా ప్రభు ! నమస్కృతులొనర్తు !

- శాంతిశ్రీ

# తులసీ దళం

ఈ భక్తి రసామృత సింధువును తలంచుకోగానే దయాసింధువు భక్త జనబంధువు త్రిజగత్ ప్రభువు ఆనంద మందార మకరంద మధువు అయిన సాయి కృష్ణ దేవుని లీలలు పూలమాలలుగా జ్ఞాపకం వస్తుంటాయి.

శ్రీసాయి కృష్ణుడు ఒకసారి కేరళ ప్రాంతంలో పర్యటన చేస్తూ సముద్రం తీరానికి వెళ్ళాడు. ఆ సముద్రుడు ఈ దయాసముద్రుణ్ణి రామచంద్ర ప్రభువుగా గుర్తించి, ఆనంద సముద్రుడైనాడు. అంబుధి కన్యలు సాయిరాముడి ముందుకు వచ్చి ఆనంద నాట్యం చేస్తూ అలలు అలలుగా అల్లనల్లనా వచ్చి సాయిరాముని పాదపద్మాలు ప్రక్షాళనం చేసి పరవశించి పోతున్నాయి.

స్వామి తన దగ్గరున్న భక్తులతో నవ్వుతూ అంటున్నాడు 'చూడు ! చూడు ! సముద్రుడికి నేనంటే ఎంత ప్రేమో ! నాకు స్వాగత సన్నాహాలు ఏర్పాటు చేశాడు. తన అమ్మాయిల చేత నాట్యం చేయిస్తున్నాడు. తాను వంగి వంగి పాదనమస్కారాలు చేస్తున్నాడు. ఆణిముత్యాల హారాలు పట్టుకొని, వస్తున్నాడు. అని అంటుండగానే స్వామి పాద పద్మాల ముందు ఒక పెద్ద అలవచ్చి ముత్యాలదండ సమర్పించింది. అవి గ్రహించి, సాయిరాముడు సంతోషించి తన బృందంలోని భక్తులకు చూపాడు. అవిచూచి భక్తులు ఆశ్చర్య ఆనందాలతో పొంగిపోవసాగారు. స్వామి ఆముత్యాలను భక్త సత్తములకు బహూకరించి, పరమానంద పరచాడు.

మరొకసారి స్వామి పూర్వ సముద్ర భాగానికి వెళ్ళాడు. అది మహాపర్వవేళ. మహోదయ మహాపుణ్య దినం. మరీ మహాద్భుతంగా ఉంది. స్వామి మహావిష్ణువై మహావిభూతితో విరాజిల్లసాగాడు. స్వామి దయచేసినార నగానే సముద్రుడు మరీ పొంగిపోసాగాడు. మహా భక్తవర్యులకు మహా విష్ణువు దర్శనభాగ్యం ప్రసాదించసాగాడు.

తూర్పుసాగరం నుండి మహాకాంతి జలతరంగం భక్తజనుల ముందుకు వచ్చి నిలిచింది. స్వామి భక్తజనులను 'దర్శనం చేసుకోండి' అన్నారు.

అది పాల సముద్రం – మధ్యలో వేయిపడగల ఆదిశేషుడు. అది క్షీరాబ్ధి. శ్రీమహా విష్ణువు శేషశయనుడై సాగర మధ్యలో పవళించాడు. లక్ష్మీదేవి స్వామి పాదాలు ఒత్తుతూ ఉంది. నారద తుంబురులు మధుర మనోహర మంగళ సంగీతం ఆలపిస్తున్నారు.

శ్రీ సత్యసాయి భక్తులను చూచి మీకు అమృతం కూడా అందిస్తాను అని ఒక పాత్ర సృష్టించి, సముద్రంలో విసిరాడు. ఆ పాత్ర అమృతంతో నిండి అలలపై తేలియాడుతూ స్వామి హస్త కమలాలలోకి వచ్చివ్రాలింది. 'ఉద్ధరిణ' అంటూండగానే ఒక వెండి ఉద్ధరిణ వచ్చింది. ఆ ఉద్ధరిణతో భక్తులందరికీ అమృతం విందు చేశాడు స్వామి.

ఆ దృశ్యం మోహినీదేవి సురాసులకు అమృతం విందుచేసినట్లే ఉంది.

ఆ అమృతంతెచ్చి ప్రశాంతినిలయం లోని భక్త సమూహాలకు అందరికీ పంచిపెట్టాడట స్వామి. ఆనాటి భక్తులు ఎంత అదృష్టవంతులోకదా అనిపిస్తుంది.

ఆ విధంగా స్వామికి సముద్రుడికి బంధుత్వం పురాతనం సనాతనం. ఓ సాయి కృష్ణ ప్రభూ ! త్రిలోకనాయక విభూ !

శ్రీకృష్ణ చంద్రుడివైన అఖిల రసామృత మూర్తీ!
నీవు సౌందర్య కాంతి ప్రసారాల చేత
అసంఖ్య తారకల వంటి గోపికలను
వశపరచు కొనిన రాధామనోహరుడవు.
అట్టి సాయి కృష్ణా! నీకు జయోఽస్తు.

సహృదయ భక్త వర్యుల సంతృప్తికై
జగన్మంగళం కాంక్షిస్తూ నా అల్పబుద్ధితో
ఈ భక్తి రసామృత సింధువును
ఈదుటకు ప్రయత్నిస్తున్నాను. నాకు నీవే రక్ష

నేను నీ చేతిలో పని ముట్టుగా ఉంటాను. ఈ రచన నీవే సాగించు. నీవే తప్ప ఇతః పరం బెరుగ – సంరక్షించు! భద్రాత్మకా!

ఈ 'కృష్ణ భక్తి' నా శక్తి కొలదీ తీర్చి దిద్దబడింది. ఇది శ్రీల రూపగోస్వామి 'భక్తి రసామృత సింధువు' సార రూపం. పోతన కవితను జేర్చి మధుర మిశ్రిత పాకం చేశాను.

ఈ కష్ణ భక్తికి ప్రేరణ కలిగించిన వారిలో ఔత్తరాహులలో శ్రీల రూపగోస్వామి దాక్షిణాత్యులలో పోతనగారు ముఖ్యులు. వారికి కృతజ్ఞతాంజలులు. అర్థించినదే తడవుగా ఆర్థిక సహాయం ఉదారంగా అందించిన తిరుపతి – తిరుమల దేవస్థానం కార్య నిర్వహణాధికారికి, వారి బృందానికి వందనాలు. అచ్చువేసిన రమేష్ ప్రెస్సు, అనంతపురం వారికి శుభాశీస్సులు.

ఎప్పుడూ ఇంటా వెంటా జంటగా ఉండి ఒక కంటకనిపెట్టి నన్ను కనికరిస్తున్న **భగవాన్ శ్రీసత్యసాయి పూర్ణావతారమూర్తికి** సాష్టాంగ దండ ప్రమాణాలు చేస్తూ అంకితంగా ఈ 'తులసీదళం' సమర్పిస్తున్నాను.

– **శాంతిశ్రీ**

# ప్రేమ తత్త్వం

- భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబా

ప్రేమమయుండు శ్రీధరుడు ప్రేమయె యాతని దివ్యరూప మా
ప్రేమయె సర్వమానవుల ప్రీతికి తారకమంత్ర మట్టి స
త్ప్రేమ రవంతయైన వివరింపగలేక జగంబునందు స
త్కామిత సత్పదార్థ మెటు గాంచగనేర్తురటయ్య మానవా !

పూర్ణప్రేమయందె పుట్టును సౌఖ్యము
త్యాగ సత్య శాంతి దాంతులకును
ప్రేమ లేకయున్న క్షేమంబు లేదయా !
సత్యమైన బాట సాయిమాట

ప్రేమ స్వరూపులారా ! మీరు ముఖ్యంగా పెంచుకోవలసింది ప్రేమ ఒక్కటే. ప్రేమ ఒక్కటి ఉంటే ద్వేషానికి అవకాశమే ఉండదు. ఆనాడు గోపికలు కూడా చెప్పారు.

ప్రేమ రహిత మరుభూములలో
ప్రేమాంకురములు పెంపొంద -
ప్రేమావేశముతో----------

ప్రేమ సుధా వర్షము వర్షింపగ
ప్రేమ నదులు ప్రవహింపగ
మురళీ గానము సేయగదే
కృష్ణా! మురళీ! గానము సేయగదే !

ప్రేమ రహితమైన హృదయ క్షేత్రాలలో మీరు ప్రేమ బీజమును నాటాలి. దానికి ప్రేమ జలమును పోయాలి. ప్రేమ వర్షమును కురిపించాలి. ప్రేమ ప్రవాహమును ప్రవహింపజేయాలి. మీ ప్రేమను అందరికి పంచాలి. నిర్మలమైన, నిశ్చలమైన, నిస్స్వార్థమైన ప్రేమను పెంచుకోవాలి. మీరు మీ ప్రేమను లౌకికమైన విషయాలలో ప్రవేశపెట్టడం చేత అనేక చిక్కులకు గురి అవుతున్నారు. ప్రేమ ఇస్తుంది. క్షమిస్తుంది. కష్టం స్వీకరిస్తుంది. పరుల తప్పులు మరిచిపోతుంది. కనుక స్వార్థ పూరితమైన ప్రేమ మనకు వద్దు. నిస్స్వార్థ ప్రేమను పెంచుకోవాలి. ప్రేమను పవిత్రంగా పెట్టుకోవాలి, అందరిని ప్రేమించాలి. అప్పుడు జగత్తంతా పవిత్రమవుతుంది.

నవవిధ భక్తి మార్గములన్నీ ప్రేమ మయమైనవే. ప్రేమ రహితభక్తి మార్గం అసలు లేనేలేదు. ఒక్క ప్రేమతో మీరు సర్వము సాధించవచ్చు. దీనికి నేనే నిదర్శనం. నాయందున్నది ప్రేమ ఒక్కటి మాత్రమే.

భాగవతము గోపికల అనన్య భక్తిని గురించి చాలా గొప్పగా వర్ణించింది. భాగవతము చాలా పవిత్రమైంది. అందులో సకల వేదాంత సారము ఇమిడి యుంది. **భాగవతం చదివితే బాగవుతాం** అని చెప్పవచ్చు. భాగవతము అనే పధములో **భా** - భక్తిని, **గ** - జ్ఞానమును, **వ** - వైరాగ్యమును, **త** - తత్త్వమును, **ము** - ముక్తిని సూచిస్తున్నాయి.

కనుక భాగవతము అనగా భక్తి, జ్ఞాన వైరాగ్య తత్త్వములను అందజేసి ముక్తిని ప్రసాదించేది అని అర్థము.

భాగవతములో గోపికల ప్రేమతత్త్వమును మొట్టమొదట గుర్తించాలి. గోపాలుడు గోకులం వదలి మధురకు వెళ్ళిపోయిన తరువాత గోకుల వాసులైన గోపికలు, గోపాలురు కృష్ణ వియోగంతో పరితపిస్తున్నారు. గోకులం అంతా ఎండబారినట్లు కళావిహీనంగా కనిపిస్తున్నది. వారికి తిండికి ఏ మాత్రము లోటులేదు. కాని భుజించడం లేదు. అన్ని సుఖములు వున్నాయి. కాని

అనుభవించడం లేదు. కారణమేమిటి? ప్రాణ సమానుడైన కృష్ణుడు తమ వెంట లేనప్పుడు తాము జీవించడం వ్యర్థమని భావించారు. నిద్రాహారములను త్యజించడం చేత వారి దేహములు కృశిస్తున్నాయి. కృష్ణ వియోగం చేత వారి మనస్సులు ఆందోళన చెందుతున్నాయి. ఈ సత్యాన్ని గుర్తించిన మధురలోవున్న గోపాలుడు తన మిత్రుడైన ఉద్ధవుడిని పిలిచి ''ఉద్ధవా! గోపికలు నా నిమిత్తమై పరితపిస్తున్నారు. నీవు వెళ్ళి వారికి తగిన బోధలు సలిపి, వారి మనస్సులను శాంతపరచిరా!'' అని బృందావనం పంపాడు.

శ్రీ కృష్ణుడు ప్రేమమయుడు. ప్రేమయే శ్రీ కృష్ణుడు. అంతా ప్రేమయే. **మీరంతా ప్రేమ స్వరూపులు. కనుక నేను ప్రేమస్వరూపులారా ! అంటుంటాను.**

ఏ ప్రేమ మహిమచే ఈ ధారుణీ చక్ర
మిరుసులేకుండనే తిరుగుచుండు
ఏ ప్రేమ మహిమచే ఎల్ల నక్షత్రాలు
నేల రాలక మింట నిలిచి యుండు
ఏ ప్రేమ మహిమచే పృథ్విపై బడకుండ
కడలిరాయుడు కాళ్ళు ముడుచుకొనును
ఏప్రేమ మహిమచే ఈ రేడుభువనాల
గాలి దేవుడు సురటీలు విసరు.
ఆ మహాప్రేమ శాశ్వతమైన ప్రేమ
అద్భుత మఖండ మవ్యక్తమైన ప్రేమ
నిండి యున్నది బ్రహ్మాండ భాండ మెల్ల
ఈ మహా సృష్టి యంతయు ప్రేమమయము.

ప్రేమమయుడు ఈశ్వరుడు. సృష్టి ప్రేమమయము. జీవులెల్లరు ప్రేమ జీవులు. సర్వం ప్రేమయే. ప్రేమ పావనమైనది. పవిత్రమైనది. సర్వత్ర నిండి ఉన్నది. సర్వేశ్వర స్వరూపమైనది ప్రేమ.

ప్రేమ రూపంబు బ్రహ్మంబు ప్రేమమయము
ప్రేమ ప్రేమతో సంధింప నీమమగును
కాన ప్రేమను పూర్తిగా కలిగియున్న
అద్వితీయమ్ము చెందగా అర్హుడగును.

అట్టి ప్రేమ ప్రతిఫలించాలంటే ప్రశాంతి కావాలి. జీవనం బృందావనం కావాలి. అప్పుడే అది అణువణువులో ప్రతిబింబిస్తుంది. కనుక మనస్సును పావన పారిజాతంగా ఉంచుకోవాలి. ప్రేమను పెంపొందించుకోవాలి.

అపుడు ప్రేమరసం ప్రవహిస్తుంది. ప్రేమవీచికలు వింజామరలై వీస్తాయి. దివ్యప్రేమ శుద్ధమైన పద్మాకరంలోని పద్మమై విచ్చుకొంటుంది. ప్రేమరూపం ప్రశాంత కాసారంలోనే ప్రత్యక్షమై ప్రేమస్వరూపం 'ఇలాంటిది సుమా !' అని తెలియజేస్తుంది. అచ్చట ఆ ప్రశాంతిలో అంతా ప్రేమయే ప్రేమ. మానవ మహిత మానసాలు మాధవీ మాలతీ మల్లీ మతల్లికలై అల్లిబిల్లిగా అల్లుకొని బృందావనంగా త్రయీబృందావనంగా పరతత్వ పరీమళాలను గుభాళింప జేస్తుంటాయి. అని సాయికృష్ణుడు ప్రేమ ప్రసంగం ఇలా ప్రసారం చేస్తున్నాడు.

గోపికలు కృష్ణపరమాత్మకై ఏ విధంగా పరితపిస్తుంటారో చూడండి గోపగోపికా సమూహాలు ఆ గోపాల కృష్ణుని 'కృష్ణా! మురారీ ! శ్రీహరీ ! గోవిందా ! గోవర్ధనగిరిధారీ !' అని అనుక్షణం స్మరిస్తూ పలవరిస్తూనే పరవశించిపోయేవారు. కృష్ణస్మరణం ఏ క్షణం కూడా మరచి మనకలిగేవారు కాదు. ఇతరులకు బాధ కలిగినపుడు 'అయ్యో ! అబ్బో ! అమ్మో !' అనటం సహజం. కానీ, గోకులంలోని గోపజనం సుఖంలోనూ, దుఃఖంలోనూ 'కృష్ణ కృష్ణా !' అనటమే వారికి అలవాటు. సోఽహం నామంతో కృష్ణస్మరణతోనే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీసుకొనేవారు.

ఒకసారి ఒక గొల్లభామ బృందావనం వీథుల్లో పాలుపెరుగు అమ్మటానికి వచ్చింది. వస్తూవస్తూ భగవన్నామం చేసుకొంటూ వస్తూంది. వీథిలో ఇళ్ళ ముందుకు వచ్చి కూడా పాలుపెరుగు అనటం మరచి పోయి 'గోపాలా ! లోకపాలా ! పాలు ఇవి గోపాలా ! భూపాలా ! బాలగోపాలా ! నవనీతచోరా ! ముద్దుల కృష్ణా ! యశోదబాలా ! మానసచోరా ! రాజులబాలా !' అంటూ బిగ్గరగా కేకలు వేయసాగింది. కృష్ణుడు అప్పుడు ఎవరో భామవలె మారువేషంలో వచ్చి 'ఎందుకు వచ్చావు? పాలు, వెన్నా అమ్ముకో!' అంటే తెలిసింది ఆ గొల్లభామకు. ఇలా ఆ గొల్లభామల మనస్సు మాధవునిలో లగ్నమై తాము బృందావనం ఎందుకు వచ్చాము? పాల వ్యాపారం చేస్తున్నామా! అనే సంగతినే మరచి పోయి ఉండేవారు. జీవనోపాధి గురించి ఆలోచనే ఉండేదికాదు. 'మా క్రిష్టయ్యకు ఇది ఇష్టం, క్రిష్టయ్య ఇదిచేశాడట, అది చేశాడట, బలే ఆటలు ఆడాడట గమ్మత్తైన పాటలు పాడాడట' అంటూ మాట్లాడుకుంటూ ప్రపంచాన్నే మరచేవారు.

ఎవరైనా వేదన పడుతుంటే కృష్ణకీర్తనలు పాడి ఆనందం అందించేవారు. కృష్ణ కీర్తనలు పాడిఆడి తృప్తిపడేవారు. తృష్ణ తీరాలంటే 'కృష్ణా' అనేవారు. నీలమేఘశ్యాముడు వారికి వెంటనే కనికరించి కనపడేవాడు.

ఆ తృష్ణయెంత తీవ్రమో తెలిసికొంటేనే మీకు రాధా తత్త్వం అర్థమవుతుంది. ఆ రాధకు కృష్ణుడే ఆరాధన. రాధకు ఆధారం కృష్ణ నామమే 'రాధ'ను త్రిప్పిరాస్తే 'ధరా' అవుతుంది. ధరాదేవియే రాధ. రాధ కృష్ణనామం ధారగా పానం చేస్తూ అదే ఆధారంగా బ్రతుకుతుంటుంది. అలా ఆరాధన చేసింది రాధ. ఆమె ధర. అంటే ప్రకృతి. కృష్ణ అంటే ఆకర్షణ. ప్రకృతి ఇంత ఆకర్షణీయంగా ఉండటానికి కారణం అది. రాధాకృష్ణతత్త్వం. కనుక 'కృష్ణ' లో 'క' కారం, 'ఋ'కారం, 'ష' కారం, 'ణ' కారం, 'అ' కారం, 'విసర్గలున్నాయి'. ఈ ఆరు షడ్గుణైశ్వర్య పతులకు ప్రతినిధులు అంటే క-కారం కమలాపతి - ఋ-కారం సీతాపతి. ష-కారం రమాపతి, ణ-కారం లక్ష్మీనరసింహం, అ-కారం అక్షరరూపుడు విసర్గలు నరనారాయణులు వీరు పూర్ణావతారపురుషులు, వీరు కృష్ణునిలో మమేకమై ప్రకాశిస్తున్నారు. కనుక కృష్ణుడు పరిపూర్ణావతార పురుషుడు.

అట్టి శ్రీకృష్ణమాధుర్యం ప్రకృతిలో పరిమళించి ఉంది. ఆ మాధుర్యాన్ని ధరయైన రాధ ఆరాధన చేస్తూ, ఆస్వాదిస్తూంది. రాధాదేవి ధరా సంబంధమైన ప్రాకృతిక మాయాశక్తి. కృష్ణుడు సంభోధాతాత్మకమైన, హ్లాదినీ శక్తి. ఈ సంభోధాత్మకుడైన కృష్ణునికి ఆమె మహాభావము. ప్రకృతి రూపంలో ప్రకటితమైన కృష్ణ పరమాత్ముని ఆనందంగా రాధ రూపు దాల్చింది. రాధ తనహృదయంలో భద్రపరచుకున్నది కృషుణ్ణి. దుష్టప్రవృత్తులు మలినవార్తలుగల మనుష్యుల మనస్సులకు పవిత్ర సంబంధం అర్థంకాదు. కృష్ణుడు పరమాత్ముడు అనే విశ్వాసం పెంచుకొన్నవారు, కృష్ణలీలలకు అశ్లీల వ్యాఖ్యానాలు చేయరు. జ్ఞానం గల వారికి కృష్ణలీల ఆత్మ రక్షణకు ఉపయోగపడే కవచంగా లభ్యమవుతుంది.

'అసలీ గోపీకలు ఎవరు?' అని ఆలోచిస్తే. సురకన్యలు భూమి యందు సుందర తనులై హరిపూజార్థము పుట్టారు - అన్నాడు బ్రహ్మ. అవతార మహిమలో పాల్గొనేందుకు వచ్చిన దేవతలు పరమాత్మను సేవించుకొనేందుకు వచ్చిన మహాభక్తులు భగవల్లీలలకు సాక్షులై లీలలలో తాము భాగస్వాములుగా ఆనందం పొందేందుకు భూలోకానికి దిగివచ్చిన సురులు. వారొక ప్రత్యేక

ప్రయోజనార్థం పుట్టిన దివ్యకాంతలు. కృష్ణుడు గోపకాంతల ఇండ్లల దొంగిలించినది వెన్నకాదు. అది భక్తిభావభరిత హృదయం. అదే వెన్న అన్నారు కృష్ణుడు నవనీతచోరుడు కాదు చిత్తచోరుడు. సాధారణంగా చోరులు యజమాని నిద్రిస్తున్నపుడు వారికి తెలియకుండా దొంగిలిస్తారు. యజమాని తెలుసుకొని విలపిస్తాడు. కానీ ఈచోరుడు యజమాని మెలకువతో ఉన్నప్పుడే దోచుకొంటాడు. దోచబడినవాడు దుఃఖించడు. పరమానందం చెందుతాడు. ఇది ఒక చమత్కారం.

మరొక చమత్కారం - గోపికా లోలుడైన కృష్ణుడు నీలమేఘశ్యాముడు ఆ గోపికలకు కృష్ణుడు ఆరాధనీయుడు . కృష్ణుడు ఎప్పుడూ గుర్తుకు రావటానికి నీల వర్ణపు కుంకుమను ధరించేవారు. వారునిత్యం నీలమణులు గల హారాలు ధరించేవారు. ఆ హారాలలో మణులలో ఆ శ్యామలకాంతిలో కృష్ణదేవుని రూపం కనుల పండువుగా వారికి విందు చేస్తుండేది.

అని ఉపన్యసిస్తూ ఈ సాయికృష్ణుడు తనకు భక్తులర్పించిన ఒక దండలోని మల్లెపూల రేకులు కొన్నిలాగి ఒకచేతిలో నుంచి రెండవచేతిలోకి ఒక ధారగా ఎత్తి పోయసాగాడు. ఆ మల్లెపూల రేకులు, నీలమణులుగా మారిపోయాయి. శ్రీసాయి చేతిలో అవి చూపిస్తూ, ''గోపికలేరి అలంకరించుకొన్న నీలమణులివే !'' అని అక్కడి వేలాది భక్తులకు అమణులు చూపించి, ఇలా చెప్పాడు. ''ఆనాడు ప్రతిమణిలోనూ స్పష్టంగా అందంగా, ఆనందంగా కనిపిస్తున్న శ్రీకృష్ణరూపం చూచి అందరూ ఆపూర్వానందం పొందారు.

కృష్ణదేవుని చూచి ఆనందించేది ఆ పల్లెటూరి గొల్లభామలే కాదు. జ్ఞానులు, వృద్ధులు, పండితులు కూడాను. మహావీరుడైన భీష్మడికి కూడా కృష్ణ దర్శనంలో అంతటి మహానందంలభించేది. ఆనాడు అన్ని జాతులవారు అన్ని తరగతులవారు అన్ని వృత్తులవారు కృష్ణుని పరమాత్ముడుగా భజించి తరించారు. అందరికీ ఆనందం అందించటం వల్లనే కృష్ణుడు పరిపూర్ణ అవతారం అనటం జరిగింది.

శ్రీకృష్ణ భగవానుడు పదహారు కళలు నిండిన సంపూర్ణావతార పురుషుడు. కృష్ణుడు ప్రేమమూర్తి. భక్తవత్సలుడు మీ మనస్సును కృష్ణలీలలతోను ఆయన మహిమలతోను నింపుకోండి. మీ హృదయ పద్మాలను కృష్ణప్రభువునకు పాదపీఠాలుగా సిద్ధంచేసుకొండి. అపుడు హృదయాలకు విలువహెచ్చుతుంటి.

అభ్రకపు పొరలు గల నేలలకే మిక్కిలి ధర పలుకుతుంటాయి. బంగారు గనులుగల భూమికి మరీ విలువ హెచ్చు. భూమివిలువ భూమిలో గల లోహధాతువులనుబట్టి ఉంటుంది. అలాగే హృదయాల విలువ వారి హృదయాలలోని భావాలనుబట్టి ఉంటుంది. మీరు మీ హృదయాలలో భగవంతుణ్ణి భద్రపరచుకోండి. అపుడు మీరు అత్యధికమైన విలువగల స్థితికి చేరుకొంటారు.

ఈ కలియుగంలో ప్రేమ ఎక్కడా కనిపించదు. ఈ భగవంతుని పిచ్చిలో ఉంటే జీవనోపాధి ఎలా అని మీరడగవచ్చు. వినండి! భగవంతుని పట్ల నిర్మల నిశ్చల విశ్వాసం మీకు కలిగితే భగవంతుడు మీకు అన్నమే కాదు అమృతం అందిస్తాడు. 'నేను మీకు అన్నీ సమకూరుస్తాను' అని అభయం ఇస్తున్నాను. అంటాడు సాయికృష్ణుడు.

*(ప్రశాంతి నిలయం కృష్ణాష్టమి 12.8.1963)*



# శ్రీ రూపగోస్వామి

సంకీర్తనోద్యమ ప్రవక్త చైతన్య మహాప్రభువు మహాప్రభు భక్తులలో ప్రసిద్ధి చెందిన ప్రత్యక్ష శిష్యులు ఆరుగురు. వారిలో రూపగోస్వామి ముఖ్యులు. వారు భక్తిరసామృతసింధువు పేర కృష్ణభక్తి శాస్త్రాన్ని రచించి, మహాప్రశంసలంది అందరిలో అగ్రేసరులైనారు.

సంస్కృతంలో వాల్మీకి రామాయణం వలె హిందీలో తులసీ రామాయణంగా శ్రీ గోస్వామితులసీదాసు 'రామచరితమానసం' ప్రసిద్ధి చెందింది.

శ్రీ రూపగోస్వామి కృష్ణకథను సంస్కృతంలో వ్రాసి దానికి 'భక్తి రసామృతసింధువు' అని పేరిడి తులసీదాసంత కీర్తి గడించాడు. ఇది లక్షణ గ్రంథంగా విలక్షణమైన ప్రఖ్యాతి పొందింది.

గోస్వామి తులసీదాసు రామాయణ ఘట్టాలు అయోధ్య-చిత్రకూటం వంటి రామక్షేత్రాలలో రచిస్తే రూపగోస్వామి కృష్ణకథలోని భక్తి శాస్త్ర ఘట్టాలను మధుర-బృందావనం వంటి కృష్ణ క్షేత్రాలలో రచించాడు. ఈ విధంగాఇరువురి గోస్వాములలో కొన్ని పోలికలు కనిపిస్తాయి. ఇరువురు మహాపండితులు. ఇరువురు మహాభక్త కవివరేణ్యులు. ప్రాతఃస్మరణీయములు.

భారతదేశం 15-16 శతాబ్దాలలో మహ్మదీయ దండయాత్రలలో అల్లకల్లోలమయింది. హైందవుల ఆక్రందనలు ఎక్కువైనాయి.

ఈ పరిస్థితులలో శ్రీచైతన్యమహాప్రభువు సాక్షాత్కరించారు. ''చైతన్యప్రచార

ఉద్యమం'' ప్రారంభం చేశారు. చైతన్యప్రభువు నిరాశాపరులకు ఆశాజ్యోతిగా హైందవ ధర్మజ్యోతిగా వంగదేశంలో ప్రత్యక్షమైనారు. అన్యమత పంకిలంలో దిగబడిన వారికి ఉపదేశమిచ్చి, మరల సంఘంలోకి జేర్చుకొన్నారు. ఉత్తమ భక్తులను ఉన్నతమైన గోస్వాములుగా తీర్చిదిద్దారు. ఆగోస్వాములు ఆదర్శ జీవనం చేస్తూ సంఘానికి మితిలేని సేవచేస్తూ హైందవ సంస్కృతికి నవజీవం పోశారు.

ఆ చైతన్య మహాప్రభువు యొక్క ప్రియతమ ప్రత్యక్ష శిష్యులలో ముఖ్యులు ఆరుగురు - వారిలో సనాతనగోస్వామి, రూపగోస్వామి అన్నదమ్ములు.

వీరు వంగదేశంలో సారస్వత బ్రాహ్మణ వంశంలో జన్మించారు. సంస్కృత అధ్యయనం చేశారు. పర్షియన్ వంటి ఇతర భాషలలో కూడ పండితులై, విపుల మేధాసంపన్నులై సంఘంలో రాణించారు.

వంగప్రాంతాన్ని హుసేన్‌షా నవాబు అనే మహ్మదీయ బాదుషా పరిపాలిస్తున్నారు. హైందవ పండితులకు ఆశ్రయంఇచ్చి ఆదరిస్తూండేవాడు. నవాబు ఈ అన్నదమ్ముల ప్రతిభా విశేషాలు గుర్తించి, తనవద్ద మంత్రులుగా నియమించుకొన్నాడు.

ఈ అన్నదమ్ములు మహ్మదీయ మతవ్యాపక ప్రలోభాలకు లొంగిపోయి తురుష్కమతం స్వీకరించారు. అన్నపేరు 'దబీరుఖాన్' అని, తమ్ముడి పేరు 'సాకారమల్లిక్' అని మార్చబడినాయి.

అన్నదమ్ములలో ఆత్మపరిశీలన ప్రారంభమయింది. ''అనశ్వర సంపద కాశించి, జన్మనిచ్చిన హైందవ మతానికి దూరమైనాము. అన్యమతం వలన అవమానాలు, ఆత్మన్యూనత అధికమైనాయి. తిరిగి మాతృమతం లోనికి వెళదాము అంటే పీఠాధిపతులు ద్వారాలు బిగించారు. ఇక మనగతి అథోగతియేనా?'' అని మానసికంగా క్రుంగిపోతున్నారు.

ఆ పరిస్థితిలో వంగదేశంలోని మాల్టా జిల్లాలోని రామకేళి గ్రామంలో అనుకోకుండా ఆ అన్నదమ్ములకు శ్రీచైతన్యమహాప్రభువు దర్శనం లభించింది. పాదస్పర్శనం దొరికింది. సంభాషణ కూడా సజావుగా సాగింది.

''శ్రీమన్నారాయణుడు ఏకైక దేవుడు ఆ స్వామి సదా అనేక అవతారాలు దాల్చి పదునాల్గు లోకాలు పాలిస్తున్నాడు. మహాప్రభువు త్రేతాయుగంలో

శ్రీరాముడుగా, ద్వాపరంలో శ్రీకృష్ణుడుగా పూర్ణావతారాలు దాల్చి దుష్ట శిక్షణ శిష్టరక్షణ గావిస్తున్నాడు.

శ్రీకృష్ణప్రభువు దేవకీవసుదేవుల గర్భం నుండి జనించి ఒక గొల్లపల్లెలో సామాన్య జనుల మధ్య పెరిగాడు. వేలాది ప్రజలను ఆకర్షించాడు. చిన్నతనం నుండే రాక్షసులను అద్భుతంగా హతం చేయసాగాడు. కంసాదులను వధించి, ధర్మ రక్షణ చేశాడు. అల్పులను ఆదుకొని అత్యద్భుతాలు చేసి, ఆర్తులకు అండగా కొండగా నిలబడ్డాడు. భక్తికి కేంద్ర బిందువైనాడు. అందరి హృదయ మందిరాలలో నిలచి, నీరాజనాలందుకోసాగాడు. శ్రీకృష్ణదేవుడు దయామయుడు. కృపాసింధువు. అనాథులకు ఆప్త బంధువు. ఆర్తత్రాణపరాయణుడు. శ్రీకృష్ణపరమాత్మను వేదవేదాంగాలు కొనియాడాయి. స్మృతులు పురాణాలు ఇతిహాసాలు ఉపనిషత్తులు వర్ణించి, చరితార్థాలయినాయి.

అట్టి స్వామిశాస్త్రం బాగాచదివి అర్థం చేసికొని శ్రీకృష్ణ చైతన్యంలో ప్రవేశించి సకలజన సేవాపరాయణులు కావటం మానవకర్తవ్యం. శ్రీకృష్ణస్మరణం సర్వపాపహరణం. కష్టనివారణకి కృష్ణ జపం ఒక్కటే సులభమైన మార్గం.

దేశంలో ఏ జాతివాడైనా ఎట్టి పతితుడైనా త్రికరణశుద్ధిగా పశ్చాత్తాపపడి శ్రీకృష్ణస్వామిని శరణు వేడినట్లైతే పరమ పవిత్రుడవుతాడు. ఇది సర్వమత సమ్మత సిద్ధాంతం. ఇది అక్షరాలా ఆచరణ సిద్ధాంతం. దీనికి హైందవ ధర్మ గ్రంథాలన్నీ ప్రామాణికాలు. ఇది వేదసారం. ధర్మసారం - ధర్మప్రవర్తకుల ప్రబోధ సారం.

శ్రీకృష్ణభక్తి వేదాంతంలో శిక్షణపొందినవాడు భక్తులలో 'గోస్వామి' అవుతాడు. ఇతడు భక్తి సామ్రాజ్యంలో సర్వోన్నతుడు. ఇది కృష్ణచైతన్య సిద్ధాంతం. పతితులు ఆర్తులు అందరూ మాసమాజంలోనికి ఆహ్వానితులే''

అనిన చైతన్య మహాప్రభువు ప్రబోధం దేశం అంతటా వ్యాపించింది. ఈ సిద్ధాంతం దేశవాసులకు శిరోధార్యం అయింది.

బ్రాహ్మణులై తురుష్కరాజ్యంలో కొలువు అనే చీకటి కొట్లలో పనిచేస్తున్న వారికి చైతన్య ప్రభువు ప్రబోధం సూర్యోదయమై కొండంత బలం చేకూర్చింది. ఇది వినిన హైందవ సారస్వత బ్రాహ్మణ సోదరులు చైతన్య ప్రభువు పాదాలు అశ్రయించారు. చైతన్యప్రభువు వారిని ఆదరించారు.

అన్నకంటే ముందుగా తమ్ముడు రూపగోస్వామి నవాబుకొలువు చాలించాడు. తనకురావలసిన ధనం కోట్లాది బంగారునాణేల రూపంలో నావలలో ఇంటికి జేరింది. ఆ ధనంలో సగం కృష్ణభక్తులకు విరివిగా దానం చేశాడు. మిగిలిన దానిలో సగం బంధువులకిచ్చాడు. ఆ మిగిలినది తనఖర్చులకు ఉంచుకొని చైతన్యప్రభువు ఉద్యమంలో ప్రధానభూమిక వహించాడు. భక్తులకు త్యాగజీవనంలో ఆదర్శవంతుడై రాణించాడు.

శ్రీ చైతన్యప్రభువు ఈ అన్నదమ్ములకు ప్రయాగ క్షేత్రంలో అశ్వమేధ ఘట్టంలో కృష్ణమంత్రం ఉపదేశించి, పరమపవిత్రులను చేశాడు.

శ్రీరూపగోస్వామి కృష్ణచైతన్యశాస్త్రాన్ని చైతన్యప్రభువు ద్వారా తెలుసుకొని సంస్కృతంలో 'భక్తిరసామృత సింధువు' అనే బృహత్తర గ్రంథం వెలయించాడు. అది కృష్ణచైతన్య భక్తులకు పరమ ప్రామాణికగ్రంథమై ప్రకాశిస్తున్నది.

రూపగోస్వామి 'భక్తిరసామృతసింధువు' రచింపగా శుష్క తార్కిక పండిత ప్రకాండులు కువిమర్శలు చేయసాగారు. రూపగోస్వామి బాధపడి అధ్యాత్మిక గురువు అగ్రజుడు అయిన శ్రీసనాతన గోస్వామితో ఆత్మవ్యథను చెప్పుకొన్నాడు. అపుడు సనాతనగోస్వామి ఈ విధంగా ధైర్యం చెప్పాడు -.

''తమ్ముడూ! భయపడకు. మహాసముద్రంలో కఠిన పర్వతాలు లావా జ్వాలలు వెడలగ్రక్కుతుంటాయి. దానివలన సముద్ర శీతలత్వానికి, గౌరవానికి, వ్యాపకానికి అవరోధం కాదు. అట్లే సమాజంలో శుష్కపండితులుంటారు. వారి వలన సమాజ పురోభివృద్ధి కుంటుపడదు. నీ భక్తిరసామృతసింధువును వీరేమీ చేయలేరు.'' అని చెప్పి తమ్మునికి అండగా నిలిచాడు. తర్కంతోనే తార్కికుల నోళ్ళు మూయించాడు.

సముద్రంలో తిమింగలాలు, మకరాలుంటాయి. అవి సమగ్ర ప్రగతిని క్రిందుసేయ లేవు. నీవు భక్తిప్రచారంలో ముందుకు పో! నేనున్నాను. భయమేల! అని అడుగడుగునా ఆత్మధైర్యం అందించాడు సనాతన గోస్వామి.

భక్తిరసం చాల విశాల సముద్రం. శ్రీ రూపగోస్వామి శ్రమ ఫలించింది. 'కృష్ణభక్తి' దేశం నలుమూలలా ప్రవహించింది. ఆ అమృతం అందరూ కడుపునిండా త్రాగి సంతృప్తి చెందారు. చెందుతున్నారు.

- శాంతిశ్రీ

తూర్పుసముద్రంలో-

# స్వభావభక్తి లహరి

అఖిల రసామృత మూర్తిః
ప్రసృమర రుచి రుద్ధ తారకా పాళిః
కలిత శ్యామా లలితో
రాధా ప్రేయాన్ విధుర్జయతి,

శ్రీకృష్ణపరమాత్మ అఖిల రసామృతమూర్తి. ఆ స్వామి సౌందర్యజలం నలుదిశల నిండి ఉంది. ఆ జలజల కాంతి చంద్రికా ప్రసారం చేత అసంఖ్య తారకల వంటి గోపికామణులూ కృష్ణ చంద్రుడిలో కలిసిపోయియున్నారు. అట్టి రాధా మనోహర స్వామికి జయమగుగాక!

ఈ రచనకు ప్రేరకుడైన చైతన్య ప్రభువుకు కారకుడైన శ్రీసత్యసాయీశ్వరునకు నమశ్శత పారిజాతాలు. ఇది అమృత సముద్రం. ఇది రూపగోస్వామి కృతం, సంస్కృతం, ఇది ఒక పదపారిజాతం, ఇది భక్తిరసామృతం. దీనివలన జీవితం పునీతం అవుతుంది. ఈ పాలసముద్రం శ్రీసాయి కృష్ణకు సుతిమెత్తని శయ్య యగుగాక! దీనిలో మాణిక్యాలున్నాయి. మకరాలూన్నాయి. అన్నీ శుభంకరాలు.

అందరికి వందన చందనాలు.

భక్తి అనగా ఇతరఅభిలాషలు లేక జ్ఞాన కర్మాదులకు కట్టివేయబడక భగవన్నామకీర్తన లీలావినోదాలలో నిరంతరం మగ్నమానస వ్యాపారం. ఫలాపేక్ష, లౌకికజ్ఞానం ఇందులో పనికిరావు. కామ్యకర్మలకు భక్తిలో చోటులేదు. శ్రీహరి పదపద్మారాధనయందే అనురక్తి గలది భక్తి.

హృషీకాలైన ఇంద్రియాలద్వారా హృషీకేశుడైన శ్రీమన్నారాయణుని సేవించుటే భక్తి అని నారదమహర్షి తన పాంచరాత్రంలో పేర్కొన్నాడు.

భక్తి క్లేశనాశని. శుభదాయిని. మోక్షకారిణి. ఆనంద సంధాయిని. భక్తి మహారాజ్ఞి. ఆమె రాజరాజేశ్వరి. ఆమె త్రిలోకైకరాజ్ఞి. భక్తితో చేసే హరినామస్మరణం అంతులేని ఫలంప్రసాదిస్తుంది అని నారద, కపిల, సనత్కుమారులు ప్రభోదించారు.

శ్రీకృష్ణుడు ఉద్ధవుడితో ఇలా అంటాడు. ''ఉద్ధవా! యజ్ఞాలూ, యాగాలూ, వేదాలూ, వేదాంతాలూ, తపస్సులూ, త్యాగాలూ, భక్తి నన్ను వశంచేసుకొన్నట్లుగా నన్ను సంతృప్తిపరచలేవు''.

నారదుడు ధర్మజుడితో అంటాడు - ''ధర్మజా! నీవు చాలా అదృష్టవంతుడివోయీ! శ్రీకృష్ణుడు పరబ్రహ్మమూర్తి. మానవాకారం ఎత్తి వచ్చిన మాధవుడు. నీ యింట్లో నీ సహపంక్తి భోజనాలు చేస్తున్నాడు. నీతో సరసాలాడుతాడు. భాగ్యం అంటే నీదే సుమా!''

శ్రీ కపిలమహర్షి తనతల్లి దేవహూతికి భక్తిని గురించి ఇలా బోధించాడు-

''అమ్మా! అహేతుకమూ, అవ్యవధానమూ అయిన పురుషోత్తమస్మరణమే అత్యంతిక భక్తి. ఈ భక్తిగలవాడు అన్యం అపేక్షించడు. జ్ఞానకర్మాదులలో నిమగ్నంకాడు. అతడు సాలోక్యం, సార్షి, సామీప్యం, సారూప్యం, సాయుజ్యం ఇస్తానన్నారాడు. పొందనినా వెళ్లడు. నాకు నీపాద సేవాభాగ్యం నిరంతరం కావాలని తిష్ఠ వేసుకొని నిష్ఠగా కూర్చుంటాడు. ఇది శుద్ధ భక్తి. ఇది ఉత్తమ భక్తి లక్షణం.

ఒల్లరు నిర్జరేంద్రపద - మొల్లరు బ్రహ్మ పదంబు పొందగా -
ఒల్లరు చక్రవర్తి పద - మొల్లరు సర్వ రసాధి పత్యమున్ -
ఒల్లరు యోగసిద్ధి - మరియొండు భవంబుల నొంద నీని నీ
సల్లలితాంఘ్రి రేణువుల సంగతి నొందిన ధన్యు లెప్పుడున్

- పోతన

తూర్పుసముద్రములో -

# సాధనాభక్తి లహరి

ఈ భక్తి సాధన-భావ-ప్రేమ అనే త్రిభంగిమలలో ఉదయిస్తుంది. నారదమహర్షి అంటాడు - మానవుడు తన మనస్సును ఏదో ఒక ఉపాయంద్వారా భగవంతుడితో లగ్నం చేస్తాడు. ఇది సాధన భక్తి. శుకమహర్షి పరీక్షిత్తుతో అన్నాడు -

విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబు మువ్మారు నె
మ్మన మందున్ దలపోసి ఎంతయు పరామర్శించి మోక్షంబు త
క్కిన మార్గంబుల వెంట లేదనుచు 'భక్తిన్' జింత జేసెన్ జనా
ర్దన నాత్మాకృతి నిర్వికారుడగుచున్ దన్మార్గ నిర్ణేత యై

భాగవతంలో చమస ముని ఇలా వక్కాణించాడు - రాజా! శ్రీమన్నారాయణుడి ముఖం-చేతులు-కాళ్ళు-తొడలు నాలుగూ నాలుగు ఆశ్రమ ధర్మస్వరూపాలే సుమా! శ్రీకృష్ణుడు ధర్మస్వరూపుడు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులు సత్త్వరజస్తమోగుణాలకు స్థానాలు. శిరస్సు సన్యాసం - వక్షస్థలం వానప్రస్థం - హృదయం బ్రహ్మచర్యం - జఘనం గార్హస్థ్యం. ఈ విశ్వవ్యవస్థ విశ్వనాథుడైన కృష్ణ స్వరూపమే. నాలుగు ఆశ్రమాలవారు అర్చనాదులు చేస్తుండాలి.

వ్యక్తి విధిగా సాధన చేయటం ద్వారా మొదట ఆసక్తి చూపకపోయినా క్రమక్రమంగా భక్తి కలిగితీరుతుంది. భక్తియోగం సిద్ధిస్తుంది ఉద్ధవా! ఈ నామాట నిజం అంటాడు కృష్ణదేవుడు.

'ఆర్తుడు - జిజ్ఞాసువు - అర్థార్థి - జ్ఞాని' గూర్చి భగవద్గీత ఇలా వివరణ ఇచ్చింది - శ్రీ కృష్ణ భగవానుడి కృపతో భక్తి అభ్యాసం వలన వారి లౌకిక వాంఛలు క్రమక్రమంగా నశిస్తాయి. వారు క్రమంగా శుద్ధ భక్తికి అధికారులవుతారు. ఈ నాలుగు దశలు భక్తికి పూర్వావస్థలే సుమా! గజేంద్రుడు ఆర్తితో జపించి, జపించి శుద్ధ భక్తుడైనాడు. శౌనకాది మునీంద్రులు జిజ్ఞాసతో సూతుని వలన భక్తిపద్ధతిగ్రహించి పరిశుద్ధ భక్తులైనారు. ధ్రువుడు రాజ్యవాంఛలు త్యజించి అర్థాదులు అనశ్వరాలని ముక్తి పొందాడు. సనకసనందాదులు జ్ఞానవారిధిలో ఓలలాడి మోక్షేచ్ఛవదలి మహాభక్తులై ప్రకాశించారు.

శ్రీకృష్ణ భగవానుడం, సాధనాభక్తిని అభ్యసించువారిని నిర్మల ప్రేమానందాంబుధిలో ఓలలాడిస్తాడు. భక్తుల పవిత్రహృదయఫలాన్ని భక్తిరాజేశ్వరి సంతోషంతో స్వీకరిస్తుంది.

సాధుల హృదయము నాయది -<br>
సాధుల హృదయంబు నేను - జగములనెల్లన్<br>
సాధుల నేనుయెరుంగుదు<br>
సాధు లెరుంగుదురు నాదు చరితము విప్రా!

"ఉద్ధవా! నాభక్తులు ఏకాంతులు, బుద్ధిమంతులు, సాధువులు వీరు దేనినీ అపేక్షించరు. చివరకు మోక్షం ఇస్తామన్నా అంగీకరింపరు. నాకు మనస్సు అర్పించినవారు నన్ను కాక మరొకరిని కోరరు. బ్రహ్మపదం, ఇంద్రపదం, సార్వభౌమత్వం వారికి రుచించదు" అన్నాడు శ్రీకృష్ణదేవుడు.

"రామప్రభూ! నీవు రాజాధిరాజువు. నేను నీదాసుడను. ఈ సంబంధం హరించే ముక్తి నాకు వద్దు. ముక్తి భవబంధాలు హరించేది అయినా నేను కోరను. నీవు ప్రభువుగా నేను దాసుడుగా, జన్మజన్మాలకు ఆనందంగా ఇదే స్వీకరిస్తాను" అంటాడు ఆంజనేయుడు.

ధీరులు నిరపేక్షులు ఆ<br>
త్మారాములు ఐన మునులు హరిభజనము ని<br>
ష్కారణము చేయుచుందురు<br>
నారాయణుడట్టివాడు నవ్యచరిత్రా!

భక్తులు సాధువుల మార్గం అనుసరిస్తారు. కృష్ణ ప్రీత్యర్థం భోగాలు త్యజిస్తారు. లభించినదే మహాభాగ్యంగా అనుభవిస్తారు. పాండిత్యప్రకర్షకు వాదించరు. ఏప్రాణిని హింసించరు. జపాలు స్తోత్రాలు భగవన్నామకీర్తనాదులు దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం చేస్తుంటారు. భక్తి రసాస్వాదనం మొదలైన ధర్మాలు దేహేంద్రియాంతఃకరణ శుద్ధికై నిత్యం సాధనచేస్తుంటారు.

ఫాలము నేలమోపి భయభక్తులతోడనమస్కరించి భూ
పాల కులోత్తముండు కరపద్మములన్ ముకుళించి నేడు మా
పాలిటి భాగ్యమెట్టిదియొ! పావనమూర్తివి పుణ్యకీర్తి వీ
వేళకు నీవు వచ్చితి వివేక విభూషణ! దివ్యభాషణా! అని

శుకమహర్షి నమస్కరించి అతిథి మర్యాద చేస్తాడు. ఇది భక్తుని సహజ లక్షణం. సేవాపరాధాలు, నామాపరాధాలు భక్తులకు పతనహేతువులు. పరదూషణం వేదశాస్త్ర తిరస్కరణం - భగవన్నింద - భక్తులకు కూడనిపని. సాధనకివి అవరోధాలు. సేవాభిలాష భక్తుని సహజప్రవృత్తి.

ఘనమగుదేవ! ఈ వరమెకాదు మహాత్మక! వాగ్వినిర్గతం
బనదగు తావకీన చరణాంబుజ చారు మరంద రూపమై
తనరిన కీర్తియున్ విని ముదంబును పొందగలేని మోక్షమై
ననుమది గోరనొల్ల అఘనాశ! రమేశ! సరోజలోచనా!

అనాసక్త భావంతో కర్మఫలం అనుభవిస్తూ కృష్ణా! నీ దయకై ఎదురు చూచేవాడు నీ సామ్రాజ్యంలోకి తేలికగా చేరుకోకల్గుతాడు కదా!

ఏ వేళన్ కృపజూచు - ఎన్నడు హరిన్ వీక్షింతు నంచాఢ్యుడై
నీ వెంటంబడి తొంటి కర్మచయమున్ నిర్మూలమున్ చేయుచున్
నీవాడై తనువాఙ్మనోగతుని సంసేవించు విన్నాణి ఓ
కైవల్యాధిప! లక్ష్మి నుద్దవడిగా గైకొన్న వాడీశ్వరా!

ఏకాంగభక్తి అనగా శ్రవణకీర్తనాదులలో ఏ ఒక్కటి అలవడినా మిగిలినవి గౌణాంగాలై ఏకాంగభక్తిలో చేరుతాయి.

శ్రీ విష్ణోః శ్రవణే పరీక్షిద భవ - ద్వైయాసికిః కీర్తనే -
ప్రహ్లాదః స్మరణే - తదంఘ్రి భజనే లక్ష్మీః - పృథుః పూజనే-
అక్రూర స్త్వభినందనే - కపిపతిర్దాస్యేఽథసఖ్యేర్జునః -
సర్వస్యాత్మనివేదనే బలి - రభూత్ కృష్ణాప్తిరేషాం పరా

ఏకాంగ భక్తిని ఉపాసించి కృతార్థులైనారు. భాగవతం శ్రవణంచేసి పరీక్షిన్మహారాజు - కీర్తించి శుకమహర్షి - నామస్మరణతో ప్రహ్లాదుడు, పాదపూజతో లక్ష్మీదేవి, అర్చనతో పృథుమహారాజు, వందనంతో అక్రూరుడు, దాస్యంతో హనుమంతుడు, స్నేహంచేసి అర్జునుడు, ఆత్మ నివేదనంతో బలి కృష్ణప్రేమకు పాత్రులైనారు.

అనేకాంగ భక్తికి అంబరీషుడు ఉదాహరణప్రాయుడు - ఈ మహా పురుషుడు తన సర్వాంగాలను కృష్ణసేవలో తల్లీనం గావించాడు -

అంబరీషుని మనస్సు కృష్ణధ్యానంలోనూ, వాక్కుహరినామ సంకీర్తనంలోనూ, హస్తాలు హరిసేవలోనూ, శ్రవణాలు కథాశ్రవణంలోనూ, కన్నులు కమలాకాంతుని దర్శించటంలోనూ, పాదాలు పరమేశ్వర మందిర ప్రదక్షిణంలోనూ, శిరస్సు నమస్కరించటంలోనూ, నాలుక పాటలు పాడటంలోనూ మగ్నమై మహాసౌఖ్యం మందారమాధుర్యం చూరగొంటున్నాయి ఆ భక్తుని సర్వాంగాలు భగవదాశ్రయరతిలో పారవశ్యం అనుభవిస్తున్నాయి.



తూర్పుసముద్రములో -

# భావనాభక్తి లహరి

భావభక్తి చిత్తానికి ఆర్ద్రత కలుగజేస్తుంది. ఇది శుద్ధసత్త్వ విశేషాత్మకం. సంవిత్ అనువృత్తి దాని స్వభావం. హ్లాదినీ స్వరూపం దీని మానసాకారం. హ్లాదినీ మహాశక్తి మహాభావం.

ఈ భావభక్తి పద్మానికి ప్రేమ సూర్య ప్రథమ కాంతికిరణం వంటిది. హరిచరణారవిందసేవాసక్తి సాధనభక్తి. ప్రేమ సంభవపూర్వదశ భావభక్తి. ఈ దశలో చేష్టారూపభక్తి భావరూపం సాధనరూపం కార్యరూపం అని అంకురాలు మొలకరిస్తాయి.

ఈ భావశక్తి ప్రేమకు అంకురదశ. ఇది మోక్షాన్ని తిరస్కరిస్తుంది. ఇది అప్రాకృతం. అయిననూ ఇది కృష్ణదేవుని కృపాబలంచేత భక్తులసాంగత్యదోహదం చేత ప్రాపంచిక భక్తులలో జనిస్తుంది.

ఈ ప్రేమాంకురం 'వైధి' - 'రాగానుగ' రెండువిధాలు. ఇది సాధన భక్తులద్వారా చిత్తవృత్తిగా ఆవిర్భవించి భావరూపంలో వెల్లడి అవుతుంది. ఇది శుద్ధ సత్త్వ విశేషరూపాత్మకంగా ప్రాపంచిక భక్తులలో జనించి తాదాత్మ్యకం పొందటానికి దారితీస్తుంది. ఇది కృష్ణ సేవాకార్యరసాస్వాదనకు కారణమవుతుంది. సాధనలోని అభినివేశంచేత భగవత్కృపతో ఈ భక్తి వైధీభక్తిగా ప్రేమాంకురదశ ప్రారంభమవుతుంది.

## వైయక్తిక భావభక్తి -

నారదమహర్షి సూతమునీశ్వరుడితో ఇలా అంటాడు - 'సూతర్షీ! గంగానదీతీర క్షేత్రరాజాలలో ఋషీశ్వరులు చాతుర్మాస్యచాంద్రాయణ వ్రతాలు చేస్తుంటే ప్రతిదినం నేను వెళ్ళి హరిలీలావినోదాలు హృదయ రంజకంగా వారు చెప్తుతుంటే వినేవాణ్ణి. వారి కథాకథన శైలీ విధానం రసవత్తరంగా సాగేది. ఆ కథా మాధుర్యం ఇంతంత అనలేము. ఎంతో మనోహరంగా ఉండేది!

దానివలన నాకు శ్రీ హరియందు మిక్కిలి భక్తి జనించింది. నాలోని రజస్తమోగుణాలు హరించి పోయాయి. అని నారదుడు తన పూర్వస్థితిని వెల్లడించాడు.

## రాగానుగ భావభక్తి -

ఈ భక్తి గోపికలలో ముఖ్యంగా శ్రీకృష్ణ దేవేరులలో ద్యోతకమవుతుంది. ప్రేమాసక్తి పూర్తిగా వ్యక్తమవుతుంది.

పతినాయింటికి మున్ను వచ్చె - ఇదె నాప్రాణేశు డస్మద్గృహా
గతుడయ్యెన్ - మును సేరెబో! తొలుతమత్కాంతుండు నాశాలకే -
ఇత రాలభ్య శుభంబుగంటి - నని తారింటింట నర్చించి ర
య్యతి వల్ నూరు పదారువేలునెన మంద్రవ్వేళ నాత్మేశ్వరున్

ఒక్క కృష్ణదేవుడు నూటపదారువేలమంది ఇళ్ళలో ఒక్కసారి బహురూపధారియై ఆగోపికలు ఎవరికివారు మాస్వామి మాయింటికే ముందు వచ్చారని సంబరపడేటట్లు పూజలందుకొన్నాడట. ఇది స్వామి మహత్వం. ఇది కృష్ణరాగానుగ భావభక్తికి ఉదాహరణీయమైనది. నామరుచి - భగవద్గుణాసక్తి - భక్తిప్రీతి - ఈ భావాలు కలిగినవారిలో బాహ్యంగా ఏవైనా దోషాలు కనిపించినా విజ్ఞులు అసూయ చూపరు. భక్తుడు నిర్లిప్తుడు, నిర్వికారుడు, నిత్యుడు, శుద్ధుడు. కనుక భావభక్తి ప్రేమభక్తికి సోపానం. భావభక్తి నానావిధ సంచారీ భావమయ ఉష్ణత వెల్వరించినా కూడా ఇది ఉత్తరోత్తర కోటి చంద్రసమ అమృత శీతలం శాంతి అందిస్తుంది.

తూర్పుసముద్రంలో -

# ప్రేమభక్తి లహరి

ఏ ప్రేమ మహిమచే ఎల్ల నక్షత్రాలు
నేలరాలక మింటనిలిచి యుండు
ఏ ప్రేమ మహిమ చే ఈధారుణీ చక్ర
మిరుసు లేకుండనే తిరుగుచుండు
ఏ ప్రేమ మహిమచే పృథివి పై బడకుండ
కడలి రాయడు కాళ్ళు ముడుచుకొనును
ఏ ప్రేమ మహిమచే ఈరేడు భువనాల
గాలి దేవుడు సురటీలు విసరు
ఆ మహాప్రేమ శాశ్వతమ్మైన ప్రేమ
అద్భుతమఖండ మవ్యక్తమ్మైన ప్రేమ
నిండియున్నది బ్రహ్మాండ భాండమెల్ల
ప్రేయసీ! సృష్టియంతయు ప్రేమమయము

ప్రేమలక్షణం ప్రథమదశకంటే చిత్తాన్ని మిక్కిలి ఆర్ద్రం చేస్తుంది. ఈ ప్రేమ పరమానందంలోని ఉత్కర్షను భగవానుడి పై అతిశయమమతానురాగాలను వృద్ధి చేస్తుంది. ఈ భావపరిణామ దశను పండితులు ప్రేమ అంటారు. భావం రుచిసాధకం. ప్రేమ మమతాపూరకం. భావం బెల్లం అయితే ప్రేమ పంచదార వంటిది. స్నేహ.భావాలు క్రమంగా రాగానురాగాది దశలు పొందుతాయి.

దేహగేహాదులు పైగల మమకారం వదలి ఆ మమకారం భగవంతునిపై చూపుటే ప్రేమ అన్నారు భీష్మ, ప్రహ్లాద, ఉద్ధవాదులు. ఇతర విషయాలపై కాక కేవలం కేశవుడిపై నుంచిన మమత్వం భక్తి లేక ప్రేమభక్తి అన్నారు నారదాదులు. ఈ భక్తికి ప్రమాణం ప్రహ్లాదుడే -

శ్రీ వల్లభుడు తన్ను చేరిన యట్లైన చెలికాండ్ర నెవ్వర జేర మరచు
అసురారి తన మ్రోల ఆడిన యట్లైన అసుర బాలురతోడ ఆడ మరచు
భక్తవత్సలుడు సంభాషించినట్లైన పరభాషలకు మారు పలుక మరచు
సురవంద్యుదనలోన చూచిన యట్లైన జొక్కిసమస్తమ్ము చూడమరచు

హరి పదాంభోజ యుగచింతనామృతమున
అంతరంగంబు నిండి నట్లైన నతడు
నిత్యపరిపూర్ణుడగుచు అన్నియును మరచి
జడత లేకయు నుండును జడుని భంగి.

వైకుంఠు చింతావివర్జిత చేష్టుడై ఒక్కడు నేడుచు నొక్కచోట
అశ్రాంత హరిభావనారూఢ చిత్తుడై ఉద్ధతుడైపాడు నొక్కచోట
విష్ణుడింతియెకాని వేరొండు లేడని ఒత్తలి నగుచుండు నొక్కచోట
నళినాక్షుడను నిధానము గంటి నేడని ఉబ్బిగంతులు వైచు నొక్కచోట

పలుకు నొక్కచోట పరమేశు కేశవు
ప్రణయ హర్ష జనిత బాష్పసలిల
మిశ్రిత పులకుడయి నిమేలితనేత్రుడై
ఒక్కచోట నిలిచి ఊరకుండు

పానీయంబులు త్రావుచున్ - గుడుచుచున్ - భాషించుచున్ - హాస లీ
లానిద్రాదులు సేయుచున్ - తిరుగుచున్ - లక్షించుచున్ - సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మరచెన్ - సురారి సుతుడే తద్విశ్వమున్ భూవరా!

ఇది ప్రగాఢ భక్తి వశంవదుడైన స్థితి

*దక్షిణసముద్రంలో -*

# విభావభక్తి లహరి

అనన్యాశ్రయుడు రూపమాధుర్య అలంకృతుడు
సహజ సౌందర్య శోభితుడు పాప నాశంకరుడు
నిత్య సత్యా సాహిత్యా మంగళ విగ్రహుడు అయిన
శ్రీ సాయికృష్ణ భగవానునకు జయమగు గాక!

ఇది భక్తి రసాంబుధిలో దక్షిణ విభాగం. దీనిలో భగవద్భక్తి రసలహరి వ్యాపించి ఉంటుంది. ఇది కృష్ణప్రేమ విషయిక విభావాది సామాగ్రి తో పరిపుష్టమయింది. ఇదే మధుర భావాల ద్వారా భక్తుల హృదయంలో ఆ స్వాద యోగ్యమై భక్తి రసంగా పరిణమిస్తుంది.

భక్తి రసాస్వాదనకు జన్మాంతర పుణ్యవిశేషంకానీ భక్తి వాసనకానీ ఉండాలి. అట్టి సజ్జనహృదయం భక్తిరసం ఆస్వాదించయోగ్యమవుతుంది. భక్తి రస ప్రవాహంలో భక్తుని చిత్తం ప్రసన్నమై శుద్ధ సాత్విక విశేషంగా ఆవిర్భవిస్తుంది. దానితో చిత్తం ఉజ్జ్వలమై ప్రకాశిస్తుంది. అట్టి చిత్తంగల వారిలో ఉల్లాసం భగవంతునియందు అనురక్తులైన వారి నిత్యసాంగత్యం కోసం ఉరకలు వేస్తుంది. హరిపాదారవింద సేవాభక్తి సమృద్ధమై వారి హృదయం భగవత్ప్రేమలో తల్లీనమవుతుంది.

ప్రేమ భక్తిలోని అంతర్భాగాలైన శ్రవణ కీర్తనాదులు నిత్యం అనుష్ఠిస్తుండటం వలన భక్త హృదయాలు రసోత్పత్తికి కారణభూతాలవుతాయి. వారిలోని ప్రాక్తన అద్యతన వాసనల వలన ఆనందం అనుభవైక వేద్యమవుతుంది. ఈ ఆనందం కృష్ణవిభావాదుల సాహచర్యం వలన పరిపుష్టమై ప్రౌఢమై ఆస్వాదనీయమవుతుంది.

ఈ ఆనందానికి కృష్ణుడు కేంద్రబిందువు. కృష్ణభక్తులు వేణునాదాలు వాద్యాలు దరహాసాలు పరిహాసాలు స్తంభాదులు నిర్వేదాలు దోహదాలు. ఈ రసాస్వాదనకు విభావాలు అనుభావాలు స్వాతికభావాలు సంచారీభావాలు గౌణప్రధాన కారణాలవుతుంటాయి. రసాస్వాదన హేతువులు విభావాలు. ఈ విభావాలు - ఆలంబన ఉద్దీపనాలు అని రెండు.

శ్రీ కృష్ణుడికి కృష్ణభక్తులే ఆలంబనాలు. విశ్వనాటక నాయక శిరోమణి శ్రీ కృష్ణ భగవానుడు ఈ జగన్నాటకాన్ని స్వయంగా పాత్రధారియై నిర్వహిస్తున్నాడు. భగవానుడిలోని భగవద్గుణాలు స్వయంగా ప్రకాశిస్తుంటాయి. ఇందులో స్వామి అన్యరూపంగాను స్వస్వరూపంగానూ నాటకానికి ఆలంబనం, ఆనందం అందిస్తుంటాడు.

## అన్యరూప ఆలంబనం

శ్రీకృష్ణుడు బ్రహ్మను మోహంలో పడవేశాడు. బ్రహ్మ గర్వించి గోవులనూ గోపాలకులనూ మాయంచేశాడు. ఆ సమయంలో గోపాలకృష్ణుడు తానే స్వయంగా గోవులుగానూ, గోపాలకులుగానూ నటించి తల్లిదండ్రులు మనస్సు శంకించనంతగా అనేక సంవత్సరాలు ఆనందం కలిగించాడు. బ్రహ్మకు మహాశ్చర్యం కలిగింది.

అపుడు బలరాముడు అచ్చెరువుతో అచ్యుతుణ్ణి ప్రస్తుతించాడు - ఆలమందను చూస్తుండగా నాకు శ్రీకృష్ణప్రేమ పెల్లుబకసాగింది. ఇదినాకే ఆనందంగా, ఆశ్చర్యంగా ఉందే! ఆహా! ఏమి ఈ కృష్ణలీల.

అని ఈ అనుభవంతో అనిశ్చితమతియై బలరాముడు విస్మయంతో స్తంభించిపోయాడు.

## స్వరూప ఆలంబనం

ఇది రెండు విధాలు - అవృతం, ప్రకటం.

ఇతర వేషంతో ఆచ్ఛాదింపబడింది. స్వరూపావృతం ఒకసారి కృష్ణదేవుడు వనితావేషం వేసుకొని ద్వారకలో విహరిస్తున్నాడు. ఉద్ధవుడు ఆ స్త్రీమూర్తిని దర్శించి ఇలా అనుకొన్నాడు - ఈ స్త్రీని చూడగానే నాకు పూజ్యభావం కల్గుతోంది. ఎవరై ఉంటారా! ఏముగురమ్మల అమ్మ ఏమో! అని కొంతసేపటికి తెలుసుకొని

'ఈవేషంలో విహరించాలని వాసుదేవుని వాంఛయేమో! జగన్మోహనంగా ఉందీవేషం. స్వామి ఏ వేషం వేసినా అద్భుతం! అనితర సాధ్యం.

**స్వరూప ప్రకటం -**

ఒకసారి కృష్ణరూపం ఇలా ప్రకటించాడు - ''మోహనకృష్ణుడు మధుసూధనుడుగా ఎంత శౌర్యం ప్రదర్శిస్తాడు. మధురమూర్తిగా ఎంత మహానందం అందిస్తాడు. శ్రీకృష్ణదేవుడి అందం ఆనందదాయకం కదా!

కృష్ణుని కంఠం కమనీయ శంఖంగా ఉంది. కన్నులు విచ్చిన కమలాలే సుమా ! - తనూకాంతి తమాల శోభను అధిగమిస్తోంది. మస్తకం మయూర పింఛంతో మహా సౌందర్యాన్ని విరజిమ్ముతోంది. శ్రీవత్సకౌస్తుభకాంతులు అందాన్ని అతిశయింపజేస్తున్నాయి.

శ్రీ కృష్ణస్వామిలో అరువదినాలుగు గుణాలు శోభిస్తున్నాయి అని కొందరు పండితులు అంటారు కానీ, పృథ్వీదేవి మరి ముప్పది ఎనిమిది లెక్కించింది - మరికొందరు మరో ఐదు గుణాలు చెప్పారు. మరికొందరు ఎన్నో ! ఈ విధంగా చెప్పుకుంటే దేవదేవుని గుణాలు అనంతం, అసంఖ్యాకం. అందులో 64 మాత్రం పరిశీలించుదాం -

1. సురమ్యాంగుడు, 2. సర్వలక్షణ లక్షితుడు, 3. రుచిరమూర్తి, 4.తేజశ్శాలి, 5. బలశాలి, 6. కిశోరమూర్తి, 7. వివిధ భాషావేది, 8. సత్యవాది, 9. ప్రియభాషి, 10. చతురభాషి, 11. సుపండితుడు, 12. సుబుద్ధి, 13. ప్రతిభాశాలి, 14. కళాశీలి, 15. చతురమతి, 16. దక్షుడు, 17. కృతజ్ఞుడు, 18. దృఢవ్రతుడు, 19. దేశకాల పాత్రజ్ఞుడు, 20. శాస్త్రచక్షువు, 21. శుచిమంతుడు, 22. జితేంద్రియుడు, 23. ధృతిమంతుడు, 24. దాంతుడు, 25. క్షమాశీలుడు, 26. గంభీరుడు, 27. ధైర్యశాలి, 28. సర్వసముడు, 29. వదాన్యుడు, 30.ధార్మికుడు, 31. శూరుడు, 32. దయాళువు, 33. మాన్యమానుడు, 34. ఉదారుడు, 35. వినయశీలుడు, 36. హ్రీమంతుడు, 37. శరణాగతపాలుడు, 38. సుఖి, 39. భక్తసుహృదుడు, 40. ప్రేమవశ్యుడు, 41. సర్వశుభంకరుడు, 42. ప్రతాపవంతుడు, 43. యశస్వి, 44. రక్తలోకుడు, 45. సాధుసమాశ్రయుడు, 46. నారీగణమనోహరుడు, 47. సర్వారాధ్యుడు, 48. సమృద్ధశాలి, 49. వరేణ్యుడు, 50. ఈశ్వరుడు, 51. సదాస్వరూపసంప్రాప్తుడు 52. సర్వజ్ఞుడు

53. నిత్యనూతనుడు 54. సచ్చిదానంద సాంద్రుడు 55. సర్వసిద్ధినిషే వితుడు 56. అవిచింత్యమహాశక్తిమంతుడు 57. కోటిబ్రహ్మాండవిగ్రహుడు 58. అవతారావళీబీజుడు 59. హతారిగతిదాయకుడు 60. ఆత్మారామగుణాకర్షి 61. లీలామధురమోహనుడు 62. ప్రేమరసమూర్తి 63. వేణుగోపాలుడు 64. రూపహగోస్వామి

ఇంకా! ఇంకా! ఎన్నో! ఎన్నో!

ఆయన లీలా మాధుర్యం ప్రేమమాధుర్యం మురలీగాన మాధుర్యం సుందర రూపమాధుర్యం ఇంతింతనలేము.

### 1. సురమ్యాంగుడు -

గోపాలకృష్ణుని సౌందర్యం వర్ణనాతీతం. ఆ స్వామి సర్వాంగాలు సాముద్రిక శాస్త్రపరంగా శ్రేష్ఠతరంగా ఉంటాయి. సర్వశుభ లక్షణుడు.

పూర్ణచంద్రముఖం - ఆజానుబాహుద్వయం - విశాలవక్షస్థలం - ప్రశంసనీయంగా ఉంటాయి. చూచిన కొద్దీ చవులూరిస్తాయి.

### 2. సర్వలక్షణ లక్షితుడు -

బాల కృష్ణమూర్తిని పరిశీలనగా, చూచి ఉపనందుడు నందమహారాజుతో బాలుడి శరీర లక్షణాలు శాస్త్రసమ్మతాలు అని పేరుపేరున శ్లాఘించాడు.

''నందా! నీ కుమారుడి అంగ విన్యాసం అద్భుతంగా కుదిరింది. ఒక గోపబాలుడిలో 32 శుభలక్షణాలు ఎలా కన్పిస్తున్నాయా అనిపిస్తోంది - నేత్రాలు, పాదాలు, పెదాలు, అరచేతులు, రాగరంజితాలు వక్షస్థలం, భుజాలు, నాసిక, ముఖం వగైరాలు వరణీయాలై ఉన్నాయి - ఇంకా అన్నీ శుభలక్షణాలే.

''గోపాలబాలుడైన ముకుందుడి హస్తరేఖలు పరిశీలించి, ఒకవృద్ధ విదుషీమణి యశోదతో 'ఈ బాలుడి రెండు చేతులలో శంఖచక్రాలు పాదాలలో ధ్వజాంకుశ మీనపద్మ రేఖలు అచ్చుగ్రుద్దినట్లున్నాయి. ఎంత అదృష్టవంతుడో! ఇవి దేవదేవలక్షణాలేనమ్మా!'' అని ఆశ్చర్యానందాలు పొందింది.

### 3. రుచిర మూర్తి -

చూచేవారికి రూపసౌందర్యం ద్వారా ఆనందం కలిగించటం రుచిర స్వభావం -

ధర్మరాజు చేసే రాజసూయయాగానికి వచ్చిన జనకోటి, మునికోటి ఇలా అనుకొంది -

'శ్రీకృష్ణ శరీర నిర్మాణంలో బ్రహ్మ తన పనితనం అంతా ప్రదర్శించి చరితార్థుడైనాడు. కృష్ణదేవుడెంత అందంగా ఆనందంగా ఉన్నాడు! కృష్ణ దర్శనంతో జన్మ పావనమయింది'.

**4. తేజశ్శాలి -**

దీప్తి ప్రభావం తేజోలక్షణాలు - స్వామి తేజస్వి. కౌస్తుభం తన కాంతులతో సూర్యుణ్ణి ధిక్కరించి, కృష్ణ వక్షస్థలం వరించి వచ్చింది. దాని ప్రభావం ఏమని చెప్పాలి. కంసచాణూర వీర భయంకరులను లలితలతాంగుడైన బాలకృష్ణుడు భంగపరచి సంహరించాడు. ఆ ప్రభావం అద్భుతం!

**5. బలశాలి -**

స్వామి అమిత ప్రాణశక్తి గలవాడు - వింధ్యపర్వతం అంత దైత్యరాజైన అరిష్టభయంకరుణ్ణి బాలకృష్ణుడు దూది ముద్దగా నలిపి పారేశాడు. చిటికెన వ్రేలిపై గోవర్ధనగిరిని గొడుగుగా ఎత్తిపట్టి, పదిరోజులు పలువురి ప్రాణరక్షణ చేసిన బాలగోపాలుడి బలం ఏమని చెప్పగలం.

**6. కిశోర మూర్తి**

బాల్యం పౌగండం, కైశోరం అని వయో విన్యాసాలు వివిధ రకాలు. అయినా కైశోరం సర్వ భక్తిరసాలకు ఆశ్రయం ఇది సర్వ ఉత్తమ గుణాలకు నిత్యనూతన విలాసాలకు కేంద్రం. శ్రీకృష్ణదేవుడు నిత్యకిశోరమూర్తి. కృష్ణుడిలో యౌవనం ఆరంభం నుండి ఉంది. ఆతడి మందహాసశోభ పూర్ణచంద్రకాంతిని ధిక్కరిస్తుంది. ఆ రూపమాధుర్యం మన్మధకళాస్నిగ్ధం. అది ముగ్ధమనోహరం.

**7. వివిద భాషావేది**

సంస్కృత ప్రాకృత పైశాచికాది భాషలేకాక పశుపక్ష్యాది జంతుభాషలెరిగినవాడు బహుభాషావేత్త. ఒకసారి గొప్ప అనుభవజ్ఞురాలు జ్ఞానవయో వృద్ధురాలు బహుభాషా విదుషీమణియైన కుందలత ఇలా చెప్పి ఆశ్చర్యపోతుంటే...

ఆశ్చర్యం ! మహాశ్చర్యం !! ఈ మనగోపాలకృష్ణుడు వ్రజకాంతామణులతో శౌరసేనిలోనూ, దేవరాజులతో గీర్వాణంలోనూ, పలువురితో ప్రాకృత భాషలతోనూ, అడవి జాతులతో పైశాచిక భాషతోనూ, పశుపక్షులతో జంతుభాషతోనూ, పక్షిభాషతోనూ ఆయా భాషల వారితో వారి వారి మాతృభాషలతో అతి మధురంగా అతి శుద్ధంగా మాట్లాడుతున్నాడు. దుబాసి అవసరమేలేదు. బాలకృష్ణయ్యకు ఇన్ని భాషలు ఎలా వచ్చాయబ్బా!

ఎప్పుడూ మనమధ్యలోనే ఉండేవాడు కదా!

తలచుకొంటేనే ఆనందం, ఆశ్చర్యం కల్గుతోంది.

ఈతడు సామాన్యుడు కాదు. సర్వజ్ఞుడు. సర్వజ్ఞుడేయౌ.

**8. సత్యవాది -**

అసత్యం పలుకనివాడు సత్యవాగ్భూషణుడు.

భారతయుద్ధం అయిన తర్వాత కుంతీదేవి కృష్ణభగవానుడితో ఇలా అంటుంది. ''కృష్ణా! నీవు అక్షరాలా సత్యవాగ్భూషణుడవే. నీ వాక్కులు నిత్యసత్యాలు. అక్షరాలా జరిగితీరుతాయి. యుద్ధారంభంలో 'నాపిల్లల్ని రక్షిస్తాను' అంటే ఏమో అనుకున్నాను. చివరకు నాపిల్లలను క్షేమంగా అయిదుగురిని అప్పగించావు.

సూర్యుడు చల్లబడవచ్చు, చంద్రుడు నిప్పులు గ్రక్కవచ్చు, సముద్రాలు ఇంక వచ్చు, కానీ నీ అమృతవాక్కులు అసత్యాలు కావు. నీవు నిత్య సత్య శివసుందరుడవు. నీకు నీరాజనాలు.

నీవు ఒకసారి బ్రాహ్మణవేషంలో జరాసంధుడితో - ''మగధరాజా! మదాంధా! ఈ పాండవులూ, నేనూ నీకు శత్రువులం నేను ఎవరో కాదు. శ్రీకృష్ణుణ్ణి. నీవు కొద్దిలో మరణిస్తావు. ఇది యధార్థం నీయిష్టం జాగ్రత్త!'' అని సత్యమైన విషయం చెప్పావు.

**9. ప్రియబాషి -**

అపరాధం చేస్తున్నవారితో కూడా ప్రియంగా మాట్లాడేవాడు ప్రియంవదుడు - కాళియ సరస్సులో ఉండి కాళియుడు జనకంటకుడై, కృష్ణుణ్ణి, కృష్ణ

పరివారాలను బాధలు పెట్టి ప్రాణాలు హరిస్తుండేవాడు. చివరకు కాళీయుణ్ణి మర్దించి, 'ఇక బుద్ధిగా ఉండు నీకు ఇప్పటికిగానీ బుద్ధి రాలేదు. ఈ సరస్సు వదలిపో. నిన్ను బాధించనుపో. నా పాదముద్రలు నీవు తలధరించు. నీకు క్షేమం కలుగుతుంది.

దేవ బ్రాహణ జనగోపశుపక్ష్యాదుల హితంగోరి, నిన్ను పంపుతున్నాను. నీకు భద్రమస్తు' అని ప్రియంగా పలికి పంపాడు.

### 10. చతుర భాషి -

చక్కగా పలుకువాడు. శబ్దమాధుర్యం అర్థమాధుర్యం పలుకు పలుకులోనూ తొణికిసలాడుతుంది. శబ్దం శ్రవణాలను, అర్థం అంతరాత్మను ఆకర్షిస్తాయి. గోకులంపై రాళ్ళవానలు కురిపించిన ఇంద్రుడి గర్వం భంగం చేయాలి అని యాదవ మహాసభలో కృష్ణప్రభువు మాట్లాడాడు. ఆశబ్దమాధుర్యం విని సర్వులు వశమైనారు. ఆ తియ్యని తేనెలూరు ఆ పలుకుల తీరు ఒక పండితుడు ఆనందంతో ఇలా వివరించాడు -

'సఖులారా! కృష్ణవాఙ్మాధుర్యం విన్నారా! ఎంత మధురతరంగా ఉంది. ఒక్కొక్క వాక్యం ఒక్కొక్క మధుర కావ్యంగా ఉంది. అవి ఎంత సుస్పష్టాలు - ఎంత లలిత కోమలాలు, ఎంతమధుర మంజుల మార్దవాలు, ఉచ్చారణలో ఎంత ఉదార ఉదాత్తభావం. అక్షరమక్షరమందు సుధారసనిష్యందమే కదా! వాసుదేవుని వాఙ్మాధుర్యం ఎవరిని ఆకర్షింపదు! వహ్వా! వహ్వా! అది అద్భుతం.

అర్థమాధుర్యం వలన వాక్కులు ప్రభావవంతములై భావ పరివర్తన కలిగిస్తాయి. వాసుదేవుడి వాక్కులు ప్రతివాదుల మేధస్సులను పరివర్తన చేస్తాయి. ఆ ఉపన్యాస విన్యాసం యుక్తియుక్తంగానూ, సంశయహరణంగానూ, పరిమితాక్షర సుందరంగానూ శోభిస్తుంది. వ్యర్థవాగాడంబరం ఉండదు. తర్కవితర్కాలకు సమాధానంగా రాణిస్తుంది. అది ముఖ్యార్థ పరిపుష్టమై, ముక్కోటి వారినీ ఆకట్టుకొని వస్తుంది. చిత్తానికి శాంతినీ, కాంతినీ కూర్చి పదిమందికీ మోదం కలిగిస్తాయి ఆ మాటలు

### 11. సుపండితుడు -

శ్రీకృష్ణమూర్తిలో విద్వత్తు, నీతి రెండూ ఉన్నాయి. శాస్త్ర రహస్యాలు, ధర్మసూక్ష్మాలు తెలియటం విద్వత్తు. యథోచిత కర్మకలాపాలతో ఆదర్శజీవనం చేయించటం నీతిజ్ఞత.

శ్రీకృష్ణుడి విద్వత్తు గూర్చి నారదమహర్షి ఇలా అంటాడు-

'కృష్ణ సాగరం నుండి బ్రహ్మ వివిధ విద్యానదులను ప్రపంచ దేశాలకుపట్టి ప్రవహింపజేస్తున్నాడు. ఆ విద్యా నదులు సందీపని సూర్యరశ్మికి ఆవిరై మేఘాలై తిరుగుతూ కృష్ణ కృపావీచికలు తగలగనే కృష్ణ సాగరంలో పడిపోతున్నాయి.

ఇలా కృష్ణస్వామియే సకల విద్యలకు నిధి'

సిద్ధచారణులు ఇలా విశదంగా వర్ణించారు -

''ఉత్తమకులంలో జన్మించి, విద్యావధూటి మేదస్సు పండించుకొని షడంగాలైన కాళ్ళుచేతులు, తలనడుము పుష్టివంతం చేసుకొని నీతిశాస్త్రంలో వృద్ధ శిక్షలంది చతుర్దశ గుణపారీణయై సుసంగతుని వివాహం చేసుకొన్నట్లుగా ఆమ్నాయ మంచి ఆన్వయంలో జనించి, శ్రుతిస్మృతులు గ్రహించి, శిక్షాకల్ప వ్యాకరణ ఛందోనిరుక్త జ్యోతిషాలలో నిపుణయై, తర్కంలో జయించి, పురాణాలే పూర్వ బంధుజనంకాగా నాలుగు వేదాలు, ఆరు వేదాంగాలు, నాలుగు పురాణాలు అనే పదునాలుగు విద్యలు అందుకొని గురుకులంలో సందీపని సాక్షిగా నిన్నుసేవించిన విద్యాసరస్వతి నిజంగా కృతార్థురాలు కృష్ణా!

కృష్ణప్రభువు రాజనీతిదురంధరుడు. ప్రభువు మధురా మండలం పాలించాడు. ఆ ప్రభువు తస్కరులకు యముడు. సుకృతులకు మలయానిలుడు. రమణీమణులకు మన్మథమన్మథుడు. ఆర్తితో అర్థించువారలకు కల్పవృక్షం. బంధుజనాలకు కృపాసింధువు. ఆప్తచకోరాలకు పూర్ణచంద్రుడు. శత్రువులకు కాలరుద్రుడు.

మహారాజనీతి కుశలులలో కృష్ణప్రభువు అగ్రగణ్యుడు.

## 12. సుబుద్ధి -

సూక్ష్మ బుద్ధినీ - మేధావినీ బుద్ధిమంతులంటారు. కృష్ణ విద్యార్థి మేధా సంపదను ఆచార్యవర్యులు ఇలా చెప్పుకోసాగారు. అవంతీపురంలోని సందీపని గురుకులంలో కృష్ణబాలుడు సర్వవిద్యలూ హృదయంగమం చేసుకొన్నాడు. ఆ బాలుడుకి ఒక్కసారి బోధిస్తే చాలు, ఆ విద్యాచిత్రాలు కృష్ణహృదయ మందిర కుడ్యంపై చిత్రాతిచిత్రంగా చిత్తరువువలె హత్తుకుపోయేవి. ఆ జ్ఞాపక శక్తీ, ఆచతురోక్తి ఆచార్యభక్తి అనితర సాధ్యం కదా!

స్వామి సూక్ష్మబుద్ధిని గురించి ఒక ఉదాహరణ ఇలా విన్నవిస్తారు -

ఒకసారి కాలయవనుడు మధురాపురి పైకి దండెత్తి వచ్చాడు. సర్వజ్ఞుడైన కృష్ణప్రభువు సూక్ష్మ బుద్ధిని ఇలా ప్రదర్శించాడు.

'ఈ కాలయవనుడు మ్లేచ్ఛరాజు. ఇతడు నాచే చంపదగిన వాడుకాడు. నేను భయపడినట్లు నటించి వీనిని తీసికొని ముచుకుందుని గుహ మీదుగా పారి పోతుంటాను. అది అంధకారంతో నిండిన గుహ కదా! అందులో ముచుకుంద ముని నిద్రిస్తుంటాడాయె. నిద్రకు భంగం కలుగగానే ముని కోపంగా చూస్తాడు. ఆ చూపుతో చీకటిలో నన్ను వెతుకుతూ వచ్చిన యవనుడు భస్మమౌతాడు అని అటువైపు ఇతణ్ణి తీసుకపోతాడు.

ఇది సూక్ష్మబుద్ధి.

### 13. ప్రతిభాశాలి -

నవ్యకళ లెరిగి నవనవోన్మేష శాలిని యగు మతిమంతుడు ప్రతిభాన్వితుడు. 'పద్యావళి' గ్రంథంలో కృష్ణ ప్రతిభ వర్ణించబడింది -

అది రాధాదేవి శయన మందిరం. అలంకరించుకొని రాధ వాసవసజ్జియై ప్రియునికై ఎదురు చూస్తోంది. కృష్ణమోహనుడు వస్తూ కనిపించాడు. రాధకు పరాచికం ఆడదామనిపించి, తలుపువేసింది. వారి మధ్య మధుర భాషణ ఇలా సాగింది.

కృష్ణ - తలుపు! తలుపు!

రాధ - ఏం తలపూ! మీరెవరూ!

కృష్ణ - వాసుదేవుణ్ణి.

రాధ - మీ వాసం ఎక్కడ?

కృష్ణ - మదిరేక్షణా! ఇది నావాసం పీతాంబరం.

రాధ - ఘటికుడవే! వాసం ఎక్కడో చెప్పు.

కృష్ణ - నీ గాత్ర సంసర్గం దగ్గరే సుగంధం. సౌభాగ్యవతీ!

రాధ - ధూర్త గోపాలా! యామినిలో ఎక్కడున్నావు.

కృష్ణ - తను హీన యామినిలో దాగి ఎక్కడుంటాను?

అని చమత్కార సంభాషణ జరిపిన ప్రతిభాన్వితుడు మిమ్ము సదా రక్షించుగాక!

వాసం = వస్త్రం, నివాసం, సుగంధం. యామిని = చౌర్యం, రాత్రి, 'నేను రాధాస్వామిని' అంటాడేమోనని రాధకు ఆశ. 'నివాసం నీదగ్గరే' అంటాడేమో అనుకొంది. కృష్ణమోహనుడు ప్రతిభా సంపన్నుడు కదా! శబ్దంలోని నానార్థాలు తీసిమాట్లాడాడు. ఇది వక్రోక్తి అలంకారం.

**14. కళాశాలి -**

కళావిలాస చతురుడు కృష్ణమోహనుడు. ఎంత మనోహరంగా క్రీడలలో నాయకత్వం వహిస్తాడో చూడు. స్వామి సకల కళాకోవిదుడు. చతురవిలాసుడు పురుషోత్తముడు. మధురగీతాలు ఆలపిస్తాడు. అపూర్వగీతాలూ రచిస్తాడు. నృత్యము చేస్తాడు. తాండవం ప్రదర్శిస్తాడు.

మురళి మ్రోగిస్తాడు. మృదంగం వాయిస్తాడు.

ప్రతికళలోనూ నైపుణ్యం చూపుతాడు. కళాప్రదర్శనలో విశ్వాన్నే మైమరపిస్తాడు. శృంగారమాలా రచనలో కానీ. వీర విహారంలో కానీ ఆయన అగ్రేసరుడే. అన్నిటా స్వామి విదగ్ధుడు.

**15. చతురమతి -**

ఒకే సమయంలో శతాధిక పండిత ప్రకాండులకు సముచిత సమ్మోహన సమాధానాలు చెప్పగలచతుర భాషి స్వామి. ఒకే సమయంలో స్వామిని చూస్తుంటే అనేక మనస్తత్వాలు గలవారికి యద్భావం తద్భవతి అన్నట్లు వారివారికి తగినట్లు కనిపిస్తాడు. సమాధానమిస్తాడు. ఆచాతుర్యం ఒక్క మోహన కృష్ణకే ఉంది.

అరిష్టాసురులకు భయంకరుడుగానూ, గోపికలకు మన్మథ మన్మథుడుగానూ, మిత్రులకు ఆప్తసఖుడుగానూ, యుద్ధవీరులకు మహాప్రతాపుడూ పరాక్రమశాలిగానూ, స్వామి భాసిస్తుండేవాడు.

**16. దక్షుడు -**

దుష్కర కార్యాలను శీఘ్రంగా చేస్తుండేవాడు దక్షుడు. శ్రీకృష్ణుడు దక్షుడని భాగవతం విశదం చేస్తుంది. ''రాజా! మహాయుద్ధరంగంలో గొప్పగొప్ప యోధాగ్రేసరులు బ్రహ్మాస్త్రాలు, ఆగ్నేయాస్త్రాలు, శస్త్రాలు ప్రయోగించి, పాండవ సైన్య సమూహానికి అమిత భయావహం కలిగిస్తున్నారు. వీరవిహారం చేస్తూ,

విరుచుక పడుతున్నారు. అపుడు దక్షుడైన భక్త రక్షకుడు ప్రతివానిపై మూడుమూడు బాణాలు వేసి, పరాభూతుల్ని చేశాడు.

మొనసి దనుజయోధ ముఖ్యులు నిగుడించు
శస్త్ర సముదయమ్ము జనవరేణ్య!
మురహరులకు వరుస మూడేసి కోలల
ఖండితంబు జేసె గగనమందు

**17. కృతజ్ఞుడు -**

తనకు చేసిన పూజోపచారాలను ఉపకారాలను గుర్తు పెట్టుకొనేవాడు కృతజ్ఞుడు.

ద్రౌపది కృష్ణుని నిత్యం స్మరిస్తూ పూజలు చేస్తుండేది. ఆమె ఇచ్చే పత్రపుష్పాలకే సంతోషిస్తూండేవాడు. ద్రౌపదీదేవి పరమభక్తురాలు. ఆమెకేమీ ఉపకారం చేయలేక పోతున్నాను అనుకొంటుండేవాడు. దుష్టులు వస్త్రాహరణం చేస్తుంటే ఒక్కసారి ఆర్తితో 'నారాయణా' ఆర్తత్రాణపారాయణా! భక్తజనరక్షణా! పాహిమాం' అని పిలిచింది.

దానివలన మానరక్షణ గావించి, ఋణం తీర్చుకొన్నాను. కొంతలోకొంత. ఆమెకెంత చేసినా ఋణం తీరదు. అంటాడు కృతజ్ఞతతో స్వామి -

రామావతారంలో జాంబవతుడొనర్చిన సేవలు గుర్తించి, కృష్ణావతారంలో అతని అపరాధాలు క్షమించి, అతని బాలికను గ్రహించి, కళ్యాణం చేసుకొన్నాడు. కానీ, అందాలు హోదాలు చూడలేదు. సజ్జనులు తనకు చేసిన మేలు మరువరు. అది కృతజ్ఞత లక్షణం.

**18. దృఢవ్రతుడు -**

సత్య ప్రతిన గలవాడు - సత్యనియమవ్రతం దృఢంగా చేసేవాడు సుదృఢవ్రతుడు. స్వామి నిత్యవ్రతుడు. సుదృఢవ్రతుడు. 'నారదా! దేవగంధర్వులు - యక్ష రాక్షసులు - నాగేంద్ర ఖగేంద్ర ప్రముఖులు నరవానర వీరాధివీరులు నా ప్రతిజ్ఞను భంగపుచ్చాలని ప్రయత్నించి, వారే భంగపడి ఊరుకున్నారు.

నా శపథం ఎప్పుడూ జరిగే తీరుతుంది. ఇది సత్యం. యధార్థం.

నా ప్రతిజ్ఞ సఫలం చేయటానికి ఇంద్ర నందన వనంలోని పారిజాతాన్ని పెకలించి తెచ్చి, దేవేంద్రుణ్ణి పారిజాతం లేని వాణ్ణిగా చేశాను.

శత్రు సంహారం చేసి చేయించి, యధిష్ఠిరుణ్ణి శత్రుశూన్యుడుగా చేశాను. సత్యకు ద్రౌపదికి ఆనందం కూర్చాను'' అన్నాడు కృష్ణదేవుడు. ఇది హరివంశ కథ.

'కృష్ణా! నా తప్పు క్షమించు. గోవర్ధన పర్వతం గొడుగుగాబట్టి, దుష్కర కార్యం నిర్వహించి, నాభక్తులు ఎన్నడూను దుఃఖంచరు. అను నియమం సత్యం చేసి, నాకు బుద్ధి చెప్పావు. నీకు శత సహస్రవందనాలు' అన్నాడు దేవేంద్ర ప్రభువు కృష్ణదేవునితో పశ్చాత్తాపపడి.

### 19. దేశకాల పాత్రజ్ఞుడు -

'దేశాలలో భారతదేశం వనాలలో బృందావనం - ఋతువులలో శరదృతువు రాత్రులలో పూర్ణ చంద్రికా యుతమైన సుందరతర రాత్రికాలం - మహిళాలోకంలో వ్రజభామల వంటి అందమైన అదృష్టవంతులు - శ్రేష్ఠతములు. ఇలా పరిశీలనజేసి, బృందావనంలో వెన్నెల రాత్రి వ్రజాంగనలతో రాస క్రీడ సలిపాను' అని పేర్కొన్నాడు.

ఇలా దేశకాల పాత్రల నెరిగినవాడు దేశకాల పాత్రజ్ఞుడు స్వామి.

### 20. శాస్త్ర చక్షువు -

శాస్త్రానుసారం కార్యకలాపం చేయువాడు శాస్త్రచక్షువు. శుభాశుభ యుక్తాయుక్త యోగ్యాయోగ్య సాధనాసాధనా విషయ వివేచనా జ్ఞానం గలవాడు కృష్ణభగవానుడు.

### 21. శుచిమంతుడు -

శుచిమంతులలో పావనుడు విశుద్ధ జీవనుడు అని రెండు విధాలు - ఈ రెండు గుణాలకు కృష్ణదేవుని పేర్కొంటుంది. పద్మపురాణం -

''ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణుడు పావనుడు. పరిశుద్ధుడు. ఉత్తమ ...కుడు - అనుగ్రహంతో అనేక విధాలుగా ఉన్న మానవులను పావనం చేస్తాడు. కనుక నీవు శ్రద్ధతో భక్తితో శుద్ధమైన మనస్సుతో మాధవుని మనసారా సేవింపుము. నీకు క్షేమం, శ్రేయమూ కలుగుతుంది. నామస్మరణం అనే అరుణోదయంతో నీపాతక అంధకారం అంతరిస్తుంది.'' విదుర నీతి.

"ఓ శమంతకమణీ! కుమారీ! శాంతంగా నా మాటలు ఆలోచించు. ఒక్కసారి మననం చేసుకో! మంచి కలుగుతుంది. మీనాన్న సత్రాజిత్తు నిన్ను తమ్ముడి వెంటపంపి, నీవు కనిపించక పోయేసరికి కృష్ణదేవుణ్ణి ఎన్ని మాటలన్నాడు.

శ్రీకృష్ణచంద్రుడు శుద్ధ మనస్వియై, నిన్ను అడివంతా అన్వేషించి తెచ్చుటకు ఎన్ని కష్టాలు ఎదుర్కొన్నాడు! ఎందరితో యుద్ధం చేశాడు - ఎన్ని అపనిందలు భరించాడు.

అవి అన్నీ నీపై మోహంతోకాదే! ఆదేవుడిలో మమకారం కానీ, వికారం కానీ లేదే! కారుణ్యమేగాని కపటం కార్పణ్యం అనేవి లేవే! ఎంత ఉదారంగా ప్రవర్తించాడు మహానుభావుడు. ఆయన విశుద్ధ స్వభావుడు.

మీ నాయనలో తొందరపాటుతనం, కాలుష్యం, స్వార్థం నిలువెల్ల ఉన్నాయి కదా! ఇపుడు నీవు కౌస్తుభం సరసన రాణించాలని ఎందుకు కోరుకొంటావు. నీకది ప్రాప్తంకాదు. ఆయన అడిగినప్పుడు కాదన్నారు కదా!"

అని శమంతకంతో ఉద్ధవుడు కృష్ణదేవుడి విశుద్ధ వర్తనం వివరిస్తాడు.

## 22. జితేంద్రియుడు

పరమ జితేంద్రియుణ్ణి వశి అని పండితులు పేర్కొంటారు.

శ్రీ కృష్ణ భగవానుడు పరమ జితేంద్రియుడు. ఏలనంటే అత్యుత్తమ సౌందర్యవతులు వ్రజకాంతలు. దేవతా సన్నిభులు. వారి హావ భావ విలాసాలు పరమ ఆకర్షణీయాలు, స్మరణీయాలు అత్యంత రమణీయాలు. వారిక్రీగంటి చూపులు మదనుడు తూపుల మిక్కిలి వాడి. వారు మహా మనో నిగ్రహం గలవారు. వారి మానసాలను మన్మథుడు కదిలించలేక విసిగివేసారి వెళ్ళిపోయాడు. అట్టి స్నిగ్ధ ముగ్ధకాంతలు వ్రజాంగనలు.

వారు బాలకృష్ణుణ్ణి వరించారు. వారి చూపుల తూపులకు కృష్ణుడు చలించలేదు. హరిణాక్షులు హరిని మోహింప జేయలేకపోయారు.

## 23. ధృతిమంతుడు -

ఫలసిద్ధి లభించువరకు దీక్షగా కార్యమగ్నాంత రంగుడైన వాడు సుస్థిరుడు. శ్రీకృష్ణుడు శమంతకమణి విషయంలో అపనిందలకులోనైనాడు. ఈ నీలాపనిందలు

వదిలించుకొనే నిమిత్తం తానే శమంతకమణి అన్వేషణకు బయలుదేరి ఎన్నో వనాలు, గహనాలు తిరిగాడు. కష్టాలు సహించాడు. అయినా నిరాశ పొందలేదు. సింహం రాజసింహం పోరాడుకొన్న గుర్తులు పట్టాడు. సింహపు అడుగుజాడల వెంట గుహలలోకి జేరాడు. గుహలలో సింహ భల్లూకాల సమరం పసిగట్టాడు. భల్లూకం జాడలతో ఒక చీకటి గుహలో ప్రవేశించి, మణిని కనుగొని, యుద్ధం చేసి ఎవరినీ హింసించక మణి పట్టి గానీ ఇంటి ముఖం పట్టలేదు.

అది దృఢమైన మహనీయుల కార్యదీక్ష. అది సుస్థిర ప్రజ్ఞా లక్షణం.

**24. దాంతుడు -**

ఇష్టసాధనకు దుస్సహ క్లేశాలు భరించువాడు దాంతుడు శాంతుడు.

శ్రీకృష్ణుడు గురుకులంలో సాందీపనిగురు శుశ్రూష చేస్తూ, విద్యార్థి జీవనం సాగిస్తున్నాడు. కృష్ణుడు కోమలాంగుడు అయినా కఠినమైన పనులకు వెనకాడేవాడు కాదు.

గురుకులంలో ఉండి సమీపంలోని కారడవుల లోకి వెళ్ళి కట్టెలు మోసుకొని వచ్చేవాడు. రాత్రివేళల ఝం ఝూమారుతంలో వర్షపాతంలో కఠిన శిలాప్రదేశాలలో పంక నిర్మగ్ననదీ, గర్భాలలో కిల్బిష భూమిలో దిగి రావలసి వచ్చేది. అన్నీ సహించి, శుశ్రూష సంతోషంగా చేశాడు.

మహాత్ములు లోకోత్తర స్వభావవ్యక్తులు. వారి చర్యలు ఊహలకు అందవు. అవి తలంచుకొంటేనే ఒడలు జలదరిస్తాయి.

**25. క్షమాశీలుడు -**

శత్రువుల అపరాధాలు క్షమించేవాడు క్షమాశీలుడు - శిశుపాలుడు కృష్ణదేవుణ్ణి అనేక పరిస్థితులలో సభా మధ్యలో మిక్కిలి తూలనాడాడు. అయినా కృష్ణుడు సహించాడు. చివరకు ధర్మజ రాజసూయయాగంలో 'ధర్మజా! నీకుమతిపోయిందా? అగ్రతాంబూలం గొల్లవానికీయటమా!' అంటూ -

అవనీ నాథు లనేకులుండగ విశిష్టాచార్యులార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులు పల్వురుండగ ధరిత్రీనాథ! గాంగేయుడు
ర్వ్యవసాయంబున కృష్ణు కష్ట చరితున్ వార్ష్ణేయు బూజించి నీ
అవివేకం వెరిగించితిందరకు దాశార్హుండు పూజార్హుడే

అని నోటికి వచ్చినట్లు ప్రేలతాడు. అదీ సహిస్తాడు స్వామి. చివరకు నూరు తప్పులయిన తర్వాత సంహరించి, తన శక్తి సామర్థ్యాలు నిరూపిస్తాడు.

రామావతారంలోనూ అంతే జరిగింది కదా!

కాకాసురుడు రాముని ధర్మపత్ని వక్షోజాలు పొడిచాడు. వక్షోజాల నుండి నెత్తురు కారేలా చేస్తున్నా, పతికి నిద్రా భంగమని సహిస్తుంటే అది అలసత్వంగా తీసుకొన్నాడు కాకాసురుడు.

ఇది గ్రహించిన రాముడు కాకాసురుని దండించి ప్రాణంతో విడిచిపెట్టాడు.

కృష్ణా! నేడూ అలాచేశావు. క్షమాగుణం అంటేనీదేకదా! దుష్టుడైన శిశిపాలుడికి కూడా చివరకు సాయుజ్యమే ఇచ్చావు.

ఇది నీ క్షమాగుణం. శత్రువులకు సాయుజ్యం ఈయటం నీకే తగింది.

### 26. గంభీరుడు -

మనోగత భావం నిబ్బరంగా ఉంచుకొనేవాడు గంభీరుడు. బృందావనంలో గోపాలదేవుణ్ణి అనేకులు అనేక విధాల స్తుతించారు. శిశుపాలాదులు నిందించారు - స్తుతులకు సంతుష్టుడై పొంగిపోనూలేదు. నిందలకు అల్పుడై క్రుంగి పోనూలేదు. స్వామి స్వభావాన్ని బ్రహ్మదేవుడంతటి వాడు కూడా గ్రహించలేక పోయేవాడట. ఇది గంభీర లక్షణం.

### 27. ధైర్యశీలి -

ధైర్యశాలి - పూర్ణకాముడు - శాంతుడు స్థిరమైన బుద్ధిబలం కలవాడు - కోరికలు తీరి శేషంలేని వాడు. ప్రశాంతి గలవాడు ఈ ముగ్గురిని ధృతి మంతులు అంటారు. ధీబలంతో జరాసంధవధ గావించిన ప్రశస్తిని భీముడికి కట్ట బెట్టాడు. అతీతశక్తులుగల విశిష్టులకు కోరదగింది ఏమి ఉంటుంది కనుక. వారు పూర్ణకాములు రాజసూయాధియాగాలలో ధర్మజాది ఆర్యులు స్తుతించారు. శిశుపాలాదులు దూషించారు. 'అదిజుడైన బ్రహ్మ ఉదయంబునకాస్పదమైన వాడు వేదాది సమస్త వాఙ్మయములందు ప్రశంసితుడైనవాడు - ఇవి లక్షణాలు.

### 28 సర్వసముడు -

రాగద్వేషాలు లేనివాడు సర్వసముడు అనే పేరు ఒక పరమాత్మకే గలదు.

బృందావన వాసులకు విషం వెళ్ళగ్రక్కి బ్రతుకులు దుర్భరం చేసిన కాళియుని మర్దించి బుద్ధి చెప్పినవాడు కాళియ మర్దనుడైన కృష్ణుడే. ఆస్వామిని నాగపత్నులు ఇలా స్తోత్రం చేశారు -

''దేవా! గోపాలకృష్ణా! నీవు నిజంగా దుర్మదాంధులను శిక్షించటానికే అవతరించావు. మా భర్త అనేక దుష్కార్యాలు చేశాడు. సుజనులను హింసించాడు. కాట్లువేసి కష్టపెట్టాడు. విషంగ్రక్కి త్రాగేనీళ్ళలో అనేక మందిని పొట్టన పెట్టుకొన్నాడు. పశువులను పక్షులను కూడా చంపాడు. నీవు విధించిన శిక్ష సముచితమే. ఉదారభావంతో ఘోర శత్రువులను కూడా పుత్రులవలె శిక్షించి, దారిలో పెట్టావు. సమచిత్తానికి నీకు నీవేసాటి. దుర్మార్గులు దుష్టులు భ్రష్టులైన పుత్రులను సంస్కరించే తండ్రివలె మమ్ములను రక్షించావు.

పగవారి సుతుల యందును
పగయించుక లేక సమత బరపెడి నీకున్
పగగలదె - ఖలులు నడచుట
జగదవనము కొరకుగాక ! జగదాధారా!

### 29. వదాన్యుడు -

దానవీరము జూపువాడు వదాన్యుడు. శ్రీవాసుదేవుడు అడిగిన వారి ఆశలకు అతిశయంగా దానం చేస్తుండేవాడు. దానితో 'చింతామణి - కామధేనువు - కల్ప వృక్షం మొదలైనవి తానుచేసే దానం ఏ పాటి' అని సిగ్గుపడి ద్వారక ద్వారాల వద్ద హరిని సేవిస్తుండేవి.

ద్వారకలోని పదారువేల నూట ఎనిమిది అంతఃపురాలలో పత్నీసమేతంగా కృష్ణస్వామి గోదానం చేస్తుండేవాడు. అవి సువర్ణాలంకృత గోవత్ససహితక్షీర నిర్భరాలు. ఒకే కాలంలో పత్నీసహితంగా అన్ని అంతఃపురాలలో దానం చేయటం చూచి, దేవర్షులు ఇట్టి వదాన్యుడు మూడులోకాలలోనూ మరొకడు లేడు అన్నారు.

### 30. ధార్మికుడు -

తాను ధర్మం అనుష్ఠించి, ఇతరులకు ఆదర్శంగా నిలచి, వారిచేత ధర్మ కార్యాలు చేయించేవాడు ధార్మికుడు. కృష్ణుడు అట్టి ధార్మికుడు -

నారదమహర్షి ఇలా స్తుతించాడు - కృష్ణా! నీవు పృథ్విని ధర్మయుతంగా పాలించటంచేత ధర్మ వృషభం నాలుగు పాదాలతో చక్కగా సంచరిస్తోంది. అధర్మం అనే గడ్డి కరవటం మానేసింది.

ముకుందా! గోవిందా! నందనందనా! ఆనందమూర్తీ! నీవు అనేక యజ్ఞయాగాలు నిరంతరం చేస్తూ దేవతాధిపతులను పూజిస్తూ విశ్రాంతి కలుగుజేస్తుంటే, వారు గృహాలకు వెళ్ళటం మానివేశారు. వారి పత్నులు పతి ఎడబాటు సహించలేక నిన్ను కాదని బుద్ధదేవుని చేరి పూజిస్తున్నారు. దానితో యజ్ఞాలు ఆగి పతి సంగమ భాగ్యం కలుగుతుందని వారి అభిలాష కాబోలు!

### 31. శూరుడు -

యుద్ధ విద్యలో ఉత్సాహశీలి - అస్త్ర శస్త్ర ప్రయోగ నిపుణుడు శూరుడు. 'అఘనాశనా! మదగజం వలె యుద్ధరంగం అనే కమలాకరంలోకి దిగి దీర్ఘబాహువు అనే తొండంతో శత్రు శిరః కమలాలను త్రెంచి వేస్తుంటే దేవతలు అనిమేషులైనారు. నీ యుద్ధ విహారోత్సాహం అట్టిది.

కృష్ణా! క్షణంలో నీ అస్త్రసర్పం జరాసంధుని అక్షౌహిణీ సైన్యంలో తిరిగి తిరిగి కాట్లు వేస్తుంటే ఆకాటు తప్పించుకోగల వీరుడొక్కడూ లేడు కదా! ఏమీ అస్త్ర ప్రయోగ ప్రావీణ్యం! అది అత్యద్భుతం!

### 32. దయాళువు -

ఇతరుల దుఃఖం సహింపనివాడు కరుణాత్ముడు శ్రీకృష్ణుడు. కృష్ణపరమాత్మ కరుణాపూర్ణ హృదయం గూర్చి భీష్ముడిలా అన్నాడు -

మగధరాజు కారాగారంలో చీకటి కొట్టులలో పడి, అనేక వేల రాజపుత్రులు కన్నీరు కార్చి కార్చి గ్రుడ్డివారైనారు. అట్టి రాజపుత్రులకు యుక్తితో ముక్తి కలిగించి, ఆత్మ సందర్శనం కలిగించాడు కృష్ణుడు. దానితో వారి నేత్రాలు సూర్యోదయ కాంతిలోని పద్మాలవలె విప్పారినాయి. కృష్ణ దర్శనం పొంది, చరితార్థులైనాయి. యదునందనుడు ఆనంద వర్ధనుడు. కమల బాంధవుడు. కరుణాత్ముడు. అచ్యుతుడు ఆదినారాయణుడు. ఆర్తత్రాణ పరాయణుడు అని పలుకుతూ భీష్ముడు అంపశయ్యపై పడుకొని, కృష్ణదేవుణ్ణి స్మరించాడు. ఆ సంస్మరణ సమయంలో ఆయన నేత్రపద్మాల నుండి అశ్రువులు స్రవించి, అచ్యుతుణ్ణే

అభిషేకించాయి. ఆ భీష్మపితామహ ఆత్మ పరవశించింది. కీళ్ళు పట్లు తప్పాయి. భీష్ముని భక్తికి మెచ్చి, కృష్ణుడు స్వయంగా వచ్చి, అడిగిన మోక్షం ఇచ్చి కరుణించాడు.

### 33. మాన్యమానుడు -

మాన్యులను పూజించువాడు శ్రీకృష్ణప్రభువు. కృష్ణుడు దేవ బ్రాహ్మణ గురు వృద్ధ పండితులను గౌరవించి, సత్కరిస్తుంటాడు. గురుకులంలో సాందీపగురుపాదులను ద్వారకలో సుదామాది బ్రాహ్మణ శ్రేష్ఠులను బృందావనంలో నందయశోదలను మధురలో దేవకీ వసుదేవులను బలరామాది అగ్రజులను భక్తితో అర్చిస్తుండేవాడు. పూజనీయుల పాదపద్మాలకు మ్రొక్కి కార్యక్రమాలు ప్రారంభించటం వారికి పరిపాటి.

కృష్ణావతారమూర్తిలోని దైవ భక్తికి శతకోటి వందనాలు.

### 34. ఉదారుడు

ఉదార సుందర స్వభావం సుచరిత్రగలవాడు దక్షిణుడు. అట్టి మధుర చరిత్ర గల పవిత్రుడు శ్రీకృష్ణదయానిధి.

శ్రీకృష్ణదేవుడు భృత్యకోటి శతసహస్ర అపరాధాలు ఉపేక్షిస్తుంటాడు. భృత్యుల అత్యల్ప పరిచర్యలకే పరమప్రీతి చెందుతాడు. స్వల్పాన్ని అనల్పంగా భావించి, భక్తులను కృతార్థులను చేస్తుంటాడు. అరి వర్గాలపై కూడా అసూయ చూపడు. కనుకనే కృష్ణమూర్తిని నిర్మల నిష్కళంక సుబుద్ధి అంటారు.

అందరిపై దాక్షిణ్యం చూపటమే వారి ఉదార స్వభావానికి చిహ్నం.

### 35. వినయశీలుడు -

ఔద్ధత్యం పరిహరించువాడు వినయుడు. ఇందుకు మాఘకావ్యం కృష్ణవినయాన్ని ఇలా ఎత్తి చూపింది -

మహారాజయిన ధర్మరాజు కృష్ణుణ్ణి దూరంలో రథంపై చూచి, తాను రథం దిగి, వేగంగా వచ్చి నమస్కరించటం కోసంపరుగున వస్తున్నాడట కృష్ణప్రభువు ఇది గమనించి, ధర్మజుడికీ అవకాశం ఈయకుండా ధర్మజుడి కంటె ముందుదిగి ధర్మనందునుడికి నమస్కరించి, సంభ్రమాశ్చర్యానందం కలిగించాడుట. ఇది కృష్ణుడి వినయానికి మచ్చుతునక.

## 36. హ్రీమంతుడు

తన మన్మథ విలాసాలు పెద్దలకు తెలియకపోయినా తెలిసినవేమోనని సిగ్గుపడే స్వభావం గలవాడు హ్రీమంతుడు.

అది గోవర్ధనగిరిని చిటికెన వ్రేలుపై నిలబెట్టిన ఘట్టం. గోప సుందరీమణుల కుచకుంభాలపై పైటలు అస్తవ్యస్తంగా జారుతున్నాయి. స్తనాలు ఆకర్షిస్తున్నాయి. దానితో కృష్ణుడి వ్రేలు వణికింది. అది చూచి, గోపసంఘం 'కృష్ణా!' అని కేకవేసింది. బలరాముడు కృష్ణప్రతిభా ప్రభావాలు ఎరిగిన వాడు కనుక మృదుమందహాసం చేస్తూ, ఎదుటే నిలబడి ఉన్నాడు. అది చూచి అన్నకు తన మనోభావం తెలిసిందేమోనని కృష్ణుడు తలవంచుకొన్నాడు.

## 37. శరణాగతపాలుడు -

తనను శరణన్న వారిని పాలించువాడు శరణాగత త్రాణుడు.

''ఓగంగాసుతా! యుద్ధ సమయంలో కృష్ణదేవుడికి అపరాధం చేశాననే భయం వదలుకో. యాదవేంద్రస్వామి ప్రపన్నులైన జనులను ప్రసన్నులను చేసి, చంద్రుడు వలె చల్లబరచే స్వభావం గలవాడు సుమా!

ఈ అవతారంలోను పూర్వావతారం లోనూ శరణన్నవారిని రక్షించుటే నాధర్మం. రాముడుగా నేను రావణ సోదరుడైన విభీషణుడు శరణంటే శరణమిచ్చి, రక్షించాను.

## 38. సుఖి -

సుఖం అనుభవించువాడు - దుఃఖలేశం లేనివాడు సుఖి. శ్రీకృష్ణా! లక్ష్మీరమణా! నీయీ రత్న సంపదకు కుబేరుడి మహానిధి కూడా సాటిరాదు. నీయీ ద్వారకా సంస్థానమంటపంలో జరుగెడి నృత్యగీత కళా విలాస విభ్రమ వినోదాలు ఇంద్రుడికి కూడా లభ్యం కావు. నీ రాధాది పట్టపు దేవేరులు గౌరీదేవి కంటే శ్రేష్టురాండ్రు. ఎలానంటే! భర్త సాంగత్యం పొంది గౌరిపై మహేశ్వర శీర్షచంద్రిక ఒక్కటే ప్రతిబింబిస్తుంది. కానీ రాధాదులపై నీ నఖచంద్రికలు పదు పదులుగా విరాజిల్లుతుంటాయి. గౌరి భర్త శరీరంలో సగభాగమే పంచుకోకలిగింది. నీ పత్నులు నీ సర్వాంగాలు అనుభవిస్తున్నారు. ఇంతటి అదృష్టవంతులైన నూటపదారు వేలమంది భార్యామణులతో సేవింపబడే నీ కంటే సుఖి ఎవ్వరున్నారు

స్వామి! నీకు దుఃఖలేశం లేనేలేదు. ఈ విషయం కృష్ణుని నిత్యసాంగత్యంలో ఉండి నిరంతరం సేవించే ఒక శ్రేష్టభక్త దూతిక ఇలాచెప్పి విస్తుపోతుంది.

కృష్ణప్రభువు పరబ్రహ్మమూర్తి. ఆయన కే విషయం గూర్చి చింతలేదు. దేనిని గురించీ నష్టంలేదు. కష్టంలేదు. గృహకృత్యాలలో ఆయన పాల్గొనడు. సాంసారిక దుఃఖములేదు. మోహన అనంగుని అంగములు గలవానిని తలంచి గోపికలు కృష్ణదేవుణ్ణి సేవించగా స్వామి బృందావనములో పరమానందుడై విహరిస్తుంటాడు. దుఃఖగంధం అంటని సుఖి శ్రీకృష్ణుడు.

### 39. భక్త సుహృదుడు

సుసేవ్యుడు దాసబంధువు అయినవాడు భక్త సుహృదుడు. సుసేవ్యుణ్ణి గురించి విష్ణుధర్మగ్రంథం ఇలా వక్కాణించింది - శ్రీ కృష్ణపరబ్రహ్మ మూర్తి త్రాసులో కూర్చొని రుక్మిణీదేవి భక్తితో ఉంచిన ఒక్క తులసీదళంతో సరితూగాడు. భక్తికి వశం అయినాడు. సేవలందాడు. శంకరుడై దోసెడు నీళ్ళు అభిషేకంగా పొంది ఆనందం జెంది భక్తులకు వశమైనాడు. స్వామి సుసేవ్యుడు.

స్వామి దాసబంధువు ఈ విషయం భీష్మాచార్యులు ఇలానొక్కి వక్కాణిస్తాడు - శ్రీ కృష్ణదేవుడెంతదయామయుడు. నా ఉత్కర్షచూపటానికి ఆయుధం పట్టనని ప్రతిజ్ఞ చేసిన ప్రభువు ఆయుధం పట్టి నాపైకి వచ్చాడు. కానీ చంపదలచుకొంటే నే నెంతవాణ్ణి. నన్ను చంపదలచుకోలేదు. స్వామి చేసిన పాదఘట్టనకు భూమికంపించింది. కోపోద్రేకంతో పై ఉత్తరీయం కూడా జారిపోయింది. అర్జున భక్త రక్షణకై ఎంతసాహసం చేశాడు అనిపించింది. కృష్ణవాత్సల్యం దాస బంధుప్రీతి ఎంత గొప్పదోకదా!

త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింప - ప్రాభాత నీ
రజ బంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల - నీలాల క
వ్రజ సంయుక్త ముఖారవిందమతి సేవ్యం బై విజృంభింప మా
విజయుంజేరెడు వన్నెలాడు మది నావేశించు నెల్లప్పుడున్

### 40. ప్రేమ వశ్యుడు -

సేవాదులు కూడా అపేక్షింపక కేవలం ప్రియత్వం చేత వశమైన ఉదార హృదయుడు ప్రేమ వశ్యుడు.

పేదబ్రాహ్మణుడు కుచేలుడు కృష్ణప్రభువు బాల్యస్నేహితుడు. కుచేల సాంగత్యం లీలలు తలపుకు రాగానే కృష్ణకు పరమసుఖం కల్గుతుంది. సాందీపుని సేవకై వెళ్ళి ఒక రాత్రి అడవిలో కాలంగడపవలసివచ్చింది. అది జ్ఞప్తికి వచ్చిందంటే కృష్ణ కమల నేత్రాలనుండి అమితంగా ఆనందబాష్పాలు జాలువారుతాయి.

ఒకసారి కుచేలుడు ద్వారకా పట్టణానికి వచ్చాడు. ఆసమయంలో కృష్ణదేవుడు పొందిన ఆనందానికి అవధులు లేవు. ప్రేమమయ విగ్రహుడు గోపాలచంద్రుడు.

పరుల బాధలు చూచి పరబ్రహ్మమూర్తి తన్నివారణకై ఎంతపనైనా చేస్తాడు. పరదుఃఖం సహించలేని నవనీతహృదయుడు స్వామి.

ఒకసారి యశోద బాలకృష్ణ చిలిపి చేష్టలు ఒరులు వచ్చి ఫిర్యాదులు చేస్తుంటే సహించలేక పోయింది. బాలుణ్ణి బంధించి శిక్షిద్దామంటే చిక్కితే కదా! ఎలాగైనా త్రాళ్ళతో కట్టి పడవేద్దామని కృష్ణను పట్టుకో నెంచింది. బాలుడి వెంట పరుగులు తీసి అలసిపోయింది. ఒడలు చెమటపట్టింది. తిలకం జారిపోయింది. జుట్టువిడిపోయింది. కట్టుజారిపోయింది. పట్టుదల ఎక్కువయింది. కోపం మరీ పెరిగింది. నరాలు పట్టువిడిపోతున్నాయి. ఈ స్థితి చూచి కృష్ణహృదయం ప్రేమకు వశమయింది. ఇకతానే తల్లి చేతిలో త్రాటికి వశమైపోయాడు. అప్పటి వరకు చాలని బాలుడు అప్పుడు చిన్నత్రాడుకు సరిపోయాడు. అది కృష్ణప్రేమ.

### 41. సర్వశుభంకరుడు

అందరికీ మేలు కూర్చువాడు సర్వశుభంకరుడు. ఈ విషయం గూర్చి ఉద్ధవుడిలా వర్ణించాడు –.

మహా మునీశ్వరకోటికి ఆత్మజ్ఞానం మహానందం కలిగించీ – ధార్మికులకు సంఘవిద్రోహులను సంహరించీ, అపరాధాలు చేసే ప్రవృత్తిగలవారిని యుద్ధాదులలో మర్దించీ అందరినీ వారికి తగినట్లు [illegible]ధించి కృతార్థులను చేసీ అందరికీ మేలుచేసిన వాడైనాడు స్వామి సర్వశుభంకరుడు.

### 42. ప్రతాపవంతుడు -

ప్రతాపంచేత శత్రుకోటికి తాపం కలిగించే పౌరుషశాలి ప్రతాపవంతుడు. మార్తాండచండ ప్రకాశం త్రిభువనాలను దేదీప్యమానంచేయగా దైత్య వర్గాలు

సద్గుణబలలై పర్వత గుహాంధకారబిలాలలో జీవించలేక మరణించలేక బాధలు పడుతున్నాయి.

**43. యశస్వి -**

సకల సద్గుణమండితులచేత కీర్తింపబడిన వాడు కీర్తిమంతుడు ''నందనందనా! నీయశఃకాంతులు చంద్రజ్యోత్స్నలై మూడులోకాలలోని నీలవర్ణాలను శుభ్రవర్ణాలుగా మారుస్తున్నాయి. నీ మనోనిర్మల నీలప్రభావంచేత రజితాంద్రుల వంటివి నీలమణిశిలలై ప్రభవిల్లుతున్నాయి. కృష్ణవిషయిక భావభక్తిని మూడు జగాలు శిరస్సున దాల్చాయి.''

''దామోదరా! ఒక గమత్తు జరిగింది. నారదమహర్షి నీకీర్తిని మహతీ వీణపై మహత్తర మధురతరంగా గానం చేస్తున్నాడు. ఆ మహాప్రభావగాన తరంగ ధ్వనులు తాకి శంకరస్వామి నీలకంఠం తెల్లబడి వింతసోయగాన్ని విరజిమ్మింది. అది చూచి శర్వాణి ఈయన నాభర్తేనా అనుకొందిట.''

అదే సమయం బలరాముడిపై నీలాంబరసుందర శాలువా శుభ్రకాంతులు చిమ్మసాగింది. ఇది నాశాలువాకాదు అనుకున్నాడట బలరాముడు.

యమునలో జలకాలాడుతున్న గోపికలు ఒక్కసారి మనం యమునలో ఉన్నామా! పాలసముద్రంలోనా! అని తబ్బిబ్బుపడుతున్నారట కృష్ణా!

అది నీకీర్తి ప్రభావం

**44. రక్త లోకుడు -**

సర్వలోకాలకు అనురాగ భాజనుడు అనురక్తుడు. అందరినీ సర్వలోకవాసులను రక్తితో చూచువాడు రక్తలోకుడు.

శ్రీ కృష్ణా! అనురాగ మూర్తీ! పూర్ణప్రేమావతారా? నీవు నీ బంధు బలగాన్ని చూస్తు ఏ హస్తినాపురంలోనో మధురానగరంలోనో స్థిరంగా కూచుంటే మాగతి ఏమికాను? మేము నీవిరహం సహించలేక కృశించిపోయే వారమే. క్షణం నీ వీక్షణం కరువైతే మాకు ఏండ్లు పూండ్లు అయినట్లుంటాయి.

సూర్యుడు కనుపించని దినం దుర్దినం అంటారు. కానీ మాకు నీవు కనుపించని దినమే నిజమైన దుర్దినం సుమా! నిన్ను దర్శించిన దినమే సుదినం దేవా! నీవు అందరికి ప్రేమానురాగ రక్తుడవు.

స్వామీ! సర్వాంతర్యామీ! నీవు కంసుడి దర్బారులో సాక్షాత్కరించగానే మహీసురకోటి అనందరాగంతో 'జయం జయం' అని అవితథంగా ఆశీస్సులందించారు. దేవతలు ప్రేమదేవతలై నిన్ను స్తుతి చేశారు. (మధురాంగనలు నిన్ను స్తుతి చేశారు.) మధురాపుర జన సందోహ సహస్రాధికాలు జయ జయ ధ్వానాలతో ఆకాశాన్నే కమ్మివేశారు.

ముల్లోకాలలో ఆ సమయంలో నీపై అనురాగం చూపని ప్రాణియే కనిపించదు. ఓ పూర్ణ ప్రేమావతారా! ప్రణామశతకోట్లు.

**45. సాధు సమాశ్రయుడు -**

సాధువులపై ప్రేమచూపువాడు సాధుసమాశ్రయుడు. ''పురుషోత్తమా! నీవు విశ్వకల్యాణం కొరకు ఈ భువనంలో అవతరించావు. నీవు ఎందరెందరి సాధుపురుషులనో రక్షించావు. నీవు అవతరించకున్న అవనిఅంతా అసురులతో నిండిపోయి సజ్జనులకు స్థానమే లేక పోయేది. సుజనుల నెంత బాధించే వారో చెప్పలేము. నీ సాధురక్షావ్రతానికి శతవందనాలు

**46. నారీగణ మనోహరుడు**

నవకోటి నారీమణుల మానసాలను మోహింప జేయువాడు. నారీగణ మనోహరుడు.

సరస సంగీత సాహిత్యనృత్యకళా విలాసాలతో స్తుతింపబడుటచేత కృష్ణదేవ కథాకలాపం మహిళామణుల మానసాలను మరింతగా ఆకర్షిస్తుంటుంది. ఇకపై మాధవ సాంగత్య మధువు నిత్యంగ్రోలుచున్న ఇష్టపత్నుల సంగతి చెప్పాలా!

''కృష్ణా ! నీవు సూదంటురాయివి. అందులో స్త్రీజన చిత్తాలు లోహవస్తువులు - పిలవకుండానే క్రీడలకు గోపికాసమూహం పరుగిడుతుంది. కనుక కృష్ణ మోహనుడు అక్షరాలా నారీగణ మనోహారి.

అరవిందాక్ష పదాంబుజాత యుగళ ధ్యానానురాగ క్రియా
సరసాలాపవిలోక నానుగత చంచ త్సౌఖ్య కేళీరతిన్
తరుణుల్ నూరుపదారువేలు మహితోత్సాహంబునం జొక్కి త
త్పరలై యొండు దలంపకుండిరి విభ్రాంతాత్మలై భూవరా!

**47. సర్వారాధ్యుడు -**

అందరికీ పూజార్హుడైన స్వామి సర్వారాధ్యుడు. శ్రీ కృష్ణభగవానుడు అనేకానేక మునీశ్వర కోటి బృందాలతోనూ శతకోటి రాజాధిరాజులతోనూ నిండిన యుధిష్ఠిర రాజసూయ మహాసభాపీఠంపై భీష్మాచార్యాది మహామేధావులచేత భక్తులచేత పూజంపబడినాడు. అట్టి శ్రీ కృష్ణ పరమాత్మ నాకు ప్రత్యక్షమైనాడు. నేనెంత ధన్యాత్ముడను అనుకొన్నాడు. ఉద్ధవుడు.

**48. సమృద్ధిశాలి**

బహుసంపదలు సమృద్ధిగా గలవాడు సమృద్ధిశాలి. లక్ష్మీపతీ! కోటానుకోట్ల రాజులు యాబది యూరు కోట్ల యాదవులు నిత్యం నిన్నుసేవిస్తుంటారు. నవనిధులు నీభవనంలో సిరులు వర్షిస్తుంటాయి. లక్షలాది లక్షణవతులు నిన్ను సేవిస్తుంటారు. నీ లక్ష్మీసమృద్ధి చూచిన ప్రతి పండితుడూ విస్తుపోతుంటాడు.

కృష్ణా! నీ ఐశ్వర్యం ఏమని వర్ణించను - చింతామణులు నీ పరిచారికా కోటిపాదమంజీరాలకు ఆభూషణాలు. కల్పవృక్షాలు నీ అంతర్గృహ ప్రాంగణాలలో పండ్లతో, పూలతో నిండి తలవాల్చి ఉంటాయి. కామధేనువులు నీ పట్టణంలో అసంఖ్యాకంగా కుండపాదుగులతో తిరుగుతుంటాయి.

నీ సమృద్ధికి సాటిరాగల శ్రీమంతులెవరు! బృందావనం పావన సుఖసముద్రమే కదా!

**49. వరేణ్యుడు**

అందరికంటే శ్రేష్ఠుడైన స్వామి వరేణ్యుడు.

ఒకసారి ద్వారకలో బ్రహ్మాదిదేవతలు కృష్ణస్వామి దర్శనం కోసం వచ్చారు. ప్రధాన పరిచారికా వర్గీయులు ఇలా అంటున్నారు -

'ఓ బ్రహ్మదేవా! ఈ దర్భాసనం గ్రహించి, విశ్రాంతి తీసుకోండి. మహాదేవా! ఈ వ్యాఘ్రచర్మం పై ఉపవిష్టులు కండి. ఇంద్రదేవా! ఇటు వచ్చి ఈ ఆసనంపై కూర్చోండి. ఓ ఋషీంద్రులారా! మీ స్తోత్రపాఠాలు కొంచెం ఆపి ఆసనాలు అలంకరించండి. వరుణదేవా ఈ ప్రక్క నిలవండి. దేవగంధర్వులారా! శబ్దంచేయకండి. యక్షరాక్షసులారా! కోలాహలం చేయకండి! అప్సరసలార!

మాటలు ఆపండి. ఆటలకు ఇంకా చాల సమయముంది. సర్వరాజాధి రాజులు! శాంతం! శాంతం!

శ్రీ కృష్ణస్వామి అంతఃపురంలో అత్యవసర కార్యంలో నిమగ్నమైయున్నారు. నిశ్శబ్దం అవకాశం దొరకగానే వస్తారు ప్రశాంతంగా ప్రతీక్షించండి!

**50. ఈశ్వరుడు -**

స్వతంత్రుడు దుర్లంఘ్యుడయిన స్వామి ఈశ్వరుడు. శ్రీకృష్ణభగవానుడు సర్వస్వతంత్రుడు. ఈశ్వరేచ్ఛ అంటే కృష్ణ సంకల్పమే. కృష్ణ సంకల్పం ఇది అని ఎవరి ఊహాపోహలకు అందదు.

కాళీయుడు ఒకక్రూర విషసర్పం. జనపశుపక్ష్యాదుల దాహం తీర్చే కొలనును కలుషితం చేసింది. జీవకోటికి హాని చేసింది. కృష్ణస్వామి యెడల అనేక అపరాధాలు చేసింది. అందరు స్వామి అతణ్ణి సంహరిస్తాడు అనుకొన్నారు. అట్టి వాణ్ణి క్షమించి, బుద్ధిచెప్పి తన పాదపద్మాలు అతనికి శిరోలంకారంగా అనుగ్రహించాడు.

బ్రహ్మదేవుడు సృష్టికర్త. వేదవేదాంగ శాస్త్రవేత్త. నిత్యం స్వామిని స్తుతిస్తుంటాడు. అయినా బ్రహ్మను కన్నెత్తి చూచి కనికరించలేదు. ఎందుపల... అంటే ఎవరూ చెప్పలేరు. అది ఆ దేవదేవుడి ఇష్టం. ఆయన సర్వ స్వతంత్రుడు. ఆయన స్వతంత్ర చరిత్రను వేదాలు ముక్త కంఠంతో ఘోషించాయి.

దుర్లంఘ్యుడు కృష్ణప్రభువు అని భాగవతంలో ఇలా పేర్కొంది. కృష్ణప్రభువు స్వయంగా భగవానుడు. ఆయన సర్వేశ్వరుడు. ఈశ్వరేశ్వరుడు. మహా మహిమాన్వితుడు. కృష్ణ భగవానుడు పురుషత్రయమైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు అధీశ్వరుడు. శక్తిత్రయమైన వాణీ రమాంబికలకు అధిపతి. కృష్ణమూర్తికి సమానుడు కానీ, అధికుడు గానీ మరొక దేవుడు లేడు.

కృష్ణస్వామి స్వయం రూపవిరాజితుడు. పరమానంద మాధవుడు. పూర్ణ కాముడు. పరిపూర్ణుడు. మహేశ దేవేంద్రాదులు కృష్ణపూజానిరతులు. నతమస్తకులు - విధేయులు. సర్వ దేవాధీశ్వరులు కిరీటాలు వంచి, కృష్ణపాదపీఠంపై ప్రణమిల్లుతారు.

కృష్ణా! నీ ఆజ్ఞలో బ్రహ్మ లోకాలను సృష్టి చేస్తున్నాడు. విష్ణువు పాలన భారం వహిస్తున్నాడు. శివుడు లయం చేస్తున్నాడు. బ్రహ్మాండాధి నాథులు నీ ఆదేశం అనుసరించి లోకాలన్నిటినీ పాలిస్తున్నారు.

ఓ సర్వాధిపతీ! సాష్టాంగనమస్కారాలు.

### 51. సదాస్వరూప సంప్రాప్తుడు -

మాయా కార్యాలకు వశం కాని వాడు సదా స్వరూప సంప్రాప్తుడు. మాయ కృష్ణస్వామికి ఊడిగం చేస్తుంటుంది. స్వామికి మాయ ఒక దూతిక. విధేయురాలు. సేవకురాలు. స్వామి చెప్పినట్లు నడచుకొంటుంది. మాయామహేంద్రజాలం.

సర్వం వశం చేసుకొన్నవాడు స్వామి. స్వామి మాయనుండి దాని కార్యకలాపాల నుండి నిర్లిప్తుడు. స్వామి సర్వాంతర్యామి. మహారాజ్య నిర్వహణ కోసం మాయ అనే ప్రకృతిలో అవతరిస్తుంటాడు. అయిననూ మాయా కార్యజాలంలో నిమగ్నుడుకాడు. సాక్షీభూతంగా సర్వం పర్యవేక్షిస్తుంటాడు.

ఈశ్వరాశ్రయుడైన భక్తవర్యుడు సుబుద్ధి ప్రకృతి కార్యాలలో లిప్తంకాడు. సదాశివమూర్తి కృష్ణమూర్తి. ఆయన సర్వవేళల నిర్లిప్తుడే కదా! భక్తుడూ అంతే. ఇది భగవంతుడి సదా స్వరూప సంప్రాప్త సౌభాగ్యం.

### 52. సర్వజ్ఞుడు -

పరుల చిత్తాలలో దాగియున్న దానినీ, దేశకాల వ్యవధానాలలో మెలగు చున్న ప్రకృతిని సర్వం చక్కదిద్దుట తెలిసిన ప్రభువు సర్వజ్ఞుడు.

పాండవులు ద్రౌపదితో అరణ్యవాసం చేస్తున్నారు. అవస్థలుపడుతున్నారు. అయినా దుర్యోధనుడి కళ్ళు చల్లబడలేదు. ఇంకా అధిక బాధలు పెట్టాలని దుర్యోధనుడి అభిలాష.

అతడు దుర్వాసుడి దగ్గరకు వెళ్ళి ఏమి మొరపెట్టుకున్నాడో పదివేల మంది శిష్యులను తీసుకొని దుర్వాసుడు అరణ్యంలోని పాండవాశ్రమానికి అపరాహ్నవేళ వచ్చాడు అతిథి నంటూ. ఉత్తమగృహస్థు అతిథిని అంటూ వచ్చిన వారిని సత్కరించకుండా ఎలా ఉండగలడు.

''సంతోషం. నదికి వెళ్ళి స్నానం చేసిరండి అన్నాడు ద్రౌపదీ సహితుడైన ధర్మరాజు. బ్రాహ్మణ పండితులు అనుష్ఠానాలు చేసుకొని వస్తామని వెళ్ళారు. దుర్వాసుడు సహజంగా ముక్కోపి. భయపడి ద్రౌపది కృష్ణభగవానుడి ముందు చేతులొగ్గి ఈ సంకటం ఎలా తొలిగిస్తావో! అవమానం జరిగేలా ఉంది. నీవే తప్ప ఇతఃబెరుగ అంది. సర్వజ్ఞుడైన కృష్ణదేవుడు ప్రత్యక్షమై అక్షయ పాత్రలో అంటిన రెండు మెతుకులు తిని త్రేన్చాడు.

దానితో స్నానానికి వెళ్ళిన పదివేల మందికి కడుపు నిండి భుక్తాయాసం అయింది. ఆశ్చర్యంతో అతిథులు చెప్పకుండా పలాయనం చిత్తగించారు. 'ఏమి అపరాధం జరిగిందో' అని ద్రౌపదీ ధర్మజాదులు భయపడ్డారు. కానీ అసలు విషయం గ్రహించి సంతోషించారు.

లీలా నాటక సూత్రదారి ఇలా భక్తుల ఆపదలకు అడ్డువేసి రక్షిస్తుంటాడు. ఘటనా అఘటనా సమర్థుడు, సర్వజ్ఞ ప్రభువు కృష్ణుడు.

**53. నిత్యనూతనుడు -**

ఎల్లపుడూ సౌందర్యానుభూతులు కలిగియూ ఏమీతెలియనివానివలె ఇతరులకు కనిపించి, విస్మయం కలిగించువాడు నిత్యనూతనుడు.

తన ప్రియ సుందరీ మణులతో ఎల్లప్పుడూ ఉంటున్నా, వారికి స్వామి నిత్యనూతనుడైన పెండ్లికొడుకు వలె కనిపిస్తాడు. కృష్ణ పాదారవిందాలు నిత్యనూతనంగా ఆకర్షణీయంగా అందంగా ఆనందకరంగా దర్శనమిస్తాయి. స్వామి వదన సరోజాతం నిత్యనూతన సౌందర్యమాధుర్య సౌగంధ్యాలను వెదజల్లుతుంటుంది. సౌందర్యానుభూతులు స్త్రీ పురుషులకు అమితానందం కలిగిస్తాయి.

అతి చంచల స్వభావం గల లక్ష్మీదేవి కృష్ణసౌందర్యానికి వశమై చంచలత్వం వదలి స్థిరంగా స్వామి పాదసేవచేసుకొంటుంటుంది. పాదసేవకు లక్ష్మీదేవి సాటిలేని భక్తురాలని ప్రసిద్ధి పొందింది. శ్రీకృష్ణప్రభువు అట్టి నిత్యనూతనుడు.

లలితమాధవం స్వామి నిత్యనూతనత్వం గూర్చి ఇలా అంది - పద్మాక్షి! ఈ మానినీ మానస చోరుడు సామాన్యుడు కాదు సుమా! అపూర్వకళారహస్యవేది. విశ్వశిల్పి. కులస్త్రీ హృదయపాషాణాలను తన అపాంగ వీక్షణలు అనే ఉలులతో చెక్కి మరకతమణులతో మనోజ్ఞమానసమందిర సహస్రాలు నిర్మిస్తాడు. ప్రతి గోపిక తన నిత్యనూతన మానసమందిరంలో మాధవుడితో మధురకేళీ వినోదాలు జరుపుతుంటుంది. కృష్ణుడు విశ్వకర్మ.

**54. సచ్చిదానంద సాంద్రుడు -**

సర్వత్ర సర్వవేళల స్వప్రకాశ ప్రేమమయప్రదీప్తికి పాత్రుడై ఇతర స్పర్శలేని చిన్మయానంద మూర్తి శ్రీకృష్ణ సచ్చిదానందసాంద్రుడు. అవిద్య. అస్మిత. రాగ-ద్వేష అభినివేశాలు పంచవిధక్లేశాలు. ఈ అయిదూ క్షయమైన తదుపరి లభించేది

బ్రహ్మసుఖం అట్టి బ్రహ్మసుఖం కంటే మహాసుఖాన్ని కలిగించే స్వామి ఒక్క సచ్చిదానంద కృష్ణపరమాత్మయే.

బ్రహ్మసంహితం ఇలాచెప్పింది - నిష్కలమూ అనంతమూ సర్వమయమూ చిత్రవిచిత్ర పరివర్తితమూ బహుబ్రహ్మాండ నిబిడమూ శాశ్వతమూ బ్రహ్మమూ సర్వప్రధానమూ అయినది కృష్ణతత్త్వము. కృష్ణదేవుడి అంగ కాంతియే నీరదనీలమై సర్వత్ర గాఢంగా వ్యాపించిన చైతన్యం. అట్టి కృష్ణమూర్తి సర్వోపరి. పూజనీయుడు.

యమునాచార్య స్తోత్రం కృష్ణతత్త్వాన్ని ఇలా వివరిస్తుంది. బ్రహ్మాండాలూ ,పృథ్వీ ఆవరణాలూ సత్త్వాదిత్రిగుణాలు ఒకదానికంటె ఒకటి పదిరెట్లుగా పెద్దదిగా భాసిస్తూంటుంది. ప్రకృతి పురుషులకు పరమపదమూ కలిసి పరాత్పరబ్రహ్మమై కృష్ణ పరబ్రహ్మమై విశ్వవిరాడ్రూపమై సచ్చిదానందసాంద్రుడుగా ప్రకాశిస్తున్నాడు స్వామి.

### *55. సర్వసిద్ధి నిషేవితుడు -*

సర్వసిద్ధులు వశం చేసుకొన్న స్వామి సర్వసిద్ధి నిషేవితుడు. మహాసిద్ధి శక్తులే కాక అణ్వాది పదిసిద్ధులు అణిమాది అష్టసిద్ధులు పరిచారికారూపంలో శ్రీ కృష్ణదేవుని సేవించటానికి అనర్హములైనాయి. స్వామి సేవాసౌభాగ్యం లేశం కూడా మాకులేకపోయెనే ఇన్ని మహాశక్తులుండి ప్రయోజనం ఏమంటని అవి విలపిస్తుంటాయి.

సిద్ధులు అన్నీ స్వామిదగ్గర అత్యల్పాలు.

### *56. అవిచింత్యమహాశక్తిమంతుడు -*

బ్రహ్మమోహనలీల అనే మహాగ్రంథరాజం ఇలాపేర్కొన్నది - శ్రీమన్నారాయణుడైన శ్రీ కృష్ణప్రభువు ప్రప్రథమంలో ఏకైక పురుషుడు. ఏక మాత్రుడు తదుపరి కొంతకాలానికి లీలగా లోకసృష్టిచేసి క్రీడించాలి అనుకొన్నాడు. తన అంశాలతో చతుర్భుజ బ్రహ్మను ద్విబాహు బాలబాలికలను సృష్టించాడు. జీవకోటిని బ్రహ్మాండాల వంటి క్రీడాకందుకాలను తయారుచేశాడు.

తత్త్వాలకు అతీతమైన బ్రహ్మాదులచేత శ్రీకృష్ణపరబ్రహ్మస్తోత్ర పాత్రుడైనాడు. సర్వాధిపులకు సంసేవ్యుడయినాడు. విశ్వనాథుడై విరాజిల్ల సాగాడు అంటాడు బ్రహ్మ.

''దేవేంద్రా! మహేంద్రా! యశోద కృష్ణుడు కేవలం బాలమాత్రుడని బ్రహ్మదేవుడొకసారి పప్పులో కాలుపేశాడు. బాణాసురుడితో యుద్ధంచేస్తూ శంభువు కృష్ణమాయలో పడ్డాడు. బ్రహ్మరుద్రాదులే అట్లయితే నీవొకలెక్కా!'' అంటాడు నారదమహర్షి నవ్వుతూ. స్వామి భక్తులప్రారబ్ధాలను విధ్వంసంచేస్తాడు 'ఓయమరాజా! ప్రారబ్ధకర్మఫలంగా నా గురుపుత్రుడు నీలోకానికి వచ్చాడు. సరే! అయిందేదో అయింది. ఇపుడు నేను అతణ్ణి రమ్మంటున్నాను. నీవేమంటావు. వాడి ప్రారబ్ధాన్ని భంగపరుస్తున్నాను' అని యముణ్ణి శాసించి గురుపుత్రుణ్ణి తనవెంటబెట్టుక వెళ్ళాడు శ్రీ కృష్ణపరమాత్మ.

శ్రీ కృష్ణస్వామి జన్మరహితుడు అయినా నందనందనుడైనాడు. సర్వవ్యాపి అఖిల విశ్వవిరాట్పురుషుడు అయినా యశోదమ్మ ఒడిలో ఒదిగి పడుకొన్నాడు. కృష్ణుడు బహురూపధారి అయినా కొన్నిశతాబ్దాలు ఒకే రూపంలో ఉంటాడు. ఘటనకు దుర్ఘటనకు సమర్థుడు స్వామి. ఆయన అచింత్యుడు. అనంతుడు అణువంతవాడు. సర్వసమర్థుడు కృష్ణ విభుడు.

## 57. కోటి బ్రహ్మాండ విగ్రహుడు

బ్రహ్మాండాలు రోదసీ మండలంలో కోట్లకొలది ఉన్నాయి. సర్వబ్రహ్మాండ వ్యాపకుడు విష్ణుదేవుడు.

బ్రహ్మదేవుడు స్తోత్రంచేశాడు ఈవిధంగా – శ్రీ కృష్ణదేవా! మహానుభావా'! వాసుదేవా! మహాదేవా!

ప్రకృతి మహత్తు అహంకారం ఆకాశం వాయువు జలం అగ్ని పృథ్వి మొదలైన వాటితో చుట్టబడిన ఈ బ్రహ్మాండం ఎక్కడ! మూడు మూరల అల్పుణ్ణైన నేనెక్కడ! ఈ బ్రహ్మాండాలవంటి గోళాలు నీ శరీరంలో రోమకూపాలు. అవి అనేక కోట్లప్రమాణంలో ఉన్నాయి. నీవు విరాణ్మూర్తివి. అనంతమైన బ్రహ్మాండకోటి అంతా నీమహిమాస్వరూపమే. నీ సంకల్పప్రభావమే.

స్వామీ! ఇరువది నాల్గుతత్త్వాలు సప్తదేవలోకాలు సప్తపాతాళలోకాలు. ఏబది కోట్ల యోజనాల పరిమితమైనదీ బ్రహ్మాండం. ఇట్టి పదివేల లక్షల పరిమిత శక్తిగలది బృందావనంలోని ఒకప్రకోష్ఠం. ఆప్రకోష్ఠంలో ఒక అల్పభాగాన్ని మాత్రం దర్శించగలవాడు ఈ బ్రహ్మ. ఇట్టి వీడు నీ మహత్తును ఎలాదర్శించగలడు అంటుంది భాగవతం.

## 58. అవతారావళీ బీజుడు

బహురూపధారియై అనేక అవతారాలు దాల్చిన కృష్ణపరమాత్మ సమస్త అవతారాలకు బీజమైనాడు.

కృష్ణస్వామి ఆది అవతారమైన మత్స్యరూపం ధరించి వేదమాతను దుష్టుల బారినుండి రక్షించాడు. కూర్మావతారమెత్తి అందరికీ అమృతం అందుకోటానికి ఆధార భూతుడైనాడు. వరాహరూపం ధరించి పతనమయ్యే భూమండలాన్ని తనదంతాగ్రాలపై నిలిపి ఉద్ధరించాడు. నరసింహావతారంగా స్తంభంలో ఆవిర్భవించి బాలభక్తుడి మాట నిలబెట్టి రాక్షస నాశనం చేశాడు. వామనావతారంగా కనుపించి, గర్విష్ఠియైన బలిమదం అణిచాడు. పరశురామావతారం ద్వారా రాజుల తలపొగరు దించారు. రాముడుగా రావణవధచేసి ధర్మం నిలబెట్టాడు. బలరాముడుగా నాగలి ధరించి భూమి దున్ని వ్యవసాయానికి దారిజూపాడు. బుద్ధుడుగా అహింస బోధించాడు. కల్కిగా మత సహనంలేని వారికి బుద్ధి చెప్పారు. ఈ విధంగా అన్ని అసంఖ్యాకమైన అవతారాలకు మూలబీజమైనవాడు శ్రీకృష్ణపరమాత్మ. అని గీత గోవిందంస్వామిని గానం చేస్తుంది.

## 59. హతారిగతిదాయకుడు

తనచే సంహరింపబడిన అరులకు సుగతి ముక్తినిచ్చే స్వామి శ్రీకృష్ణ పరమాత్ముడు.

మురారీ! నీతో యుద్ధం చేయటానికి వచ్చిన అరి వర్గాలు నిన్ను దర్శించి, నీపై కత్తి దూయలేక ప్రాణపుష్పాలు నీకు అర్పించి, సూర్య మండలం ఛేదించుకొని పరమ పదం చేరుకొన్నారుట. ఇది నీవు చేసే గమ్మత్తు.

కంసారీ! మరో విచిత్రం ఏమిటంటే, నీవు యుద్ధరంగంలో కఠిన శాత్రవ వర్గానికి పఫబభమ అక్షరాలతో ప్రారంభించబడే పదబంధాలైన 'పరాభవం -ఫేనిలముఖం-బంధనం-భయం-మరణం కలిగించి, పవర్ణానికి బదులు అపవర్గం అంటేమోక్షం అందిస్తున్నావు. ఇది నీ చమత్కారం.

ఇది ఉక్తి వైచిత్రి. నీకు నమస్కారం

## 60. ఆత్మారామ గుణాకర్షి

అత్మరామ గుణాలను ఆకర్షించు ఆత్మారాముడు శ్రీకృష్ణదేవుడు. ''నేను

పరమహంసను. పరిపూర్ణుడను ఇది బ్రహ్మానందం అనే స్పృహే లేనివాడను. అట్టి స్థితిలో మాధవలీలా మహౌషధం కొంచెం వాసన చూచాను. అంతే ఇది పరమహంసగా యున్న నన్ను కీటకం చేసింది. ఇది మహాశ్చర్య విషయం. హంస కీటకం కావటం దానికి పద్మంపై తృష్ణ కలగటం ఆశ్చర్యం. పూర్ణ బ్రహ్మానందానుభవం గల నన్ను పరమభక్తుడుగా చేసిన ఆ లీలాతామరసం భక్తి రసం కావాలని నన్ను తపింపజేసింది. ఇది చిత్రం'' - అంటాడు అష్టావక్ర మహర్షి.

## 61. లీలా మధురమోహనుడు.

అసాధారణ గుణచతుష్కంలో లీలా మాధుర్యం మోహనం మొదటిది.

బృహద్వామన గ్రంథం స్వామిలీలా మాధుర్యాన్ని ఇలా పేర్కొన్నది -

శ్రీకృష్ణభగవానుడు లీలా మధుర మోహనుడు. తనలీలా విభూతులు తానే స్మరణకు తెచ్చుకొని, అపరిమిత ఆనందం చెందుతూ అన్నాడు కదా! ''నా జన్మ జన్మలలో లీలలు అసంఖ్యాకంగా కోట్లాదిగా ఎన్నో జరిగాయి. అవి అన్నీ మనోహరాలే. మహిమాన్వితాలే. పరమాద్భుతాలే. మిక్కిలి చమత్కారాలే. జనప్రీతికరాలే! కానీ అన్నిటి కంటే ఒక రాసక్రీడాలీలావినోదం శిరోమణి అనిపిస్తుంది. అది స్మరణకు వస్తే శరీరం పులకిస్తుంది. మనస్సు పరవశమవుతుంది. ఎంత గొప్పగా అది ప్రవర్తితమై రాణించింది''.

కృష్ణలీలా విభూతి గూర్చి ఉద్ధవుడు చెప్పుతూ అమితంగా పొంగి పోతాడు

శ్రీవిష్ణువే కృష్ణుడు - శ్రీకృష్ణుడే విష్ణువుకదా! కృష్ణదేవుడి చరిత్రాలు చిత్రాతి చిత్రాలు. పరమ పవిత్రాలు. భవలతాలవిత్రాలు. అవి భక్త జనులకు స్ఫూర్తి దాయకాలు కృష్ణస్వామి ద్వారకానాథుడే కాదు చతుర్దశ భువనైక నాథుడు. ప్రేమ రసనాథుడు. వారిలీలలు చమత్కారాలు ప్రకృతికి అలంకారాలు. ఎక్కువ ఆనంద మకరందం రాసలీలలోనే ఉంది. అది చూస్తున్నా వింటున్నా మేను పరవశిస్తుంది. అది లీలా వైభవం. ఆయన ప్రాభవమే అంత. ఎన్నివేల మంది గోపికామణులున్నారో అందరికీ ఒక్కొక్కడుగా అవతరించాడు. ఏకకాలంలో ఎంత కళాకలాపం. చూపించాడు! అత్యద్భుతం

''భగవంతుడైన కృష్ణుడు ఆత్మారాముండయ్యును గోపసతులెందరో అందరకు అందరై నిజప్రతి బింబంబుతోడన్ క్రీడించు బాలురపోలిక రాజకేళి సలిపెను.''

తగ గూడియాడి మనముల
నగె-జూచెన్ బలికె నందనందను 'డనుచున్
మగువలు పెద్దరికముతో
పొగడిరి తమ పూర్వజన్మపుణ్యశ్రేణిన్

## 62. ప్రేమ రసమూర్తి

అసాధారణ గుణచతుష్కంలో ప్రేమ రసమాధుర్యం రెండవది.

శ్రీకృష్ణా! ప్రియతమా! ప్రేమ నిధానమా!

నీవు పగటిపూట బృందావన వీధులలో మనోహరంగా విహరిస్తుంటావు. అపుడు నిన్ను తనివి తీరా చూస్తుంటాము. ఒకవేళ చూడజాలక పోతే మాకు గలిగే వ్యథలు ఇన్నీ అన్నీ కావు. సాయం సమయంలో నీ కుటిలాలకలతో నిండిన అందాల నీ ముఖం చంద్ర బింబం చూస్తున్నప్పుడు మాకు విధాత రెప్పపాటు ఎందుకు పెట్టాడా! మమ్మల్ని అనిమిషులుగా ఎందుకు ఉంచలేకపోయాడా అనిపిస్తుంది. నీ వియోగం అరక్షణమైన యుగం అనిపిస్తుంది.

నీ వడవిన్ పవల్ తిరుగ నీకుటిలాలక లాలితాస్యమి
చ్ఛావిధి జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనున్
గావున రాత్రులైన నినుగన్నుల నెప్పుడు జూడకుండల
క్ష్మీవర! రెప్ప లడ్డముగ జేసె నిదేల విధాత క్రూరుడై

అంటారు గోపికా పురంధ్రీమణులు.

## 63. వేణుగోపాలుడు

అసాధారణ చతుష్కంలో మూడవది వేణుమాధుర్యం. మహేంద్ర మహేశ్వర వాణీమనోహరులెల్లరు సంగీత కళా రహస్య కోవిదులే. మహారస శాస్త్ర ప్రవీణులే. అట్టి మహామహులు కృష్ణ వేణుగానం ఆలకించి, ఆగాన వాహినిలో రసపత్తర ఘట్టాలు పట్టి చూచి ఆ గాంధర్వ విభూతి నిర్ణయింపలేని వారై ఆ మాధుర్యంలో తలమున్కలై పోతున్నారు. వేణుగాన మాధుర్యం ఆస్వాదించే సమయంలో వారు పరమానంద సాగరంలో పరవశమైపోతుంటారు.

ఈ వేణుగానధ్వనులు నీల శ్యామలమేఘాలను ముందుకు నడవ నీయటంలేదు. తుంబురుడు నారదుణ్ణి మించిన సంగీత కళా రహస్యజ్ఞుడు.

అట్టి తుంబురుడు వేణుగానం అంటే పరుగులెత్తి వస్తాడు. సనందనాదులు మురళీ గానం విని బ్రహ్మసుఖం పొందుతుంటారు. ఆదిశేషుడు సరేసరి. వేయి తలలూ ఆడిస్తూ నాగనృత్యం చేస్తుంటాడు.

నవమాధుర్యము కల్గు కృష్ణమురళీ నాదామృత స్యందముల్
చెవులన్ జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై
యువిదా! మేపులకున్ దొరంగి మృగగోయూధంబులుత్కంఠతో
దివికిన్ కంఠములెత్తి లోవదులు బోదేహేంద్రియ వ్యాప్తులన్

## 64. రూప గోపస్వామి

అసాధారణ గుణ చతుష్కంలో నాల్గవది శ్రీకృష్ణసార్వభౌమ రూపసౌందర్య మాధుర్యం. శ్రీకృష్ణుడు గో గోపగోపికా గోలోక చక్రవర్తి. ఆయన రూపం ఆత్మానంద అఖండ దీపం. కనుకనే ఆ మహాదేవదేవుడు రూపగోస్వామి.

ఏకైక స్వామి భగవంతుడు తన మధుర మాయా చమత్కారచాతుర్యాలు మానుష వేషధారియై చూపిస్తుంటాడు. మురళీ రవళీ వినూత్న వినోదాలు వినిపిస్తుంటాడు. విభ్రమాశ్చర్యాలు కలిగిస్తుంటాడు. భాగవతంలో భగవంతుడి రూపసంపదలు భక్తులు అవలోకించి, అనుభవించి, వ్యక్తపరచిన భావాలే వింటుంటాము. కానీ, 'లలిత మాధవం' మాధవస్వామి మనో భావాలకు అద్దం పట్టి చూపిస్తోంది.

''మధుర మోహన కృష్ణస్వామి ఒక మణి దర్పణం ముందు ఎందుకో నిలబడినాడు. దర్పణంలో మోహన రూపం ఒక్కసారి తళుక్కున ప్రతిబింబించింది. స్వామికి ఆశ్చర్యం ఆనందం కలిగింది. మనో విపంచిక ఇలా మేళవించింది.

''ఇది నా ప్రతి బింబమేనా! ఎంత అందంగా ఉంది. భలే ఆశ్చర్యంగా ఉందే. మనోహరంగా ఉంది. నారూపంలో ఇంత అందం ఉందా! చమత్కారంగా చాతుర్యంగా ఉందే! కన్నులు వికసించిన కమలాలు వలె భలే ఆకర్షణీయాలు. నన్ను నేనే నమ్మలేనంతగా ఉన్నానే! నా రూప మాధుర్యం - నా తనూ సౌందర్యం - నాతేజో శౌర్యం చాలా గొప్పగా ఉన్నాయి. ఈ ఆకర్షణ చూచే కాబోలు నాకు మహాతత్త్వవిదులు తల్లిదండ్రులు 'కృష్ణుడు' అని పేరు పెట్టి ఉంటారు.

ఇంత అందంగా ఉన్నాను కనుకనే రాధాదేవి వంటి సుందరాంగులు నన్ను ప్రేమిస్తున్నారు. గోపికా సహస్రాలు తుమ్మెదల వలె నా చుట్టూ గుమిగూడుతున్నారు. ఈ స్త్రీ జనమేకాదు ఘనులు, జనులు, మునులు నన్నే పూజిస్తున్నారు. అని మురిసి పోతున్నాడుట అద్దం ముందు కూర్చొని కృష్ణుడు.

వాస్తవమే స్వామీ! నీవు భావించింది.

నీవు కల్యాణగుణసముద్రుడవు. రూప మాధుర్యమూర్తివి. కోటి మన్మథ చక్రవర్తివి. మహా మానసానంద అమృత రసామల కమలాకరానివి. నీకు నమస్కార పుష్పాంజలులు.

మహదహంకార తన్మాత్ర సంయుక్తుడై చారు షోడశ కళా సహితు డగుచు పంచమహాభూతభాసితుండై – శుద్ధ సత్త్వుడై – సర్వాతి సాయి యగుచు చరణోరు భుజయుగ శ్రవణాక్షినాసాశిరములు నానాసహస్రములు వెలుగ అంగద కేయూర హారకుండల కిరీటాదులు పెక్కు వేలమరుచుండ పురుష రూపంబూ ధరించి – పరుడనంతు డలభువనైక కర్తయై అలఘు గతిని మానితాపార జల రాశి మధ్యమునను యోగ నిరతవిలాసి యొప్పుచుండు – స్వామి.

తరుణాబ్జారుణ లోచనద్వయకృపాధౌరేయమ్మైయొప్పు – సా
గరకన్యా కుచకుంభ పాళి పులకల్ కన్పట్టు – మౌనీంద్ర హృత్
సరసీజంబులు సంచలింప – మురళీ సంజాత గీతామృత
స్ఫురణన్ రాల్ కరగన్ చరించు హరి కైశోరంబు భావించెదన్

ఇది నీరూప సౌందర్యమాధుర్యం. కృష్ణప్రభూ! నీచతు షష్టి కళావిభూతులు నేను వర్ణించగలనా! నీ అక్షయ విభూతులు ఎవరు లెక్కింపగలరు! భూఖండంలోని ధూళికణాలు, హిమకణాలు, సూర్య కిరణాలు లెక్కపెట్టగలరేమో! కానీ నీగుణాలు సహస్ర ఫణ ఫణీంద్రుడైన గణింపలేడు కదా!

నల్ల సముద్రాన్ని నీలి సిరాబుడ్డి చేసుకొని – దేవకల్పశాఖలను లేఖినిగా చెక్కుకొని అనంతమైన నేల పొరలను కాగితపు పుటలుగా ఏర్పరచుకొని, చతుర్ముఖబ్రహ్మదేవుని రాణి యుగయుగాల నుండి వ్రాసి వ్రాసి అంతుపట్టక అలసి పోయిందట – ఇకనేనెంత – ఉంటాను.

# కృష్ణభక్తులు

ధర్మనిర్ణయ సిద్ధాంతాలు చేయువారిలో గర్గమహర్ష్యాదులు - యుద్ధవ్యూహ రచనా పాటవంతో సాత్యకి మొదలైనవారు - స్నేహితవర్గంలో ఉద్ధవఅర్జునాదులు పేరు గాంచినవారు - సాధకులు. వీరికి కృష్ణప్రేమ మైత్రి మిక్కుటం. వీరిని చూచి నారద మహర్షి ఇలా అంటాడు-

ఓ సుబుద్ధులారా! భగవద్భజనా నదీప్రవాహంలో తడిసి కూడా భవాగ్ని చల్లారలేదని చింతిల్ల బోకుడు మీ శరీరాలపై పులకరింతలు కనిపిస్తున్నాయి. దీనివలన త్వరలోనే మీ హృద.యాకాశంపై కృష్ణమేఘం కృపావర్షం వర్షిస్తుందని తెలుస్తుంది. దిగులు జెందబోకుడు.

సిద్ధపురుషులు - వీరిలో సంప్రాప్త సిద్ధులు నిత్యసిద్ధులు సాధన సిద్ధులు కృపాసిద్ధులు పలురకరకాలుగా ఉన్నారు. వీరికి మృత్యుభయం ఉండదు. వీరు హరిసేవలో హరికథాగానంలో హరిప్రేమలో పులకితగాత్రులై ప్రకాశిస్తూ పరవశులైయుంటారు.

మహామునులు వీరిని చూచి అనుకొంటారు. ఈ స్త్రీలు ఎంత పుణ్యవతులో! వీరికి ఉపనయనాది మంత్రసంస్కారాలులేవు. శాస్త్రాదులేమీ ఎరుగరు. తపస్సులు చేయరు. ఆత్మానాత్మవిచారణ అసలే లేదు.

అయినా శ్రీకృష్ణ దేవుని పాదపద్మాలపై వీరికి గల భక్తి ఒక్కటే వీరిని పవిత్రురాండ్రను చేస్తున్నది కదా! మనలో ఒక్క భక్తి లేక వంచితులమై పోతున్నాము. ఎన్ని చదివితే ఏమి! కృష్ణమూర్తి వయోవిలాసంగూర్చి శుకుణ్ణి పరీక్షిత్తు ప్రశ్నిస్తాడు- ఐదేండ్లు కౌమారం ''అటుమీద'' నైదేండ్లు పౌగండ'మనియెడు ప్రాయమందు రైదేండ్లవాడైన అబ్జాక్షుచరితంబు 'పౌగండ'మని గోపబాలురెల్ల దలతురంటివి'' - యెట్లుదలతురు వారలు - నిరుడు చేసిన పనినేటిదన వచ్చునే! ఇది నాకు వరుసతో నెరిగింపు''

అనగా శుకుడు వినయంగ వినవయ్యా అని చెప్పాడు.

నారదమహర్షి శుకమహర్షితో ఇలాచెప్పి మిక్కిలి ఆశ్చర్యపోతాడు -

శుకమహర్షీ! నాకంటే నీవు పుణ్యాత్ముడవోయి. నీవు గురుకులాలలో శిక్షణలు శిక్షలు పొందలేదు. సాధనలు తపస్సులు పెద్దగా చేయలేదు. కానీ

ఒక్క కృష్ణభక్తి కలిగి భాగవత పరమహంసలకు వాంఛనీయమైన కృష్ణకథామృతాన్ని పంచిపెట్టి చరితార్థుడవైనావు. నీవు స్వామి కృపాసిద్ధుడవు సుమా!

**నిత్యసిద్ధులు** - సత్యభామా మణితో కృష్ణదేవుడు నిత్యసిద్ధులనుగూర్చి ఇలా వివరించాడు

భామా! బ్రహ్మ భూమాత గోమాత మునులు ఘనులు ప్రార్థనలు చేస్తేనేను అవతరించాను. నాతో నా అంశలుగల దేవాధిపతులు యాదవులు జన్మించారు. వీరందరు నిత్యసిద్ధులు..

**కైశోరం** - కుందలత అనే ఒక విదుషీమణి కృష్ణకైశోరదశలు ఈవిధంగా వర్ణించింది -

ఐదు సంవత్సరాల వరకు గల వయస్సు కౌమారం - వత్సలదశ.
పది సంవత్సరాల వరకు గలది - పౌగండం - సఖ్యదశ.
పదికంటె పైగల కృష్ణవయస్సు అంత కైశోరం - ఉజ్జలదశ.

ఇందులో ఆద్యకైశోరం లో కృష్ణదేవుడు ఉజ్జలంగా శోభిస్తాడు. మధ్యమ కౌశోరంలో యౌవ్వన శోభతో వైదగ్ధీసారంగా ఉంటుంది. శ్రేష్ఠ కైశోరంలో సౌందర్యం నిండి పూర్ణ కైశోరవైభవం వెల్లడి అవుతుంది.

## పదచిహ్నాలు

శ్రీ కృష్ణపరమాత్మ పాదపద్మాల జాడలు చూచి అక్రూరుడు ఇలా తలపోస్తాడు-

ఈ గొల్లపల్లె ఎంత పుణ్యం చేసుకొన్నదో!

ఈ ధరణీరజం ఎంత పవిత్రమైనదో కదా! అని తనరథరాజం నుండి పల్లెముందు మట్టిలోదూకి ఆ ధూళిని సుగంధంవలె సుకుమార శరీరమంతా పులుముకొన్నాడు -

బృందావనంలో కృష్ణస్వామి ఒకసారి కనుపించక పోతే నవసైకతాలపై పదాంకాలు చూచి ఒకరిని ఒకరు పిలుచుకొని చెప్పుకొంటున్నారు -

ఇవిగో ప్రభు పాదముద్రలు. ఈ అడుగు జాడలలో శంఖ చక్రాలు ఎంత బాగా దర్శనమిస్తున్నాయి. పద్మాంకుశాలు అడుగుల్లో అచ్చుగ్రుద్దినట్లే

ఉన్నాయి! ఎంత ఆనందం కల్గిస్తున్నాయి. నా ప్రాణనాథుడు పాదముద్రలు ప్రేమతో అనుగ్రహించి దారిచూపాడు అని కన్యకలు కనులకద్దుకొంటున్నారు.

ఈచరణంబులే! ఇందునిభాననా! సనకాది మునియోగ సరణిజూపు -
ఈ పాదముద్రలే! ఎలనాగ! శ్రుతి వధూసీమంతవీధుల చెన్నుమిగులు -
ఈ పదాబ్జంబులే! ఇభకులోత్తమయాన! పాలేటిరాచూలి పట్టుగొమ్మలు -
ఈ సుందరాంఘ్రులే! ఇందీవరేక్షణ! ముక్తికాంతామనోమోహకములు -

ఈయడుగుల రజమె ఇంతి! బ్రహ్మేశాది
దివిజవరులు మౌళిదిశల దాల్తు
రనుచు కొందరబలు లబ్జాక్షుడేగిన
క్రమము గనియు నతని గాన్నైరి

## రూపసౌందర్యం

కర్ణావతంసిత కర్ణికారప్రభ గండభాగద్యుతి గడలు కొనగ -
భువన మోహనమ్మైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప-
అపసవ్య కరమృదులాంగుళీచాతురీ షడ్జధ్వనికి మర్మసరణి గూర్ప -
డాకాలిమీద అడ్డము సాచినిల్పిన పదనఖద్యుతి భూమి బ్రబ్బికొనగ -

మౌళిపింఛమ్ము కంఠదామమును మెరయ
విలసితగ్రామముగ నొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వగీతమ్ము పరగ జేసె
చతుర నటమూర్తి గోపాల చక్రవర్తి

శ్రీశ్రీ మురళీ మోహన కృష్ణుడు బృందావన మధ్యసీమలో వేణుగానం చేస్తున్నాడు. అది సర్వసనకసనందాదులకు ఆనందం ఆకర్షణ కలిగిస్తోంది. అది గీతాసుధా గానరసమాధుర్యం. బ్రహ్మ గాంధర్వగీతం అది.

శంపాలతిక తోడి జలదంబుకైవడి మెరుగు వెల్గులతోడి మేని వాని
కమనీయమృదులాన్న కబళవేత్ర విషాణ వేణుచిహ్నాంబుల వెలయు వాని
గుంజావినిర్మిత కుండలంబులవాని శిఖిపింఛవేష్టిత శిరము వాని
వనపుష్పమాలికా వ్రాతకంఠమువాని నళినకోమల చరణములవాని

కరుణ గడలు కొనిన కడకంటి వాని - గో
పాలబాలు భంగి పరుగు వాని
నగుమొగంబు వాని ననుగన్న తండ్రిని
నిను భజింతుమ్రొక్కి నీరజాక్ష!

శ్రీకృష్ణ శరీర సౌందర్యం, రూపసౌభాగ్యం మృదుస్వభావం మార్దవం కోమలత్వం మానసికవాచిక గుణాలు ఉద్దీపనాలు వన్యమండనం, పత్రభంగం, అంగరాగసౌరభం కృష్ణస్వామికి ప్రియమైన అలంకారాలు.

వేణువులలో వేణువు, మురళి వంశం మహానందం సమ్మోహని ఆనందిని వంశలి, ఆకర్షణి అని అనేక రకాలున్నాయి. ''ముదితా! యేతటినీ పయః కణములన్ మున్వేణు వింతయ్యె ఆ నది సత్పుత్రుని గన్న తల్లి పగిదిన్ నందంబుతో నేడు సన్మద హంసధ్వని పాటగా వికచ పద్మశ్రేణి రోమాంచమై తుంగ తరంగ హస్త నటనోద్యోగంబు గావింపదే'' అంటాడు పోతనామాత్యుడు.

శృంగం అంటే కొమ్మువాద్యం, నూపురం, శంఖం కృష్ణస్వామి అభరణాలు.

★★★★



దక్షిణసముద్రంలో

# అనుభావభక్తి లహరి

అనుభావాలు అంటే చిత్తంలోని భావాలు తెల్పునవి. మరియు బాహ్యవికారాలవలె తోచుక్రియా విశేషాలు - వీనిని 'ఉద్భాస్వరాలు' అని కూడా పిలుస్తారు.

అనుభావాలు - నృత్యం - సాష్టాంగ ప్రణామం - గీతం హుంకారం ఆవలింత నిట్టూర్పు - లోకవిస్మృతి అట్టహాసం స్మృతం మొదలైనవి.

**సాత్త్విక భావాలు**

కృష్ణ సంబంధిత దాస్యసఖ్యాదుల చేత ఆక్రాంతమైన చిత్తం 'సత్త్వం' అట్టి సత్త్వం నుండి పుట్టినవి. సాత్త్వికంలో స్నిగ్ధం - దిగ్ధం - రుక్షం. మూడు భేదాలు.

**1. సాత్త్విక స్నిగ్ధం**

రాధ కుందమాల ముకుందస్వామికై తయారుచేస్తోంది. కుంద కోరకాలవంటి తన పలువరుస కనుపించీ కనుపించనట్లు మధురమంద స్మితం చేస్తూ ఏదో భావన చేస్తోంది. ఆ సుందరాంగిలో అందం ఆనందం చింది పోతున్నాయి.

ఇంతలో మోహనాంగుడి మురళీనాదం మందాకినీ తరంగంవలె వచ్చి రాధాశ్రవణ పుటాల్లో జేరింది. అంతే ఆ నాదబ్రహ్మం చెవిలోకి జేరగానే ఆ తన్వంగి శరీరం నిశ్చలమయింది.

ఇది ముఖ్యసాత్త్విక స్తంభం. స్వేదాదులు కూడా ఇలానే జరిగాయి.

**౨. సాత్త్విక దిగ్ధం -**

భయానక దర్శనంవలన వచ్చిన శరీరకంపం మొదలైన ఇతర భావాల ద్వారా కలిగే మానసికదశను దిగ్ధం అంటారు.

ఒకసారి యశోద స్వప్నంలో వికృతాకారంగల పూతన కనిపించింది. ఆ వికృతాకారం చూచి యశోద వణికిపోసాగింది. 'బాలకృష్ణ ఎక్కడున్నాడో' అని వెతకటానికి పరుగులు తీస్తోంది. ఇది 'దిగ్ధ' స్థితి.

## సాత్త్విక రూక్షం

కొందరు భక్తులు కాక పోయిననూ భోగసాధనా తత్పరత్వం ద్వారా మధుర మాధవ గీతాలు వినడం వలన శరీరంలో పులకింతలు జనిస్తాయి వారు భక్త సదృశులు. వారు భావరతిశూన్యులు - ఈ భావాలను 'రతి శూన్యాలు' అనీ 'సాత్త్వికరూక్షాలు' అనీ విజ్ఞులు పేర్కొంటారు. ముముక్షువులలోని రత్యాభాసమే ఈ రూక్షసాత్త్వికం.

**సాత్త్విక స్తంభాదులు-**

చిత్తం సత్త్వంగా ఉన్ననూ మనం వికార పెడుతుంటుంది. అప్పుడు కలత అధికమవుతుంది. ఈ స్థితిలో భక్తుల దేహాలలో స్తంబాది భావాలు ఉద్భవిస్తాయి. స్తంభం, స్వేదం, రోమాంచం, స్వరభంగం, కంపం, వైవర్ణ్యం, అశ్రువులు, మూర్ఛ. ప్రాణాలు పృధ్విని ఆశ్రయించిన 'స్తంభం' - జలాన్ని ఆశ్రయించిన 'అశ్రువులు' తేజస్సు ఆశ్రయించిన 'స్వేదం', - ఆకాశాన్ని ఆశ్రయించిన 'మూర్ఛ' వాయువు నాశ్రయించిన మందం - మధ్యమం - తీవ్రం అని త్రివిధాలుగా రోమాంచం కంపం స్వరభంగం వ్యాపిస్తాయి.

# సంచారీభావభక్తి లహరి

సంచారీ భావాలు స్థాయీ భావాలకు పుష్టినిస్తాయి. స్థాయీ భావాలు పెద్ద పెద్ద సముద్రాలు అయితే సంచారీభావాలు సముద్ర తరంగాలు. అలలు సముద్రంపై నాట్యంచేస్తూ సముద్రానికి సముద్ర అంతరంగానికి కూడా అందం ఆనందం కలిగిస్తుంటాయి.

ఆవిధంగానే మానవుల అంగాల నుండీ అంతరంగాల నుండీ సూచింపబడేవి కనుక ఇవి భావ సంచలిత ప్రతీకాలు కాబట్టి ఇవి సంచారీ భావాలుగా పేర్కొనబడినాయి.

1.నిర్వేదం, 2.విషాదం, 3.దైన్యం, 4.గ్లాని, 5.శ్రమ, 6.మదం, 7.గర్వం, 8.శంకం, 9.త్రాసం, 10.ఆవేగం, 11.ఉన్మాదం, 12.అపస్మృతి, 13.వ్యాధి, 14.మోహం, 15.మృతి, 16.ఆలస్యం, 17.జాడ్యం, 18.వ్రీడ, 19.అవహిత్థం, 20.స్మృతి, 21.వితర్కం, 22.చింత, 23.మతి, 24.ధృతి, 25.హర్షం, 26. ఔత్సుక్యం, 27.ఔగ్ర్యం, 28.అమర్షం, 29.ఆసూయ, 30.చాపల్యం, 31.నిద్ర, 32.సుప్తి, 33.బోధ.

అని ఈ సంచారీ భావాలు 33.

**1. నిర్వేదం**

**మహార్తి నిర్వేదం-**

'అమ్మా! కృష్ణమూర్తి కాళిందిలో దూకాడటమ్మా! అమ్మో! భయం.

ఇక మనం మనదేహాలు గేహాలు ఎందుకు? మనం కూడా అందులోకే దూకుదాం' అని గోపికలు యశోదతో అంటూ మహార్తి నిర్వేదం అనుభవిస్తారు.

**విప్రయోగ నిర్వేదం-**

'ఈ పుణ్యహీనులు మాధవ మాధుర్యం పొందలేదు. మాజీవనానికి సార్థక్యం, సాఫల్యం ఇంకేముంది! మా జీవనం వ్యర్థం. ఆనంద బాలుడు లేని బృందావనం భయంకర వనమే కదా! వసంతశ్రీ లేని అడవిలో భ్రమరం ఎలా ఉండగలదు!' అని ఒక గోపిక విప్రయోగనిర్వేదం చెందుతూంది.

**ఈర్ష్యానిర్వేదం-**

'నారద మహర్షి మనయెదుటే పారిజాతం పొందిన రుక్మిణిని ఇంతగా పొగడుతుంటే వినే నా వంటి దురదృష్టవంతురాలు ఎవరుంటారు!' నారద ప్రశంసకు యోగ్యురాలయింది ఆ రుక్మిణమ్మ. ఇక నా గతి చూస్తూన్నారు కదా! 'పశులకాపరీ!' అంటూ సత్యభామ తన ఈర్ష్యానిర్వేదం వ్యక్తం చేస్తుంది ఎరుపెక్కిన కన్నులతో.

**సద్వివేక నిర్వేదం**

'మహర్షీ ! నేను దేహాత్మ బుద్ధి సంపన్నుడను, భార్యా పుత్ర సంసార మగ్నుడను, రాజ్యభోగమత్తుడను, జీవితమంతా దురంత చింతలతోనే గడిపాను. దైవధ్యానమేలేదు. నా జీవనం వ్యర్థం' అని ఒక మహారాజు ఒక మునీంద్రునితో సద్వివేక నిర్వేదం పొందుతాడు.

భరతముని తన శాస్త్రంలో అమంగళకర నిర్వేదం చెప్పి, శాంతరసంలోని నిర్వేదానికే స్థాయిత్వం స్వీకరింపబడింది అన్నాడు.

**2. కార్యవిఘ్నవిషాదం**

ఒక భక్తురాలు కలలో ''స్వామికై మందార మల్లియ మాలలు కట్టి పట్టుకు వెళ్ళుతున్నాను. మందిరం మహా సుందరతరంగా ఉంది. పాలరాతి సోపానాలపై అడుగులు మోపుతున్నాను. మాధవుని మెడలో మాలవేయటానికి పరుగులు తీయబోతున్నాను. అరక్షణంలో మోహనాంగుడు మురళి ఊదుతూ దర్శనమీయ బోతున్నాడు. ఇంతలో దురదృష్టం తీయనికల చెదిరి పోయింది''. ఇది కార్య విఘ్నవిషాదం.

ం

దుష్ట కంసరాజ మల్లరంగంలో బాలకృష్ణుని జూచి నందరాజు ఇలా ర్వాడు.

'అయ్యో! నా పసికందుని కంసరాజు కడకేల పంపాను. ఎంత వచ్చి పడింది అబ్బా! పాపాయిని ఇంటిలోనే దాచితే సరిపోయేది. నా ుద్రుణ్ణి కువలయాపీడం అనే రాహువు పట్టిందే! మల్లురనే మసిమబ్బులు స్తున్నాయే! మహాకష్టం వచ్చి పడిందే దైవమా! నీవే దిక్కు! ఇది విపత్తి ం.

ధ విషాదం

''దేవా! నాచర్య గర్హణీయమే. నీవు నావంటి మదమాత్సర్య గర్వితుల ికో బుద్ధి చెప్పావు. అయినా నేను నిన్ను తెలుసుకోలేక పోతున్నాను. అనంతుడవు -- ఆది పురుషుడవు. పరమాత్ముడవు. నీపై నా ాజాలం జూపి నా గొప్పదనం వెలగపెడదామని భ్రమించాను. అగ్నిలో అగ్ని జ్వాలలు అగ్నిపై ఏమి ప్రభావం చూపగలవు. నేను నీ నుండి ినవాడను. నీపై ఏమి ప్రభావం చూపుతాను. నావంటి అహంకారికి ల్లి బుద్ధి చెప్పావు. అని బ్రహ్మదేవుడు శ్రీకృష్ణ చరణాలు పట్టుకొన్నాడు. అపరాధ విషాదం.

ఇంకనూ దైన్యం, గ్లాని, శ్రమ, మదం, గర్వం, శంక, ఆవేగం, ,దం, అపస్మారం, మూర్ఛ, స్మృతి, ఆవేగం - ఈ మొదలైన భావాలు ావాలు వర్ణించబడినాయి.

ఈ విధంగా సంచారీ భావాలు చెప్పి భక్తి శాస్త్రాన్ని విశదపరచటం ంది.

*దక్షిణసముద్రంలో*

# స్థాయీభక్తి భావలహరి

హాస్యాదులకు అవిరుద్ధమూ క్రోధాదులకు విరుద్ధమూ అయిన భావాలను వశం చేసుకొనే ప్రభావం గల 'భావం' అన్నింటిలో రాజు వలె స్థాయీ భావం అవుతుంది. భక్తి శాస్త్రంలో కృష్ణ విషయికమైనదే స్థాయీభావం.

ఈ స్థాయీభావం ముఖ్య గౌణభేధాలతో రెండు విధాలు. ముఖ్యములో మరల శుద్ధ సత్త్వవిశేషాత్మకం అని ఉపభేదాలున్నాయి. వీనిలో కూడా స్వార్థ పరార్థాలు అనే భాగాలున్నాయి. స్వార్థ ముఖ్యభాగం అవిరుద్ధ భేదాల వలన పోషించబడుతూంటుంది.

ఈ ముఖ్యస్వార్థ శుద్ధంలో ప్రీతి-సఖ్యం వాత్సల్యం-శృంగారం భేదాలున్నాయి.

ముఖ్య పరార్థ శుద్ధంలో సామాన్య-స్వచ్ఛ-శాంతి అని విభాగాలు మూడు.

సామాన్య ధర్మం మాత్రం ఆశ్రయించిన సామాన్య మానవులకు కృష్ణ ప్రీతిగల వ్రజవాసులకు కృష్ణుని యందు సాధారణ భక్తి జనిస్తుంది. మధురా నగరంలో శ్రీకృష్ణుణ్ణి చూచిన సామాన్య మానవుడు మిత్రుడితో అంటాడు. ''మిత్రమా! మధురలో కృష్ణచక్రవర్తిని చూచి నా మనస్సు మైనం వలె కరిగిపోయిందేమిటి? బలే వింతగా ఉందే?'' మరో ఉదాహరణ - వృద్ధురాలా ! ఈ చిన్ని బాల గోచారణ మార్గంలో గోపాలుణ్ణి చూచి కేరింతలు కొడుతూ గోపాలుడి వెంట బడిందేమిటి?''

సామాన్య శుద్ధ భక్తిలో అవాంతర సామాన్య భక్తి ఇలా ప్రభావం చూపుతుంది.

భక్తుల ప్రసంగాలవలన సాధనలవలన స్వచ్ఛ భక్తి మనస్సు స్థాయిని బట్టి వివిధ రూపాలు దాలుస్తుంది.

''ఈ స్వచ్ఛరతి ఎప్పుడెవ్వనితో సాంగత్యం కలుగుతుందో ఆ వ్యక్తి భక్తి భావంగా రూపు ధరిస్తుంది. వెనుకటిరూపం విడిచి నూతనరూపం ధరిస్తుంది. సాధక హేతుకమైన ఈ ఆసక్తి సాధ్యాస్వాద హేతుకమైనపుడు ఇతర ఆసక్తి కలుగుదు.'' ముక్తిదాసు, ఉదా: ఒక సజ్జన బ్రాహ్మణుడు ఒక సన్నిహిత మిత్రుణ్ణి 'నీవు ప్రభువువు' అనీ మరొకసారి 'నీవు చాదస్తుడవ' నీ స్తుతినింద చేస్తుంటాడు. మరొకప్పుడు 'పుత్రుడనీ' నాథుడనీ పరమాత్మడనీ భావిస్తుంటాడు. ఇది మనోవృత్తుల ప్రకోపనం. కొందరు వైష్ణవులు సేవద్వారా లభించిన బ్రహ్మానుభవం తిరస్కరించి సుందరశ్యామ బ్రహ్మాతీత కృష్ణపరమాత్మ నాఆత్మ అని దర్శించి, ఆనందపడుతుంటారు.

భగవంతుడి యందు అధికమైన మమతకు పరమ ఉపాదేయ అనుభవం అంటారు. ఇందు మూడు రకాలు: 1.దాస్యం, 2.సఖ్యం, 3. వాత్సల్యం.

నరులకు శ్రీహరి ఆరాధ్యుడు అని నిశ్చయించుకొంటారు. నీ నిశ్చయ దాస్య భావమే ప్రీతి అని దాస్యం అనీ అంటారు.

ఉదా :- 'నరకాంతకా ! నరసఖా ! కృష్ణా !' నేను స్వర్గం నరక భూలోకాలలో ఎక్కడున్నా సదా జీవన పర్యంతం నీ సుందరమందార చరణాలను చింతిస్తూంటాను' అంటాడు. ముకుంద మాల కవిరాజు ఈ విధంగా ఈ సఖ్య వాత్సల్య రసాలలో కృష్ణ భక్తి హృదయ మగ్నమై తన్మయత కలుగునట్లు నిరూపించాడు.

శాంతం కంటే దాస్యం-దాస్యం కంటే సఖ్యం - సఖ్యం కంటే వాత్సల్యం వాత్సల్యం కంటె మధురం ఉత్తరోత్తరం అధిక ఆస్వాదనీయాలుగా ప్రవర్థమానాలు. ఈ పంచరతులలో ఉపభేదాలున్నాయి. అవి భక్తుల ప్రవృత్తుల స్థాయిని బట్టి అనుభవంలోకి వస్తుంటాయి. గౌణ రస విభాగాలు అనేకం.

కృష్ణ ప్రేమానుభవం రెండు విధాలు.

1. ముఖ్యం, 2. గౌణం. ప్రేమకు ఇవి సహాయకారులు విభావానుభావ సంచారీ భావాలు కృష్ణ భక్తులలో రసపరిణితి కలిగిస్తాయి.

పెరుగు పంచదార మిరియాలు కలయికచే 'రసాలం' అని ఒక పానీయం తయారు అవుతుంది. అట్లే విభావ అనుభావ రూపాలైన శ్రీకృష్ణ అభవాలు కలిసి ఒక అద్భుత 'పరమానందరసం' భక్తుల అనుభవంలోకి తెస్తాయి.

ప్రాచీనులు కూడా ఇదే చెప్పారు. మొదటి విభావాదులు వేరువేరుగా ప్రతీయమానమవుతాయి. తర్వాత కలిసి రసరూపం పొంది ఏక రసరూపం దాలుస్తుంది. ప్రపానకం మిరియాలకారం చుర్రుమన్నట్లు రసంలో విభావాదులు ఒక్కొకసారి తమ ప్రత్యేకత ప్రదర్శిస్తాయి.

ఈ కృష్ణప్రేమ వియోగంవల్ల అద్భుతానంద పరిపాకం పొంది, ప్రగాఢ ఆర్తితీయగా అతిశస్తుంది. పరమానందం అంటే హ్లాదినీ శక్తియే. దీనికి మూలం రసం యొక్క అఖండ ప్రకాశమే. భక్తి రస నిరూపణలో ముఖ్యం 'రసాలం'. శాంత ప్రీతి వత్సల మధురం ఒకదాని కంటె ఒకటి ఉత్కృష్టమైనది. రసాలు వాటివర్ణాలు అధిదేవత లిలా ఉన్నారు.

| **రసాలు** | **వర్ణాలు** | **దేవతలు** |
|---|---|---|
| శాంతం | శ్వేతం | కపిలుడు |
| ప్రీతి | చిత్రం | మాధవుడు |
| ప్రేయస్సు | అరుణం | ఉపేంద్రుడు |
| వాత్సల్యం | శోణం | నృసింహుడు |
| మధురం | శ్యామల | నందనందనుడు |
| హాస్యం | పాండువర్ణం | బలరాముడు |
| అద్భుతం | పింగళం | కూర్మరూపుడు |
| వీరం | గౌరం | కల్కి |
| కరుణం | ధూమ్రం | రాఘవుడు |

పశ్చిమసముద్రంలో

# శాంతభక్తి లహరి

ఈ పశ్చిమ విభాగంలో శాంత భక్తిరసం నిరూపించబడుతోంది.

శమ ప్రధానులు ఆత్మారాములు తాపసులు ఆస్వాదంజేయు మాధుర్యరూప విశేషం శాంత భక్తి రసం.

ఇది శుద్ధరతి. ఇదిత్రివిధం. 1. సామాన్యం, 2. స్వచ్ఛం, 3. శాంతి శాంతరసంలో సామాన్యం అస్ఫుటం. స్వచ్ఛం చంచలం శాంతిలోనే రసపోషకం జరుగుతుంది. పై రెండూ రసవంతాలు కావు శాంతి రసవంతం.

యోగులకు శాంతరసం వలన నిర్విశేష బ్రహ్మానందం కలుగుతుంది. ఈ ఆత్మదర్శనం వలన లభించు ఆనందం అత్యల్పం. కానీ, ఒక్కొక్కసారి వీరికి భగవద్గుణ స్ఫూర్తి ఘటిల్లుతుంది. ఈ భగవత్స్ఫూర్తిమయమైన ఆనందం. ఘనతరం. శ్రేష్ఠతమం.

ఈ యోగులలో భగవద్గుణ స్వరూప అనుభవం కల్గినా దానిలో దాసాదులకు లభించు ఆనందంలో సౌందర్యచాతుర్య మధురానుభవం ఉండదు. కేవలం దర్శనం వరకే పరిమితం. దీనితో వారికి కృతార్థత మాత్రం సిద్ధిస్తుంది.

**శాంతఆలంబన విభావాలు.**

శ్రీకృష్ణుని యొక్క - కృష్ణభక్తివరేణ్యుల యొక్క - కృపాలవలేశం చేత ఆనందం పొందిన ఆత్మారాములు భగవత్ శ్రద్ధాళువులు తాపసులు శాంతరసావలంబులు.

సనకసనందాదులు ఆత్మారాములు. భక్తిరసంలో వారు మిక్కిలి ప్రధానులు. వారి రూపం చింతనీయం. వారు సదా పంచాబ్దప్రాయులే. తేజోవిరాజితులు. గౌరవర్ణంగలవారు. దివ్యదిగంబరులు. వీరు నలువురు కలసి తిరుగుతుంటారు. వీరు సదా విష్ణుదర్శనాభిలాషులు. వారి భక్తి అనిర్వచనీయం.

''ముకుందా! గోవిందా! నందనందనా! ఆనందకందా! భక్తి మందారా! చిదానందఘనా! నీమూర్తి ఎంత సుందర తరం! నిత్యనూతన తమాలం! ఆనందరసాలం! సుఖానంద సంధాయకం! అద్భుతం! దేవపారిజాతం!

దేవదేవా! నీమూర్తి స్ఫురణ లేనంతవరకూ మా మనస్సులు తపస్సులలో నిశ్చలాలు. ఆ స్ఫురణ రానంతవరకే, ఇంద్రియాలకు అగోచరం, సర్వగుణవర్జితం అనిర్వాచ్యం అయిన బ్రహ్మ వస్తువు నందు సుఖముండేది. నీ మూర్తి స్ఫురణ రాగానే మా మనోరథాలు మీ వైపు పరుగిడుతుంటాయి.

భక్తిచేత నిర్విఘ్నంగా ముక్తి కలుగుతుంది. ఈ కారణంచేత తాపసవరులు తగిన వైరాగ్యంబూని మోక్షేచ్ఛను విడువక మిమ్ము సేవిస్తూంటారు. కొండలోయలో, చెట్టుక్రింద నివసించి, కౌపీనం ధరించి, కందమూలాలు భుజించి, మదిలో మాధవ చిదానంద జ్యోతిని మాటిమాటికి ధ్యానిస్తూ రాత్రులను క్షణాలవలె గడుపుతూంటారు.

కృష్ణపదారవింద కింజల్కమిశ్రిత తులసీగంధం నాసికద్వారా లోపలకు వెళ్ళి, బ్రహ్మానందం అనుభవించు సనకసనంద మునుల మనస్సులను, దేహాలను పులకింపజేస్తుంది - చక్కిలిగింతలు పెడుతున్నది భక్తి. అంటారు సనకసనందాదులు.

అలరు భవత్పదాంబుజయుగార్పితమై పొలుపొందునట్టి యా
తులసి పవిత్రమైన గతి తోయజనాభ! భవత్కథాసుధా
కలితములైన వాక్కుల అకల్మషయుక్తిని విన్న కర్ణముల్
విలసిత లీలమై భువి పవిత్రములై విలసిల్లు మాధవా!

- పోతన

## శాంత రస అనుభావాలు -

నాసాగ్ర దృష్టి - అవధూత కార్యమగ్నత - పరిమిత దూర దృష్టి ప్రసారగమనం - ముద్రాప్రదర్శనం - హరిద్వేషిని కూడా ద్వేషించక యుండుట - భగవద్భక్తులపై కూడా మమత లేకుండుట - సిద్ధత్వం - జీవన్ముక్తి - బాహ్యలోకంపై ఉదాసీనత - మమతారాహిత్యం - మౌనం శీతమయ అసాధారణ క్రియలు.

సాత్త్విక భావాలు - రోమాంచం స్వేదం కంపం మొదలైనవన్నీ శాంతరస అనుభవాలు.

## రోమాంచం ఉదా -

''కృష్ణ పాంచజన్యధ్వని విరాగులై పర్వత గుహలలో తపస్సుచేసుకొనే నిశ్చల నిర్వికార బ్రహ్మ సమాధి మగ్నమానసులకు ఒక విలక్షణమైన వినూత్న స్ఫూర్తి కలుగజేస్తున్నది. ఈ మంగళకర రోమాంచానికి వారు విస్మయం జెందుతున్నారు''.

మానాభిమాన శూన్య యోగీశ్వరులదేహాదులందు సాత్త్వికభావాలు జ్వలిస్తాయి. కానీ అవి ప్రదీప్తాలు కావు.

సంచారీ భావాలు - 1. నిర్వేదం 2. ధృతి 3. హర్షం 4. మతి 5. స్మృతి 6. విషాదం 7. ఔత్సుక్యం 8. ఆవేగం 9. వితర్కం మున్నగునవి శాంతరససంచారీ భావాలు

## నిర్వేదం ఉదా -

ఈ ద్వారకానగరంలో మన జన గణం మధ్యలో పరమఘనశ్యామ సుందర మూర్తి, శ్రీ కృష్ణ పరమాత్మ విరాజిల్లుతున్నాడు. అయ్యో! గుర్తించలేక బ్రహ్మ చింతనం ఆత్మారామత్వం అంటూ కొండగుహల్లో కూర్చొని ఎంతకాలం వ్యర్థం చేశాను.

శ్రీకృష్ణస్వామి కృపావిశేషంచేత శాంత భక్తునకు జ్ఞాన సంస్కారం సడలినట్లైన శుకుని వలె భక్తిరసంలో మునిగిపోతాడు. శమానికి నిర్వికారత ముఖ్యమైన కారణం కావడం చేత నాట్యశాస్త్రవేత్తలు దీనిని రసంగా స్వీకరించలేదు. శాంతం

రసం కాదన్నారే కానీ భక్తులకు సమ్మతమైన శాంతిని కాదనలేదు. దీనికి కారణం భగవానుని యందలి ప్రీతి రసత్వానికి పూర్వవేం స్థాపితమై యున్నది. కృష్ణభగవంతుడు ఉద్ధవునితో ఇదే చెప్పాడు.

భగవన్నిష్ఠతాబుద్ధిని శమం అంటారు. కనుక శాంతిరతి అయియున్నది. రతిలేకుండ భగవన్నిష్ఠ కలుగుట దుర్ఘటం.

విష్ణుధర్మోత్తర పురాణంలో శాంతరసం స్థాపింపబడింది. సుఖం, దుఃఖం, ద్వేషం, మాత్సర్యం లేకుండా సర్వజీవుల పట్ల సమభావమున్న అది శాంతిరసం.

పూర్తిగ అహంకారదూరములైన ధర్మవీరం దానవీరం దయావీరం శాంతరసంలో అంతర్భూతాలు. ఈ శాంతరసానికి ధృతిని, మరికొందరు బుధులు, నిర్వేదం స్థాయీభావం అన్నారు. తత్త్వజ్ఞానం నుండి పుట్టినదే నిర్వేదం.



పశ్చిమసముద్రంలో

# ప్రీతిభక్తి లహరి

శ్రీధరస్వామి రసప్రసంగంలో భక్తి రసాన్ని సప్రేమ భక్తి అని రసరాజం అనీ దీనికి పెద్దపీట వేశారు.

శ్రీలక్ష్మీధరస్వామి తమ నామకౌముదీ గ్రంథంలో ప్రీతిభక్తి రసాన్ని పూర్తిస్థాయీ భావం అని పేర్కొన్నారు.

శ్రీ సుదేవాది అలంకారులు శాంతరసమున ఇది ప్రీతిరసం అని వర్ణించారు. కనుక ఇది రసరాజమే. ఇది పరమరసమే

తగిన విభావాదుల ద్వారా భక్త హృదయులు, భగవత్ ప్రీతిని ఆస్వాదింప యోగ్యమైన దీన్ని ప్రేమభక్తి రసం అని చెప్పడమైనది. భక్తుల దాసత్వ లాలత్వ భేదాలతో ప్రేమభక్తిరసం (1) సంభ్రమ ప్రీతి, (2) గౌరవ ప్రీతి అని రెండువిధాలు.

**సంభ్రమ ప్రీతి**

తమను తాము భగవద్దాసులుగా తలంచు భక్తసత్తములకు శ్రీకృష్ణ సంబంధమైన సంభ్రమప్రేమ కలిగిన ఆ రసం సంభ్రమప్రీతి అంటారు.

ఈ సంభ్రమప్రీతికి ఆలంబనాలు హరి హరిదాసులు. హరివిషయాలంబనం. హరిదాసులు ఆశ్రయాలంబనం అవుతారు. ఇందులో హరి ద్విభుజుడు. గోకుల విహారి గోకులం కాక మధుర ద్వారకాదులలో హరి ద్విభుజుడు చతుర్భుజుడుగా కూడా దివ్యదర్శనం ప్రసాదిస్తుంటాడు.

వ్రజభూమిలో గోపాలుడు మిక్కిలి అందంగా ఉంటాడు. శరీరచ్ఛాయ నీలమేఘశ్యామ సుందరం. మొలమీద పీతాంబర సువర్ణ వస్త్రం. తలమీద నెమలి పింఛం. వదనంమీద చిరునవ్వు అందం ఒలకబోస్తుంటాడు. ఆ తేజస్సు, ఆ వర్చస్సు ఆ ఆకర్షణ, అత్యద్భుతం అద్వితీయం.

ఆ గోపాలకృష్ణుడు ఆవులను తోలుకొని పెనుకొండ శిఖరం ఎక్కుతాడు. అప్పుడు ఆనందనందనుడు కడు సుందరంగా కనిపిస్తాడు. ఒక రాతి మీద కూర్చొని మురళి మ్రోగిస్తాడు. ఆ మురళీగానం చేసేటపుడు జగన్మోహనంగా ఉంటుంది. ఆ వేణుగానం స్వర్గంలోని దేవతలకు భూలోకంలోని మానవులకు మహామధురానంద తరంగాలను అందిస్తుంది. లోకం మహానందంలో సంభ్రమిస్తుంది. సంభ్రమం! మహా సంభ్రమం!

ఈ కృష్ణస్వామి పచ్చని బంగారు పట్టుబట్టకట్టుకొని, కడు ముచ్చటగా ఉన్నాడు. స్వామి హస్తాలతో శంఖచక్రాలు ధరించాడు. శ్యామసుందరదేహం నూతన నీలాంబుద కాంతితో మెరిసి పోతున్నది. ఆ మేఘచ్ఛాయలో సూర్యుడు చక్రం చంద్రుడు శంఖంవలె భాసిస్తుంటారు

లలిత మాధవంలో ఒకచోట నారద మహర్షి శ్రీకృష్ణదేవుని ఈ విధంగా దర్శించి స్తవం చేశాడు -

ఈ శ్రీకృష్ణస్వామిని ఇక్కడ చూస్తుంటే పూర్వం విష్ణుదేవుని చూచినట్లే ఉంది. అదే రూపం. అదే పట్టు పీతాంబరం. కంఠంలో కౌస్తుభమణి, నాలుగు చేతులలో నాలుగు ఆయుధాలు. కౌమోదకీ, పాంచజన్యశంఖం, సుదర్శనచక్రం, శృంగారలీలా కమలం. ప్రక్క గరుడుని వాహనం దేదీప్యమానంగా శోభిస్తూన్నాయి.

ఈ కృష్ణదేవుడు వైకుంఠశోభను మరపిస్తున్నాడు. కృష్ణా! నీవు శ్రీమహావిష్ణుమూర్తివే. సౌందర్య వారాశివి కదా! నీ త్రిజగన్మోహనమూర్తికి ప్రణామం.

కృష్ణా! నీవు శతసహస్రకోటి బ్రహ్మాండ విరాట్ స్వరూపుడవు. నీ ఒక్కొక్క రోమకూపం ఒక్కొక్క బ్రహ్మాండం. నీ ఒక్కొక్క స్వేదబిందువు ఒక్కొక్క మహా కృపాసింధువు. నీ శక్తి అచింత్యం. సర్వ సిద్ధదేవముని గణసంసేవితం. మహా భక్తకోటిసంభావితం. నీవు అసంఖ్యగణ అవతారాలకు ఆదిబీజం. ఆత్మారాములకు ఆకర్షణీయ మూర్తివి. పరమ మునీశ్వరులకు ఆరాధ్యస్ఫూర్తివి. సర్వజ్ఞ శిరోమణివి. సుదృఢబలశాలివి. నియమ నిష్ఠాగరిష్ఠుడవు.

నీవు పృథ్వివి, సమృద్ధివి, సర్వసిద్ధివి, క్షమాశీలుడవు, దయాపాలకుడవు, గుణవిభూషణుడవు, అణుమూర్తివి, పరమాణుమూర్తివి, అఖండకీర్తివి, సమవర్తివి, స్ఫూర్తివి.

శరణన్న వారిని కరుణించు కృపాకరుడవు. దక్షిణామూర్తివి, దక్షుడవు, శిక్షకుడవు, రక్షకుడవు, నీవు సత్యానివి, శాస్త్ర చక్షుడవు.

దేవా! నీవు సర్వజన శుభంకరుడవు, ధార్మికుడవు, నీవు శాస్త్రవిజ్ఞాన వీతిహోత్రుడవు, పరమపవిత్రుడవు, భక్తజన ఆప్తమిత్రుడవు, సదాన్యుడవు, మాన్యుడవు, అసామాన్యుడవు, తేజస్వివి, విశాల యశస్వివి. మధుర మనస్వివి, సర్వజ్ఞుడవు, కృతజ్ఞుడవు. సుయజ్ఞుడవు. శ్రేష్ఠుడవు, స్వామీ! సర్వజ్యేష్ఠుడవు, గరిష్ఠుడవు, శ్రీమంతుడవు, బలవంతుడవు, ధీమంతుడవు, స్వామీ! నీవు ప్రేమమూర్తివి, నీకు ప్రణామశతాలు.

ఈ కృష్ణదేవుడు నాల్గు విదాలైన దాసులకు ఆలంబన విభవమై ప్రకాశిస్తున్నాడు.

ఈ కృష్ణదాసులు శ్రీకృష్ణరాజాశ్రితులై శ్రీకృష్ణ ఆజ్ఞాపాలకులై, శ్రీకృష్ణసేవానురక్తులై విశ్వాస వినయ వినమ్ర బుద్ధిగలవారలై, యోగ్యులై, కృష్ణుడు ప్రభువు మేము భృత్యులము అనే సుజ్ఞానంతో జీవనం పావనం చేసుకొంటూంటారు.

''మాయీ శ్రీకృష్ణ చక్రవర్తి బ్రహ్మాండ నాయకుడు నిఖిలగుణ భూషణుడు. మాస్వామి సర్వాంతర్యామి. అసమానుడు. అనే సుస్థిర సిద్ధాంతం కలిగి, పరులకు హితం చేస్తూ హరిసేవలు చేయువారు ఈ దాసులు.

ఈ దాసులు నాల్గు విధాలు. 1) అధికృతులు, 2) ఆశ్రితులు, 3) పారిషదులు, 4) అనుగాములు

అధికృతదాసులు రాజరాజేశ్వరి బ్రహ్మమహేశ్వరులు ఇంద్రుడు మొదలైనవారు. వీరి భక్తిని గూర్చి కృష్ణపట్టమహిషులు కాళింది జాంబవతి ఇలా భాషించుకోసాగారు -

కాళింది:- అక్కా! జాంబవతీ! మన ప్రాణనాథుడైన శ్రీకృష్ణపరమాత్మకు ప్రదక్షిణ చేయువారెవరే!

జాంబవతి: అక్కా! ఆమె ముగురమ్మలగన్నయమ్మ దుర్గాదేవి. పార్వతి.

కాళింది: అలానా! అక్కడ, వణకుచూ ప్రణమిల్లి ప్రగాఢమైన భక్తితో స్తోత్రం చేస్తున్న ఆమహాదేవుడెవరు!

జాంబవతి: ఆయన నీవన్నట్టు మహాదేవుడే శివుడు. పార్వతీపతి.

కాళింది: కృష్ణస్తోత్రం చేస్తున్న ఆ మహానుభావులు.

జాంబవతి: బ్రహ్మాదులు.

కాళింది: కృష్ణ పాద సమీప భూమిపై సాష్టాంగ నమస్కారం చేస్తున్నవాడు ఎవరు అక్కా?

జాంబవతి: అతడు సహస్రాక్షుడు దేవేంద్రుడు

కాళింది: కృష్ణస్వామి పరిహాసానికి పాత్రుడై స్తబ్దంగా ఉన్నవాడు ఎవరే?

జాంబవతి: అతడే! అతడు యమధర్మరాజే అక్కా.

కృష్ణాశ్రిత దాసులలో మూడురకాలున్నారు.

1. శరణ్యులు, 2. జ్ఞానిచరులు, 3. సేవానిష్ఠులు

కృష్ణా! సంసార దుఃఖాదుల వలన భయపడి నిన్నే శరణు జొచ్చుచున్నాను. కొందరు ముముక్షుత్వం వదలి నీవిషయం తెలుసుకొని పురుషార్థం గ్రహించి, నిన్నే ఆశ్రయిస్తున్నారు.

హే లీలావినోదమూర్తీ! సాధుమానస నవనవానంధ నందనందనా! నీ మధుర మంగళ మహాలీలాద్భుతాలు విని, నీ సేవకై నీచెంతకు వచ్చి కూర్చున్నాను. నిన్నే కోరుకొంటున్నాను. అనేవారు మహా భక్తులలో, శరణ్యులు. జరాసంధ బంధిత రాజులు, కాళియుడు మొదలగువారున్నారు.

కాళీయప్రార్థన ఇది - శ్రీకృష్ణా! దేవతాచక్రవర్తీ! నేను మహాపరాధాలు చేసి కాళిందిలో సర్పాన్నై పుట్టాను. అయినా! నీ అద్భుత పదచిహ్నాలతోడి నీదయ పొందాను. ఇది నా అదృష్టం. నీ పదాంకాలు ఏ భక్తులు పొందారు కనుక! దానితో నేను ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాను.

స్వామీ! దుర్గుణజాలం నన్నువదిలింది నీదాస్యం ప్రసాదించి నన్ను కరుణించు.

మహాభక్తులలో జ్ఞానులు శౌనకాదిమహామునులు 'హరిభక్తి సుధోదయం'-

మహాత్మా! పరమాత్మా! మానవజన్మ దోషభూయిష్ఠమైనదైననూ సత్సంగంతో పునీతమవుతోంది. భక్తసంగమంచేత నీభక్తి అలవడిమోక్షంపై మమకారం తగ్గింది. నీపై రక్తి ఆసక్తి పెరిగింది. జ్ఞానం అంటే నీ సాయుజ్యం పొందుటే కదా!

'పద్యావళి' చెప్పినట్లుగా ధ్యానాతీతంగా నీపై రక్తి. హృదయంలో నీ చిన్మయముద్ర భద్రమై ఆత్మజ్యోతియై ప్రకాశించుగాక! నీ సుందరసురూపం, ఏమని వర్ణించను స్వామీ! నీవిశాల పంకజనేత్రాలు, నీ సహజసౌందర్య మాధుర్యరూపం, నీ మనోహర వదనారవిందం, నీ అధరాలపై మధుర మందహాసం నీ మేఘశ్యామల కోమల శరీరం, నీపట్టుపీతాంబరం, దర్శించినంతనే పుణ్యమవశ్యం కలుగుతుంది ప్రభూ! ఆత్మజ్ఞానం మధురాతిమధురమై ఆకర్షిసుంది. కృష్ణా! నీవు సార్థక నామధేయుడవు కదా!

**సేవానిష్ఠులు - భజనాసక్తులు**

సేవానిష్ఠులలో చంద్రధ్వజుడు, హరిహరుడు, బహుళాశ్వుడు, ఇక్ష్వాకుడు, శ్రుతదేవుడు, పుండరీకుడు మున్నగువారున్నారు.

కృష్ణా! నీ సుగుణాలు ఆత్మారాములైన మునులను కూడా ఆకర్షిస్తున్నాయి. వనాలలోని పక్షులు కూడా నీగానసభలకు మిక్కిలి అపేక్షతో చేరుతున్నాయి.

ఈ సంగతి శ్రవణంచేసి నేను ఎక్కువ ఉత్కంఠతో నీసేవకు రాగోరుతున్నాను. నిన్ను భజిస్తున్నాను. నిన్ను సేవిస్తున్నాను. నీ నామం స్మరిస్తున్నాను. అంటాడు ఒకభక్తుడు.

**పారిషదులు -**

ఉద్ధవుడు, దారకుడు, జైత్రుడు, శ్రుతదేవుడు, భీష్ముడు, విదురుడు, పరీక్షితు మున్నగువారు సారథ్యం, పరిచర్య, వింజామరం వేయుట ఆదిగాగల సేవలు చేస్తుంటారు.

వీరందరు రసమయహృదయులు - అలంకారప్రియులు వీరు కృష్ణుని వలె కట్టుబొట్టుకలిగి ఉంటారు.

వీరిభక్తి అనుపమానం - నారదుడు కృష్ణునితో ఇలా అన్నాడు - ''కృష్ణా! నీ వీరగాథలు వింటూ ఆనంద బాష్పగద్గద కంఠాలతో నీకు సమర్పింపబడిన బుద్ధిగలవారై ఉద్ధవాది పారిషాదులు ద్వారకాపురద్వారం వద్ద నీ సేవాకార్యానికై

చేతులు కట్టుకొని వేచియున్నారు. వీరిలో ఉద్ధవుడు సేవా ప్రేమహృదయం గలవారిలో సర్వశ్రేష్ఠుడు. ఉద్ధవరూపం మనోహరం - ఉద్ధవునిది కాళిందీనదివంటి కమనీయకాంతి. కృష్ణనిర్మాల్యమాల ఆ భూషణం గాగల కంఠంతో, గోరోచన రంగువంటి పట్టు పీతాంబరం కటిమీద. కోటగడియలవంటి బలిష్ఠభుజాలతో, అరవిందాలను డిందుసేయు విశాలనేత్రాలతో. భక్తిరసాప్లావితహృదయంతో ప్రథమపీఠం. అట్టి ఉద్ధవుడు పరమ పూజనీయుడు.

ఉద్ధవుడు అనేక విధాల శ్రీ కృష్ణునితో క్రీడిస్తుంటాడు. శ్రీ కృష్ణదేవుడు బ్రహ్మాండకోటికి అధీశ్వరుడు. బ్రహ్మాదిమహేశ్వరులను శాసించు వాడైనా అకలంక భక్తుడైన ఉగ్రసేన శాసనం శిరసావహించు స్వభావంగలవాడు. విశ్వస్వరూపుడైననూ సముద్రమధ్యంలోని చిన్ని ద్వారకలో వసిస్తుంటాడు. ఎంత చిత్రం! తాను మహావిజ్ఞాన వారాంనిధియైననూ 'ఉద్ధవుడు అల్పుడని' ఎంచక ఆలోచన కోరుతుంటాడు. కృష్ణుడు ఉద్ధవునికి నెచ్చెలి.

కొందరు చందనకాంతి గలవారున్నారు. వీరునిత్యం కృష్ణప్రభువుకు సేవచేస్తుంటారు. వారిలో వారు సేవాకార్యాలలో ఇలామగ్నమైయుంటారు -

''వకుళా! స్వామికి పట్టువస్త్రాలు తీసుకురా! త్వర త్వరగా! పద! వారిదా! స్వామికి స్నానానికి అగరు సువాసితమైన మంచిజలం తేడు. రసాలా! కప్పుర తాంబూల విడెం సిద్ధంచేయి. స్వామి వచ్చేవేళ అయింది. అల్లదిగో! గోధూళి తూర్పు దిక్కున! గోపాలస్వామి వస్తున్నాడు. త్వరపడండి''. అని ఒకరినొకరు హెచ్చరికలు చేసుకొంటూ సేవాకార్యాలలో మునిగిపోయారు.

ఈ వ్రజ వాసులలో రక్తకుడు సర్వశ్రేష్ఠుడు. రక్తకుడు కడు అందంగా ఉంటాడు. పీతాంబరాలు ధరిస్తాడు. లేతపచ్చికరంగులో ఇతని శరీరం శోభస్కరంగా ఉంటుంది. ఇతడు శ్రీకృష్ణుని అనుంగు మిత్రుడు. ఆప్తుడైనసేవకుడు.

రక్తకంఠుడు కూడా ఇలానే ఉంటాడు కానీ శ్రావ్యంగా కమ్మని కంఠంయెత్తి గానం చేస్తాడు. ఆగానం అందరినీ అలరిస్తుంది. ఈ సేవకుల భక్తి సాటిలేనిది.

శ్రీకృష్ణుడు ఒకసారి స్త్రీ వేషం ధరించి రసదుడనే భృత్యుని సమీపించి 'నేను నీ సఖిని, ఏదీ ఇటుచూడు. అటుకొంచెం విహరించి వద్దాముర!' అన్నాడు. రసదుడు సిగ్గుతో కుంచించుకుపోయి 'స్వామి! నావంటి అల్పునితో

ఇలా పరిహాసాలాడుతారు 'ఏమిటి' అనుకొన్నాడు. ఇంతలో అక్కడ రక్తకుడు తటస్థపడితే అతన్ని అడిగాడు. స్వామి ఇలా అంటున్నాడని.

అపుడు రక్తకుడు ఇలా చెప్పాడు - రసదా! నీ భాగ్యం పండింది. స్వామి చెప్పినట్లు చేయి. నేను సదా ఇదే ప్రార్థిస్తుంటాను. గిరిధారి - నందరాజ పుత్రుడు - మహాదేవాధిపుడు అయిన శ్రీకృష్ణపరమాత్మ చరణసేవ నాకు జన్మజన్మలకు లభ్యంకావాలి. ఆసేవాచాతుర్యంలోని మాధుర్యం పట్ల నాకు అమితమైన అనురక్తి ఉంది. ఉండాలి. అది మన అందరికీ ముఖ్యమైన జీవకర్ర.

భాగవతంలో పృథు చక్రవర్తి ఇలా అంటాడు - ''కృష్ణా! జగత్ప్రభూ! శ్రీ కాంతా! నాకు లక్ష్మీదేవితో ఈర్ష్య విరోధం వచ్చేలాగుంది. ఆ దేవీ శిరోమణీ, నేనూ, నీ పాదాలు పట్టుతున్నాము. ఆ సందర్భంలో ఏమైన పొరపొచ్చాలు వస్తాయేమో! నీవన్నీ నూత్నభావాలు ఆమెవన్నీ పాత భావాలు. ఆమె వట్టి సత్యకాలం మనిషి. నీవు అధునాతనభావాలకు అనుకూలంగా ఉంటావు. నీతో ఆమెకు విరోధం రాదు. నాకై పూర్వం ఇలాంటి సందర్భంలో నా పక్షమే వహించావు. నీవు భక్తవత్సల బిరుదాంకితుడవు కదా! ఇప్పుడూ అలానే చేయి. భక్తమందారునకు భక్తులు చేయు అల్పమైన సేవలకే సంతోషం''.

ఈ దాసులలో - నిత్యసిద్ధులు - సిద్ధులు - సాధకులు - అనే మూడు భేదాలవారున్నారు.

అనుగ్రహం అందుట - పాదధూళి పొందుట ప్రసాదం స్వీకరించుట - భక్తుల సాంగత్యం లభించుట - ఇవి ప్రేమరస ఉద్దీపన విభావాలు

'ఓ కృపాచార్య! యోధాగ్రేసరులారా! ఈ దీనుడిపై శ్రీకృష్ణపరమాత్మ కృపప్రసరించింది. చూడండి ఆహా! యోగీశ్వరేశ్వరుడు మహా యోగులకు లభ్యంకాని వాడు శ్రీ కృష్ణస్వామి నా మరణసమయంలో నాకు సాక్షాత్కరించాడు. నన్ను తనలోకి తీసుకొన్నాడు. ఎంతటి అనుగ్రహం!'' అన్నాడొక భక్త యోధాగ్రణి. ఇది అనుగ్రహ ప్రాప్తికి ఉదాహరణ :

కృష్ణమోహన మురళీధ్వని శృంగనాదం -
మందహాస కృపాలోకనం గుణోత్కర్షశ్రవణం -
పద్మధ్వజవజ్రాది చిహ్నాలు మేఘశ్యామలచ్ఛాయా -
శరీర సౌరభాదులు శాంతాదులైన నాల్గురసాలకు ఉద్దీపనాలు

కృష్ణలీలా విశేషాలు దర్శించిన విప్రవరులు ఇలా పరస్పరం మాట్లాడుకోసాగారు -

"అదిగో! అది వేణు నినాదం. ఎంత ఉత్కంఠత కలిగిస్తుంది. స్వరాలు పరస్పరాశ్లేషసౌరభాలను వెదజల్లుతున్నాయి. ఈ మురళీకృష్ణుని వేణుధ్వనులు విని దేవేంద్రుని దేహం పరవశం అయింది. ఆ స్వామి సహస్రనేత్రాలనుండి ఆనందబాష్పాలు వర్షధారలవలె కురియసాగాయి - ఆశ్చర్యం! ఆశ్చర్యం! మేఘంలేకపోయినా వ్రజమండలం అంతా ఆనందబాష్పాలతో అభిషిక్తమయింది."

**నృత్యవిశేషం**

ఒకసారి శ్రీకృష్ణపరమాత్ముడు శ్రుతదేవుని గృహానికి వెళ్ళాడు. శ్రుతదేవుడు తనయింటికి వచ్చిన కృష్ణపరమాత్మను చూచి అపరిమిత పరమానందంచెందాడు. బహుళాశ్వుని వలె తన్మయతతో స్వామికి పాదనమస్కారాలు చేశాడు. అధికమైన ఆనందంతో పైగుడ్డ ఊపుతూ నృత్యం చేయసాగాడు.

అది చూచి కృష్ణుడిలా అన్నాడు "శ్రుతదేవా! నీవు నృత్యాదికళలకు విముఖుడవైనా నేడు విచిత్ర గతులలో అపూర్వ నృత్యవిధి చూపిస్తున్నావు. నాకే ఆశ్చర్యంగా ఉంది. దీనివలన ప్రేమ కళకు నీవు నాట్యగురువవుతున్నావు. ప్రేమయే నీకడ నాట్యం నేర్చుకొన్నట్లున్నది.

సంచారీ భావాలు - 1) హర్షం 2) గర్వం 3) ధృతి 4) నిర్వేదం 5) విషణ్ణత 6) దైన్యం 7) చింత 8) స్మృతి 9) శంక 10) మతి 11) ఔత్సుక్యం 12) చపలత్వం 13) వితర్కం 14) ఆవేగం 15) లజ్జ 16) జాడ్యం 17) మోహం 18) ఉన్మాదం 19) అవహిత్థం 20) బోధ 21) స్వప్నం 22) క్షమ 23) వ్యాధి 24) మృతి ఇవి ప్రీతి భక్తి రసంలోని సంచారీ భావాలు

1) మదం 2) శ్రమ 3) త్రాసం 4) అపస్మారం 5) ఆలస్యం 6) ఔగ్ర్యం 7) అమర్షం 8) అసూయ 9) నిద్ర ఈ సంచారీభావాలు సంభ్రమప్రీతి

రసానికి అతిపోషకాలు కావు. వీనిలో మదానికి పోషకత్వంలేదు. శ్రమ సేవోత్కంఠతకు పోషకత్వం కావచ్చు కానీ అలసటతో కలిగిన శ్రమ పోషకత్వం కాదు. త్రాసం మొదలైనవి కృష్ణ శత్రుసమాగమం వలన పట్టినచో పోషకం అని ప్రభు పాదులు 'నాతిపోషకం' అన్నారు.

శ్రీకృష్ణ ప్రభువును దగ్గరగా చూచి సాష్టాంగ నమస్కారాలు శతం చేద్దాము అనుకొని ఒక భక్తుడు ప్రథమ నమస్కారం తోనే పారవశ్యం చెంది, అతిహర్షం చేత ఆనందాతిరేకం చేత భూమి నుండి లేవటం మరచిపోయాడు. ఇది అతి హర్షి ప్రభావం.

## ప్రేమ - ప్రీతి

ప్రేమ స్థాయీభావం. దీనిలో శంకాదులుండవు. ఇది సంభ్రమ ప్రీతి మూలకం. దీనికి విద్యుతం కాని ఆసక్తి మున్నగునవి దీనికి అనుభావాలు.

శ్రీవిష్ణుదేవుడు బలిని దండించి, అనుగ్రహించాడు. బలి మనస్సు మాధవునిపై సుస్థిరమయింది. అపుడు అతడు ''నాకు అణిమాది సౌఖ్యాలిచ్చినా, నాకు ఎట్టి వికారభావాలు కలుగనేరవు'' అన్నాడు. అది నిష్కళంక ప్రేమ. బలి తత్త్వం గ్రహించి, శ్రీకృష్ణపరంధాముడు ఉద్ధవునితో ఇలా సంభాషించాడు.

'ఉద్ధవా! బలిని గమనించావా! ఎంత సుదృఢమైన భక్తితో ఉన్నాడో చూడు. తన గురువు శుక్రాచార్యుడు ఇతని విష్ణుభక్తిపై మండి పడ్డాడు. ఆగ్రహించి, శపించాడు కూడా. నేను మాయ చేసి అతని మూడు లోకాలు హరించాను. విశేషంగా నిందించాను. నాగపాశాలతో బంధించాను. ఇంత చేసినా నాపై ఇసుమంతైనా కినుకలేక నాపై భక్తి ఇంకా రెట్టింపయింది. ఎన్ని కఠిన పరీక్షలకో ఆగాడు కదా! అంతటి భక్తుడు దుర్లభం.'

## స్నేహం - దాస్యం

మనస్సును కరగించు దట్టమైన ప్రేమయే స్నేహం. ఈ దశలో మనస్సు క్షణకాల వియోగం సహింపలేదు.

ఉదా: దారుకుడు కృష్ణుని దాసులలో ఒకడు. అతని స్థితిని చూచి ఒక్క భక్తాగ్రేసరుడు ఆప్తమిత్రుడు వృద్ధుడు ఈ విధంగా భాషించి, ఆశ్చర్యపోతున్నాడు.

"దారుకా! నీవు శ్రీకృష్ణ పరమాత్ముని చూచి, నీచిత్తం పూర్తిగా ద్రవించ సాగింది. ఆ మానస జలం పొంగి పొంగి నేత్రాల నుండి ఆనంద బాష్పధారల రూపంలో వెలువడసాగింది. అందుచేత నీ దేహం మహా విచిత్ర దశ పొందింది. ఆ దశ గమనిస్తుంటే మాకే మహాశ్చర్యం కల్గుతోంది. దారుకా! నీ జన్మధన్యమైంది.

ఉద్ధవుడు ఉత్తమోత్తమ భక్తవర్యుడు. కృష్ణ దర్శనం కాగానే ఆనంద బాష్పధారలు ప్రవహించి, సముద్రునకు ఉత్తమ సాధ్వీ రూపం దాలుస్తుంటాయి. నదులు సముద్రుని భార్యలు కదా! ఉద్ధవుడు ఆనందపులకిత అశ్రువులతో ఉత్తమ నదీ కాంతల జనకుడై సముద్రునకు మామ అవుతుంటాడు. ఈ ఉత్తమ స్నేహం వలన స్వరభంగమైనా మాధుర్యం వహిస్తుంటాడు. సహజ సుందర కంఠ నాళ భంగం నుండి కృష్ణ స్తోత్రాక్షరాలు ఆరంభమై స్ఖలనం అవుతుంటాయి. ఈ స్వర భంగం వలన సర్వాంగాలు పులకించి, కాయం నుండి పుష్పాలు విచ్చుకొంటాయి. దీనితో అతడు స్తబ్ధుడవుతాడు. అపుడు ఉద్ధవుడు భక్తులందరిలో మరీ ఎక్కువగా శోభిస్తుంటాడు.

## అనురాగం

స్నేహం వలన దుఃఖ జనక వస్తువు కూడా కృష్ణ సంబంధలేశం పొంది, సుఖదాయకం అవుతుంది. ప్రాణ వ్యయంలోనూ కృష్ణ భగవానునకు ప్రీతి కలిగిస్తే అది, ఆ స్నేహమే రాగం. ఇందుకుదాహరణ పరీక్షిత్తు చరిత్ర.

పరీక్షిత్తు ఉత్తమ ప్రభువు. ఒక ముని శాపం వలన తక్షక భయం పీడించ సాగింది. గడువులో పరలోకం జేరబోతున్నట్లు తెలిసింది. రాజ్యం విడిచి పెట్టాడు. ప్రాణాంతం వరకు నిరాహార వ్రతం పూని కృష్ణ స్మరణం మాత్రం చేస్తూ కూర్చున్నాడు. కృష్ణ లీలా భాగవత సుధాసాగరంలో ఓలలాడుతూ అధికమైన పరమానందం అనుభవించసాగాడు.

శ్రీకృష్ణ కరుణ లేశం లభించినా బడబానలం కూడా తీయని పానకంగా ఉంటుంది. ఆయన కృప లేనిచో ద్వారక కూడ ముండ్ల ప్రదేశం అవుతుంది.

ఉద్ధవుడు కృష్ణ దర్శనం కొరకు ఆవేదన చెందుతాడు. మరింకా, "ఓ కృష్ణా! వాసుదేవా! వ్రజప్రభూ! రాజరాజ మహేంద్రా! నీవు నా నేత్రద్వయానికి అమృత సముద్రుడవు. నీ పాదపద్మాలను దర్శించలేని నా మన్మధువ్రతం

పరితపించి, పరిపరి విధాల తప్తచిత్తయై పరిభ్రమిస్తోంది. ఒక్కొక్క క్షణం ఒక్కొక్క సంవత్సరంగా గడుపుతోంది. స్వామీ! నీ సందర్శనం లేకుండ మనజాలను. నన్ను క్షమించి, నాకు కనిపించు దేవా! శత సహస్ర వందనాలు. అని మొరపెట్టుకొంటాడు.

## దైన్యం

''దేవేశా! కృష్ణ మహేశా! దయాసాగరా! శంకరా! కృపాకరా! నిన్ను ప్రార్థిస్తున్నాను. చేతులెత్తి శరణు వేడుతున్నాను. ఒక్కసారి నన్ను చూడు. నా విన్నపం ఆలించు నీ పాదాలు పట్టుకోనియ్యి. నీ కటాక్షామృత బిందువులతో నన్ను పునీతుణ్ణి చేయి. నీ దయామృతం నాపై చిలుకు!

స్వామీ! అంతర్యామి! పాపనాశనా! పతిత పావనా! బ్రహ్మ మహేశ్వరాదులు కూడా నీ మాయ గెలిచి నిన్ను దర్శించలేక పోయారు. వారికే నీ దర్శనం సాధ్యం కాకపోతే! నేనెంత! కడుచిన్న కీటకాన్ని. కీటకం కంటే కూడ హీనమైన వాణ్ణి! దైన్యంతో క్రుంగి పోతున్నాను. మంద కర్ముడను. మంద భాగ్యుడను. నేను ప్రార్థనా విషయంలో అయోగ్యుడను. అయినా నీవు పతిత జనోద్ధారకుడవు. కనుక ప్రార్థిస్తున్నాను. క్రీగంటి చూపులతో నన్ను పావనం చేయి. నీ కృపాకటాక్షంతో నన్ను ఒక్కసారి స్నానం చేయించు. నీకు నమస్కరిస్తాను'' ఇది దీనంగా చేసే ఒక భక్తుని ప్రార్థన.

కృష్ణా! పాపహరా! మనోహరా! నా నేత్రాలు లజ్జను వదలి వేశాయి. భక్తులంటే భయాన్ని అణచుకొన్నాయి. తృషార్తలై పరుగు పరుగున వచ్చి నీచరణారవింద మధుధారలను ఆస్వాదించటానికి ఆరాట పడుతున్నాయి. ఉపాయం అన్వేషిస్తున్నాయి. స్వామీ! ఇది నా చాపల్యం. ఏదో తొందర పడుతుంటాను. కానీ క్షమించు. కటాక్షించు. అంటాడు మరో భక్తుడు.

## జడత్వం

నారదమహర్షి ఇలా అన్నాడు. ''ఓ యుధిష్ఠిరా! రాక్షసవంశంలో జన్మించినా ప్రహ్లాదుని నిశ్చల భక్తి తత్త్వం ఎంత గొప్పది! ప్రహ్లాదుడు బాల్యంలోనే కృష్ణ పద పద్మాసక్తుడై ఆటలను వదలి వేశాడు. జడునివలె ఉండి పోయాడు. కృష్ణస్వామి అనుగ్రహానికి పాత్రుడైనాడు. సాధారణ జీవుని వలె మెలగసాగాడు.

ప్రహ్లాదుని దృష్టే వేరు. చూస్తాడు జగత్తును కాదు - జగన్నాథుని. సర్వం విష్ణుమయమని సర్వాన్ని చూస్తాడు. అతనికి అణువణువులో అచ్యుతుడే అగుపిస్తాడు.

శ్రీ వల్లభుడు దన్నుజేరిన యట్లైన
    చెలికాండ్ర నెవ్వరి జేరమరచు
అసురారి తనమ్రోల ఆడిన యట్లైన
    అసుర బాలురతోడ నాడమరచు
భక్తవత్సలుడు సంభాషించి నట్లైన
    పరభాషలకు మారు పలుక మరచు
సురవంద్యు దనలోన జూచిన యట్లైన
    చొక్కి సమస్తంబు జూడమరచు
హరి పదాంభోజయుగ చింతనామృతమున
అంతరంగంబు నిండి నట్లైన అతడు
నిత్యపరిపూర్ణుడగుచు అన్నియును మరచి
జడత లేకయు నుండును జడుని భంగి

- పోతన

ఈ సుదక్షుడనే బ్రాహ్మణుడు చూడు ! కృష్ణ ధ్యానంలో రెప్ప పాటు లేకుండా చలనం లేని శరీరంతో ప్రతిమ లాగ అట్టే నిలబడి పోయాడు. ఆకాశం వైపే దృష్టి సారించాడు. ఏమి చూస్తున్నాడనుకొంటున్నావు. ఆకాశంలో కృష్ణ మేఘం విహరిస్తోంది. ఆ శ్యామసుందర అంబుదాన్ని తదేకంగా విలోకిస్తున్నాడు.

## ఉన్మాదం

*భాగవతంలో ఇలా ఉంది.*

కృష్ణభక్తిలో తల్లీనుడైన ప్రహ్లాదుడు ఒకప్పుడు కృష్ణుని బిగ్గరగా కేకవేస్తాడు. కృష్ణుడు దగ్గరకు వచ్చినట్లే ఉంటుంది. ఒక్కొక్కప్పుడు నృత్యం చేస్తుంటాడు. అది రాధానృత్యం వలె కృష్ణునితో లీలా వినోదాలు చేస్తున్న రాధ వలె కనిపిస్తాడు. ఆ సమయంలో అతనికి దేహభ్రాంతియే ఉండదు కదా! ఒకప్పుడు అతడు

భగవన్నామం చేస్తాడు. అపుడు నారద తుంబురులను మైమరపిస్తాడు. భగవల్లీలను అనుకరిస్తాడు. తానే కృష్ణుడై గోపగోపికలతో సయ్యాట లాడుతున్నట్లే ఉంటుంది.

ఒకప్పుడు నారదుడు కూడా భక్తి రసోన్మాదంలో నృత్యం చేస్తాడు. గానం చేస్తాడు. భజన చేస్తాడు. ఆ స్థితిలో వంటిపై గుడ్డ ఉన్నదో లేదో తెలియదు. విలపిస్తాడు. విష్ణువును వెతుకుతాడు. అడుగో! కనిపించాడు! అడుగో! అడుగో! అని నవ్వుతాడు. తనలో తాను మాట్లాడుకొంటాడు. ఆడుకొంటాడు. భక్తి ఉన్మాదంలో అనేక రీతులుగా సంచరిస్తాడు.

## వియోగం

వియోగం అంటే కృష్ణ సాంగత్యం కొంతకాలం లభించి మరల ఎడబాటు కలిగిన అవస్థను వియోగం అంటారు.

శ్రీకృష్ణుడు బాణాసుర భుజాలు ఖండించటానికి శోణితపురం వెళ్ళి కొన్ని రోజులుండిపోయాడు. ఆ ఎడబాటు భరించలేక ఉద్ధవుని బుద్ధి కంపించింది. స్తంభించింది. మనస్సు పోయి అమనస్కుడయినాడు. దుఃఖ సంతోషాలు లేక స్తబ్ధుడయినాడు.

## యోగం

యోగం అంటే కృష్ణునితోడి సంయోగమే యోగం.

## సిద్ధి:

ఉత్కంఠితమైన దశలో హరి లభించటం సిద్ధి. ఒక భక్తురాలికి కృష్ణ స్వరూపం ఇలా కనిపించినపుడు ఆ లలనామణి ఈ అద్భుత రూపం గల నవమోహనాంగుడు ఎవరని చెలికత్తెను ఇలా ప్రశ్నిస్తుంది –

''బాలా! బృందావనంలోకి ఏకాంతంగా ప్రవేశించే ఈ పురుషోత్తముణ్ణి చూడు – మౌళిపై సుందర మయూర పింఛం ఎంతశోభాయమానంగా ఉంది. నీలనీరద శరీరం మరకతస్తంభం వలె గంభీరంగా ఉంది. వదనం మధుర మందహాస భాసురంగా ఉంది. నేత్రాలు వికసిత చంచల అరవిందాలవలె ఉన్నాయి. మాటలు మధురంగా లలితలలిత చమత్కార రంజితంగా ఉన్నాయి. గమనం బాల మత్తేభ గమనం వలె ఉంది. ఎవరు చెప్పు! ఎవరెవరే! నూత్నపురుషుడు మహాపురుషుడు. ఎవరై ఉంటారబ్బా! అంటుంది.

అక్రూరుడు కృష్ణవిగ్రహాన్ని చూచి ప్రేమవిహ్వాలుడై రథం నుండి ఎగిరిదూకి దిగివచ్చి శ్రీకృష్ణచరణాలపై ప్రణమిల్లాడు. ఆ ఆకర్షణ అట్టిది. అది అనితరసాధ్యం.

**తుష్టి**

కృష్ణ వియోగతాపం అనంతరం మరల లభించే సంప్రాప్తి తుష్టి. ఒక మహిళామణి దీనిని ఇలా వ్యక్తంచేస్తుంది. ప్రియా! ప్రాణనాథా! నీవు ఇన్నిదినాలా! ప్రవాసంలో ఉండటం! ప్రవాసకాలం ఎంతదుర్భరం! నీ ప్రసన్న దృష్టిలేకుండా ఈ లతాంగి జీవించగలదా! నిన్ను చూడగానే బాధలన్నీ పటాపంచలై పోయాయి. శోకం హరించింది. హరీ! నీవు ఆర్తిహరుడవు. మనోహరుడవు. మంగళకరుడవు. సుందర తర మంద హాసంతో శోభించు నీ ముఖమండలం చూచి ఎన్ని యుగాలయిందో కదా! ఇకపై ఒక్కక్షణంకూడా నిన్ను నీ మనోజ్ఞ కృపాకటాక్షం అవలోకించకుండా నిల్వలేను. నేను అబలను.

కృష్ణదేవుని ఆప్తసఖుడు దారకుడు. దారకుడు ద్వారకలో ఉండి కృష్ణ ప్రవాస దినాలను యుగయుగాలుగా గడుపుతున్నాడు. ఒక దినం కృష్ణుని ద్వారకాపురిద్వారంలో చూచాడు. అంతే విహ్వాలచిత్తుడై పారవశ్యం జెందాడు. అతని అవయవాలు అతని వశం తప్పాయి. చేతులెత్తి నమస్కరించటానికి కూడా చేతులు కదలలేదు. ఏదో అనిర్వచనీయదశలో మునిగి పోయాడు. అది విచిత్ర దశ. దారకుని తుష్టి అట్టిది.

**స్థితి –**

మురళీ మనోహరునితోడి సహవాసమే స్థితి. అది సుస్థితి. శ్రీ కృష్ణ పరమాత్మని చూడగోరి వేలాది జనం వచ్చి గుమిగూడారు. మందిరంలో ప్రాంగణంలో అనేక ఆప్తజనులు కృష్ణుని వలె తిరుగుతున్నారు. ఒక కోమలాంగి ఒకచెలిని అడుగుతోంది –

''చెలీ! కృష్ణుడంటే ఎవరే! అక్కడ చాలామంది పీతాంబర ధరులే! శిఖిపింఛ భూషితులే. సుశ్యామలగాత్రులే! ఎలా కృష్ణదేవుని గుర్తించేది.

''ఓప్రియ గోపికామణీ! అదిగో అటువైపు చూడు. ఆ మణిమంటపంలో ఆ ప్రక్క మయూరసింహాసనంపై కూర్చున్నాడు. ఆయనే కృష్ణుడు. ఆ స్వామి పాదపద్మాలను ఉద్ధవుడు ఒత్తుచున్నాడు చూడు. అక్రూరుడు మణిస్తంభం

దగ్గర కూర్చొని కురువంశవార్తలు వినిపిస్తున్నాడు ! ఆ మహానుభావుడే శ్రీకృష్ణమోహనుడు. అడుగో! ఆకాళ్ళు పట్టించుకొనే దేవుడే వసుదేవ కుమారుడు. గోపీమానస చోరుడు. రాధా మనోహరుడు''.

ఈ పరిచర్యలు చేయటం కృష్ణదాసుల నిత్యకృత్య సౌభాగ్యాలు. ఆ సేవాభాగ్యం ఎంతవారికో! దాసులయోగ్యతలను బట్టి స్వామి వారికి ఆ అవకాశం అనుగ్రహిస్తాడు.

శ్రీ కృష్ణ భక్తి రసాన్ని బహిర్ముఖంగా అనుభవించిన కొందరు పండితులు అలంకారికులు 'భావస్థితి' అని 'రసస్థితి కాదు' అని నిశ్చయించారు. కాని అది పొరపాటు. భాగవతాది గ్రంథాలలో ఈ సంభ్రమప్రీతి రసవర్ణన విస్తారంగా కనిపిస్తుంది. భాగవత ఏకాదశ స్కంధంలో ఇలా ఉంది.

అలౌకిక భక్తవర్యులు శ్రీ కృష్ణ తత్త్వం తెలుసుకొని స్వామిని తన ఆత్మస్వామిగా తలంచి, విలపించి, విలాసాలు చేసి, ఆక్రోశించి, ఆనందించి, భాషించి, సంతోషించి, నాట్యం చేసి గానం చేసి కృష్ణలీలలు అనుశీలించి, అనుభవించి చివరకు నిర్వాణసుఖం పొందారు. మౌనులుగా పరమపదం పొందారు.

కృష్ణలీలల్లో దధి దుగ్ధ నవనీతచోర ప్రవృత్తులూ,
గోవర్ధనోద్ధరణాది సాహస భగవత్కృత్యాలూ,
కంసవధాది పరాక్రమ విజృంభణాదులూ విని మౌనులు
సనకాదులు అధిక సంతోషంతో అశ్రువులు రాల్చారు.

ఈ భక్తుల తల్లీనత దేశకాలాది వైశిష్ట్యాదులను అనుసరించి అక్కడక్కడ మానవాతీతంగా భక్తి రసంలో ముంచెత్తినట్లు చెప్పబడినాయి. ఇవి రసపరిపాకాలేకానీ కేవలం భావమాత్రం కావు.

**గౌరవప్రీతి**

లాలనాభిమానులు అంటే కృష్ణదేవుని కృపకు మేము పాత్రులము అని తలంచువారు. వీరిలో కృష్ణప్రేమ అధికంగా కలుగుతుంది. ఈ ప్రీతియే విభావాదుల ద్వారా పరిపుష్టిచెంది గౌరవప్రీతి రసమై భాసిస్తుంది.

దీనినే 'గౌరవోత్తరం' అని కూడ అంటారు. ఇది కృష్ణరూపగురునిష్ఠ ఉత్తరోత్తరమైనది. ప్రౌఢత్వపర్యవసితం.

ఈ గౌరవప్రీతి రసానికి కృష్ణకృపాపాత్రులు ఆలంబనాలు. వృష్ణి వంశీయులైన మహాపురుషుల ఇతిహాసాలు వర్ణింపగా శ్రీకృష్ణుడు వికసిత వదనంతో ఉత్సుకతతో ఆలకిస్తుంటాడు. ఆ ఆసక్తిచే స్వామి ముఖకమలం ఉజ్జ్వలంగా ప్రకాశిస్తుంది. దేవసభలో కూర్చున్న పుత్ర సములైన వారలకు పూర్వవంశీయుల సుమార్గాలు అనుకరించవలసిందిగా కృష్ణదేవుడు హితోపదేశం గావిస్తుంటాడు. ఇలా మహాగురువుగా మహాకీర్తి, మహాబుద్ధి, మహాబలం, మహారక్షణలు గూర్చి లాలించు శ్రీకృష్ణుడు ఆలంబనం.

పసివారు అంటే కృష్ణకృపకు పాత్రులైన చిన్నవారు – పుత్రులు. చిన్నవారు సారణుడు, గదుడు, సుభద్ర మున్నగువారు. పుత్రులలో ప్రద్యుమ్నుడు చారుదేష్ణుడు సాంబుడు మొదలైనవారు.

వీరి అలంకారాలు వేషాలు గుణాలు పార్షదులకంటె ఉజ్వలంగా ఉంటాయి. వీరు కృష్ణం పీతం శ్వేతం రంగులు ఇష్టపడతారు. ఆ రకమైన వస్త్రాలు ఆభూషణాలు ధరిస్తారు. ఈయన కుమారులు యదుపురంలో ఆడుకొంటుంటారు.

ఈ కుమారవీరులు కృష్ణదేవుని దగ్గర కూర్చొని భోజనం చేస్తారు. కృష్ణభగవానుడు వారి నోటికి గోటిముద్దలు చేసి అందిస్తాడు. వారి ముఖాలు పైకెత్తి తినుబండారాలు, తాంబూలాదులు కృష్ణుడు తినిపిస్తాడు. వారు ముద్దు ముద్దుగా తింటుంటారు. వారు కృష్ణుని శిరస్సు పట్టుకొని మూర్కొంటుంటారు. కృష్ణదేవుని ఒడిలో ముద్దులాడుతుంటారు. తాతను 'తాతా ! తాతా !' అంటూ కౌగిలించుకొంటారు. కృష్ణుడు మనుమలను ముద్దాడి ఎత్తుకొంటాడు. తాతా మనుమలు ఆడి ఆడి ఆనందబాష్పాలు విడుస్తుంటారు. ఆహా ! సాంబాదులు పూర్వజన్మల్లో ఎంత మహత్తర తపస్సు చేసుకొన్నారో కదా! అనిపిస్తుంది.

నమస్కారం చేయుట, మౌనంగా ఉండుట, సంకోచించుట, వినయ బాహుళ్యం కలిగియుండుట, తన ప్రాణాలొడ్డి కృష్ణప్రభువు ఆజ్ఞను పాలించుట, పెద్దల యెదుట నతమస్తకుడై యుండుట, స్థిరత్వం, ధీరత్వం ప్రదర్శింపకుండుట, దగ్గకుండుట, నవ్వకుండుట, కృష్ణ సదృశ్యమైన పెద్దల రహస్యక్రీడలకు దూరంగా యుండుట ఈ మొదలైనవి దాసభావాలు. బాలురు భృత్యులు సేవకులు ఈ లక్షణాలు కలిగి ఉండాలి.

సాత్విక భావాలు ఈవిధంగా ముకుందుని దర్శించిన మన్మథునిలో పొటమరించాయి. మన్మథా! నీవు ముకుందుని చూచినంతనే నిశ్చలమై రోమాంచితమై స్వేద ఆర్ద్రదేహం కలిగి గగుర్పాటుతో నీ శరీరం పనసపండును అనుకరిస్తున్నది.

సంచారీ భావాలును సంచరిస్తున్నాయి.

దూరంలో ఆకాశాన పాంచజన్య శంఖధ్వని ప్రతిధ్వనించగా యాదవ రాజధానిలో కుమార వీరుల రోమరోమాలు ఆనంద సంభ్రమంతో నర్తించసాగాయి. వారిహర్షానికి అవధులులేవు.

ప్రద్యుమ్నుడు సాంబునితో ఇలా అన్నాడు - సాంబా! నీవు ధన్యాత్ముడవురా! నీ అదృష్టం అంతయింత కాదురా! నీవు ధూళిధూసరిత గాత్రుడవై నేలపై దోగాడుతూ దోగాడుతూ వచ్చి కృష్ణ తాత ఆసనం దగ్గరకు వెళ్ళావు. అలా వెళ్లగానే వాసుదేవుడు వాత్సల్యంతో నిన్ను అలాగే దగ్గరకు లాగుకొన్నాడు. ఆ మురికి దేహంతోడి నిన్ను ఒడిలో కూర్చోపెట్టుకొన్నాడు. ముద్దుపెట్టుకొన్నాడు. ఎంత అదృష్టం నీది. నాకు ఆ భాగ్యం దక్కలేదురా! నేను శంబరాసుర మాయాజాలంలో చిక్కుకొని తండ్రి వాత్సల్యానికి దూరమై పోయాను. అది ఇప్పటికీ నిర్వేదం కల్గిస్తూనే ఉంది.

**స్థాయీభావం -**

దేహసంబంధాభిమాన గురుబుద్ధి గౌరవం. లాలన చేయువానియెడల కలుగుప్రీతి గౌరవప్రీతి. భక్తుని హృదయంలో వ్యాపించు గౌరవప్రీతియే ఈరసమున స్థాయీబావం. ఆ గౌరవప్రీతి వైశిష్ట్య సంపన్నమైనపుడు ప్రేమ యౌను. ప్రేమలో వైశిష్ట్యం కలిగిన స్నేహమౌను. స్నేహంలో వైశిష్ట్యమైన రాగం అవును. ఇదియే గౌరవప్రీతిపరిణామం. గౌరవప్రీతికి ప్రద్యుమ్నుడు ప్రమాణం -

పెద్దలముందు ప్రద్యుమ్నుడు పెదవి విప్పి మాట్లాడడు. ప్రేమార్ద్ర అశ్రువులతోడి ముఖబింబం పైకి ఎత్తడు. ధీరుడై కృష్ణుని శ్రీచరణాలపై సదాదృష్టిని లగ్నంచేయు స్వభావం కలిగియుంటాడు. ప్రేమకు ప్రమాణం సుభద్ర - సుభద్రప్రేమ నిశ్చలమైనది. పవిత్రమైనది. అర్జునుడు దైత్యసమూహాన్ని సంహరించిన మహాపరాక్రమశాలి. అతని పుత్రుడైన అభిమన్యుని అతిక్రూరాత్ములైన

శత్రువులు మాయతో అన్యాయ పద్ధతిలో హతం చేశారు. కృష్ణా! నా చేతులనుండి పుత్రుడు లాగి వేయబడ్డాడు. అయినా సుభద్రకు నీపైగల ప్రేమ అణువంతకూడ తగ్గలేదు. ప్రేమఅట్టిది.

స్నేహానికి ప్రమాణం ప్రద్యుమ్నుడు -

''ప్రద్యుమ్నా! వత్సా! వణకబోకుము. గద్గద భావం విడిచిపెట్టు. కన్నీరు తుడుచుకో! నా వైపు దృష్టిసారించుము. గగుర్పొడిచిన నీచేయి ఏదీ! ఇటుచూపు! తండ్రి వద్ద పుత్రునకు తొట్రుపాటు ఏల! ఇటువచ్చికూర్చో, కృష్ణునిలోని ఇది స్నేహభావం

రాగానికి ప్రమాణం ప్రద్యుమ్నుడే -

ప్రద్యుమ్నుడు తండ్రి అజ్ఞయైన విషాన్నైనా అమృతం వలె త్రాగుతాడు. తండ్రికి ఇష్టం లేకున్న అమృతాన్నైనా విషంవలె విడిచివేస్తాడు.

ఇది రాగ హృదయానికి లక్షణం. వత్సలతలో - సంభ్రమప్రీతం ప్రేయఃప్రీతం గౌరవప్రీతిలో - వియోగం - యోగం శాంతరసంలో - సారోక్ష్యం సాక్షాత్కారం మధుర రసంలో - సంభోగం విప్రలంభం. అనుభేదాలున్నాయి.

''సుముఖీ! శత్రువైన శంబరుడు ఆపద పొంది అదృశ్యుడైనాడు. ఇపుడు నీలమేఘశ్యాముడు పాంచజన్యహస్తుడు కృష్ణ గురుదేవుడి దర్శనం నాకెప్పుడు కలుగుతుందో కదా ! అని ఉత్కంఠత చెందుతున్నాను.

కృష్ణుడు హస్తినాపురం వెళ్ళిరాలేదు. ఇక నామనస్సు క్రీడలకు ఇష్టపడటంలేదు. అస్త్రాభ్యాసానికి మనస్సు ఒగ్గుటలేదు. కృష్ణుడు లేని ద్వారకే నాకు కారాగారమైనది'' అంటాడు కృష్ణమిత్రుడు. ఇది కృష్ణవియోగబాధ.

ప్రద్యుమ్నుడు శంబరపురం నుండి వచ్చి ఎదుట తండ్రియైన కృష్ణునిచూచి ఆనందాతిరేకం చేత ధైర్య విహీనుడై తన్ను దాను మరచిపోయినాడు. ఇది సిద్ధిస్థితి.

హస్తినాపురం నుండి బహుకాలానికి వచ్చిన శ్రీకృష్ణ మహామహుని తిలకించి పులకితగాత్రులై పుత్రపౌత్రాదులు ద్వారకాపుర వాసులు అపరిమిత ఆనందాతిరేకంచేత సంభ్రమంజెంద సాగారు. ఇది వారి సంతుష్టికి నిదర్శనం.

ప్రద్యుమ్నుడు ప్రతిదినం ఆనందాశ్రువులచే ఆర్ద్రములైన నేత్ర పద్మదళాలు సంకుచితాలు కాగా కృష్ణజనకుని పాదారవిందాలకు వంగి నమస్కరిస్తుంటాడు. ఇది సుస్థితికి మూలం.

ఉత్కంఠితం వియోగం ఆదివిషయాలు విస్తారంగా చెప్పబడనివి సంభ్రమప్రీతి వంటివని పండితులు గుర్తింతురుగాక!

విభావాదులద్వారా సఖ్యరతి స్థాయిభావం పొంది సహృదయ ఆస్వాద మైనపుడు అది 'ప్రేయోభక్తిరసం' గా వాసికెక్కుతుంది. శ్రీకృష్ణుడు - ఆయన మిత్రులు ఈప్రేయోరసానికి ఆలంబనాలు. ద్విభుజుడై కృష్ణమూర్తియే ఇందు ఆలంబనం. శ్రీ కృష్ణమోహనుడు ఇంద్రనీలమణికాంతి సంకాశ శరీరుడు. వికసిత అరవిందనేత్రుడు. సుస్మిత వదనారవిందుడు. సువర్ణకేతకీకుసుమ సదృశ పీతాంబరుడు. వనమాలావిభూషణాలంకార శోభితుడు. లక్ష్మీనివాస వక్షోవిరాజితుడు. మురళి మ్రోగిస్తూ వస్తున్నాడు. ఆ ధ్వని విన్నవ్రజవాసులకు మనస్సులో పరవశం అవుతుంటాయి. మౌనులు ఆత్మవిస్మృతిని పొందుతుంటారు.

ఆ స్వామి కౌస్తుభ మణి మాలలతో ప్రకాశిస్తుంటాడు. శంకచక్ర పద్మగదలతో చతుర్భుజుడైన శ్రీకృష్ణస్వామి పీతవస్త్రం ధరించి దయచేయుచుండగా పాండవులు ఎదురేగి అర్ఘ్యపాద్యాదులిచ్చి ఆనందబాష్పాదులతో మందిరంలోనికి కొనివచ్చారు.

శ్రీహరి సువేషుడు. సరసభాషుడు. సర్వలక్షణ లక్షితుడు సర్వశ్రేష్ఠుడు, సర్వగుణవిశిష్టుడు. విదగ్ధుడు, దక్షుడు దయామయుడు సర్వరాజేంద్రవిజయుడు, క్షమాశీలుడు శాంతికాముకుడు ఈ సుగుణాలతో శ్రీహరి ప్రేయోరసానికి ఆలంబనం. శ్రీ కృష్ణుని మహాసుందరతరరూపాన్ని ధ్రువాదులు ఈవిధంగా వర్ణించారు -

హారకిరీటకేయూర కంకణ ఘన
భూషణుం - డాశ్రిత పోషణుండు -
లాలిత కాంచీకలాపశోభిత కటి
మండలుం డంచిత కుండలుండు -

మహనీయ కౌస్తుభమణిఘృణి హారగ్రై
వేయకుం - డానందదాయకుండు
సలలిత ఘన శంఖ చక్ర గదా పద్మ
హస్తుండు - భువన ప్రశస్తు-డజుడు -

క్రమసౌరభ వనమాలికాధరుండు -
హతవిమోహుండు - నవ్యపీతాంబరుండు -
లలితకాంచన నూపురాలంకృతుండు -
నిరతిశయసద్గుణుడు - దర్శనీయతముడు

ఆశ్రిత సత్ప్రసాదాభిముఖుండును - స్నిగ్ధప్రసన్నాననేక్షణుండు - సురుచిర నాసుండు - సుభ్రూయుగుండును - సుకపోలతలుడును - సుందరుండు - హరి నీల సంశోభితాంగుండు - తరుణుండు - అరుణావలోకనోష్ఠాధరుండు - కరుణా సముద్రుండు - పురుషార్థ నిధియును - ప్రణతాశ్రయుండు - శోభనకరుండు.

లలిత శ్రీవత్స లక్షణలక్షితుండు.
సర్వలోక శరణ్యుండు, సర్వసాక్షి,
పురుష లక్షణ యుక్తుండు, పుణ్యశాలి
అసిత మేఘ నిభశ్యాముడవ్యయుండు.

- పోతన

కృష్ణుని మిత్ర సత్తములలో వ్రజవాసులు అత్యంత సన్నిహితులు. నిత్యసహచరులు. క్షణం కృష్ణుడు కనిపించకుంటే సహించలేరు. కళవళపడతారు. కృష్ణుడే వారి జీవితంగా భావిస్తారు.

వారు వేషభాషలలో కృష్ణుని అనుకరిస్తారు. వారు వంశినీ, వేణువును, కొమ్ములను శ్రావ్యంగా మనోహరంగా సంగీత శాస్త్రానుసారంగా ప్రయోగించి ఆనందించి, కృష్ణుని ఆనందింప చేయగల సమర్థులు. రూపం కూడా కృష్ణ రూపంగ సుందర శరీరం గలవారు. ప్రేమ పూరిత హృదయాలు. ఎప్పుడూ మిత్రునితో ఉండటం వీరికిష్టం. కృష్ణునిపై ఈగ వాలితే సహించలేరు.

కృష్ణుడు గోవర్ధనగిరి యెత్తి పట్టినప్పుడు వీరు అంటారు ''కృష్ణా! నీవు నిద్ర లేకుండా యిన్ని రాత్రులు నిలబడి ఉంటావు. అలసి పోతున్నావు. కాసేపు మేము పట్టుకుంటాము. నీవు విశ్రాంతి తీసుకో. నీ కష్టం చూచి మా మనస్సులు విలవిలలాడిపోతున్నాయి. పర్వతం రెండో చేతిలో కన్నా మార్చుకో. చేతులు కాళ్ళు పిసుకుతాము. అలా కూర్చో! మా కోసం ఎంత శ్రమ సహిస్తున్నావు. ఇంత కష్టం! ఎలా భరిస్తావు! స్వామీ!

నీవు జ్ఞానులకు స్వప్రకాశ సుఖానుభూతి స్వరూపుడవు. హాస్య రసికులకు ఇష్టదేవతా స్వరూపుడవు. కర్మిష్ఠులకు ప్రాకృత బాలకుడవు. నీతో నీ సహచరులుగా ఎంతో పుణ్యాత్ములం అంటారు అదృష్టవంతులు గోపబాలురుగా సంచరించారు.

మహాత్ములైన శ్రీబలరామ కృష్ణులు వారితోడి నెరపిన సఖ్యం వర్ణనాతీతం.

బలరాముడు కృష్ణునితో - కృష్ణా! గోపబాలురు అమాయకులు. అయ్యో! వారు అఘాసురుని కడుపులోకి పోతున్నారు. రక్షించు, రక్షించు, నాకు వారేమవుతారో అనిపిస్తోంది. కన్నీరు ఆగటంలేదు. ఆ దారుణ దృశ్యం నేను చూడలేకున్నాను. నా హృదయం స్తంభించింది. నా చిత్తం మొద్దుబారింది! కృష్ణా! చూడు! చూడు! అది బలరాముని హృదయం.

కృష్ణుని మిత్రులు నాలుగు రకాలు:

1. సుహృదులు, 2. సఖులు, 3. ప్రియసఖులు, 4. ప్రియనర్మసఖులు.

## సుహృదులు

వీరిలో సుభద్రుడు మండలీభద్రుడు గోభటుడు యక్షుడు వీరభద్రుడు మహాగుణుడు విజయుడు భలభద్రుడు మొదలైన వారు ముఖ్యులు. వీరిలో మండలీభద్రుడు బలభద్రులు ప్రధానులు.

వీరు సఖ్యగంధంతో వాత్సల్య హృదయంతో కృష్ణుని మిక్కిలి ప్రేమిస్తుంటారు. వీరు వయస్సులో కృష్ణుని కంటె కొంచం పెద్దవారు. వీరు అస్త్రశస్త్ర ధనుర్విద్యాప్రవీణులు. కృష్ణరక్షణభారం వీరు వహిస్తుంటారు. వీరు కృష్ణుని ప్రియంగా సేవిస్తుంటారు.

వారిలో వారు కృష్ణసేవను గురించి ఇలా మాట్లాడుకోసాగారు. ''మండలీ భద్రా! నీవు ఖడ్గాన్ని తీసుకొని పరువెత్తుతున్నావేమిటి? బలదేవా! గదబూనావు

ఎందుకు? విజయా! ఆవేశపడతావేమిటి? భద్రవర్ధనా! నీవు శక్తిని విడుస్తున్నావేమిటి?

అదా! గోవర్ధన పర్వతంపై వృషభాకారంలో మేఘమై వచ్చాడా అరిష్టాసురుడు. ఓహో ! నడు! నడు ! జాగ్రత్త!'' కృష్ణుడు ఎక్కడున్నాడో ! జాగ్రత్తగా చూడండి !'' అని జాగ్రత్తలో ఉంటారు.

ప్రధానుడైన మండవీభద్రుడు గొప్ప తేజస్సుగా ఉంటాడు. పాటల వస్త్రాలు ధరిస్తాడు. దండం పట్టియుంటాడు. శిరస్సుపై నెమలి పింఛం పెట్టుకొని అందంగా ప్రకాశిస్తుంటాడు. మంచి స్ఫురద్రూపి. అతడు కృష్ణునితో మిక్కిలి స్నేహంగా ఉంటాడు.

''శ్రీకృష్ణదేవుడు పగలల్లా వనాలలో తిరిగి తిరిగి అలసిపోయినాడు. ఇప్పుడు రాత్రివేళనైనా వ్రజగృహంలో స్వామిని సుఖంగా నిద్రపోనీ! స్వామి తొడలు పట్టి సుఖం చేకూరుస్తాను'' అంటాడు మండవీభద్రుడు.

బలదేవుడు కృష్ణుని అగ్రజుడు. బలరాముడు ఎప్పుడూ కృష్ణుని విడచిపెట్టడు. అతని రూపం కూడా మనోహరంగా ఉంటుంది. చెవులకు రత్న కుండలాలు పెట్టుకొని మరీ మెరిసి పోయేవాడు. ముఖంపై కస్తూరి తిలకం ముద్దుగా దిద్దుకొనేవాడు. సంజామాల మెడలో వ్రేలాడుతుండేది. తెల్లని శరత్కాల మేఘం వంటి శరీరంపై నీలాంబరం కట్టుకొని కమనీయంగా కనిపిస్తాడు. సుశ్రావ్యమైన కంఠధ్వనితో ఆజానుబాహువులతో ప్రలంబాసుర విజయుడైన బలరాముడు వీరులలో మహావీరుడు.

సుబలా! నేడు నా పుట్టినరోజు. అమ్మ తలంటిపోసి ఇలవేల్పులకు నైవేద్యాలు పెట్టిస్తుందిట. నన్ను ఇంట్లో నిల్పి వేసింది. నే వచ్చేవరకు కృష్ణుణ్ణి కాళిందీ నది వైపుగానీ మరెటూ వెళ్ళవద్దని చెప్పు. ఇదే క్షణంలో వస్తున్నాను. నే లేకుండా తమ్ముణ్ణి ఎటూ తీసుకొని వెళ్ళకండి. వస్తున్నాను. అని చెప్పండి.

**సఖులు**

ఈ సఖ్యం చేసేవారు కృష్ణుని కంటే వయస్సులో చిన్నవారు. వీరు రసికులు విశాలుడు, వృషభుడు, ఓజస్వి, దేవప్రస్థుడు వరూథపుడు, మరందుడు, కుసుమాపీడుడు, మణిబంధుడు, కరంధముడు మొదలగువారు. వీరు గాఢ

స్నేహితులు. దేవప్రస్థుడు తోడివారితో అంటాడు - రే! విశాలుడా! కృష్ణదేవుని పద్మదళాలు తీసుకొని వీస్తూండు. కృష్ణుడు అలసిపోయాడు. వరూధవా! నీవు స్వామి ముంగురులు సరిచేయిరా! రే వృషభ! నీవు మాటలు కట్టిపెట్టి కాళ్ళుపట్టు. శరీరంపట్టు. బాహుయుద్ధంలో కృష్ణయ్య చాలా శ్రమ పడ్డాడురా! బాగా పరిచర్యలు చేయండి. కాసేపు విశ్రాంతి తీసుకొంటే అందరినీ ఆనందపెడతాడు కృష్ణయ్య.

## ప్రియసఖులు

వీరు సమాన వయస్కులు. వీరిలో శ్రీదాముడు, సుదాముడు, దాముడు, వసుదాముడు, కింకిణి, స్తోకకర్ణుడు, అంశుడు, భద్రసేనుడు, విలాసి, పుండరీకుడు, విటంకాక్షుడు, కళావంతుడు మొదలగువారు ముఖ్యులు. ప్రియసఖులు కృష్ణునితో ఆటపాటలలో పాల్గొంటుంటారు. కృష్ణునితో మల్లయుద్ధం, దండయుద్ధం చేస్తూ ఆనందపరుస్తూ, ఆనందిస్తూంటారు.

ఒకడు కృష్ణుని పరిహాసం చేస్తుంటాడు. ఒకడు వ్యంగ్యంగా మాట్లాడుతాడు. ఒకడు పులకించి గట్టిగా కౌగలించుకొంటాడు. ఒకడు ఎక్కడనుంచో వెనుకగా వచ్చి కళ్ళు మూస్తాడు. ఇలా అనేక క్రీడలు కృష్ణునితో ఆడుతుంటారు. వారి వేషభాషలు ఆకర్షనీయంగా ఉంటాయి.

## ప్రియ నర్మసఖులు

సుహృదుల కంటె సఖులు శ్రేష్ఠులు. సఖుల కంటె ప్రియ సఖులు ఆత్మీయులు. ప్రియ సఖుల కంటె అత్యంత ఆంతరంగికులు ప్రియనర్మసఖులు.

వీరు భావ విశేషయుక్తులు. సఖీభావ విశిష్టులు. ప్రేయసీ సాహాయ్యాలైన గుప్తచరకార్యవిశేషాలు వీరు సాధిస్తారు. వీరిలో సుబలుడు, అర్జునుడు, గంధర్వుడు, వసంతుడు, ఉజ్జ్వలుడు, మధుమంగళుడు, పుష్పాంకుడు, హాసాంకుడు మొదలైనవారు ముఖ్యులు. వీరిలో కొందరు విదూషక పాత్ర పోషిస్తుంటారు.

ప్రియసఖీ! కృష్ణ మోహనాంగుని జేరి ప్రియురాంద్ర వార్తలను ప్రియనర్మ వయస్యులు గోప్యంగా అందిస్తున్నారు. కొందరు నర్మసఖులు కృష్ణదేవుని అలంకరిస్తున్నారు. చూడు! చూడు! సుబలుడు రాధ వార్తలను కృష్ణనాథుని చెవిలో చెప్పుతున్నాడు. ఉజ్జ్వలుడు శ్యామ సుందరి ప్రేమలేఖను రహస్యంగా

స్వామి చేతికి పూలమాల అందించినట్లు అందిస్తున్నాడు. చతురుడు ప్రియకోమలి యిచ్చిన కర్పూర తాంబూల విడెం కృష్ణుని నోటికందిస్తున్నాడు. కోకిలుడు తారామణి కట్టిన పూలమాల తెచ్చి కృష్ణస్వామి మౌళిపై అలంకరిస్తున్నాడు.

ఈ ప్రియనర్మ సఖులు శ్రీకృష్ణుని బహువిధాల నర్మగర్భంగా సేవిస్తున్నారు. కదా! ఎంత అదృష్టవంతులో కదా!

కృష్ణ మిత్రులలో కొందరు శాస్త్ర విద్యాధురంధరులు. మరికొందరు లోకవ్యవహార దక్షులు. కుశాగ్రబుద్ధులు. వీరిలో నిత్యప్రియులు, సురచరులు, సాధన సిద్ధులు అని మూడు రకాలు. ఇంకా కొందరు సహజంగా సుస్థిరులు. మంత్రాలోచనంలో కృష్ణునికి సైదోడులు. కొందరు విదూషకులై స్వామిని నవ్విస్తుంటారు. వీరు చంచల స్వభావులు. కొందరు సరళస్వభావులు. సరళ వ్యవహారాలలో కృష్ణునికి సలహాలిస్తూ కృష్ణుని సేవిస్తూ ఆయనకు సుఖానుభూతి కలిగిస్తారు. కొందరు ప్రగల్భ స్వభావంతో వితండ వాదానికి దిగుతారు. కొందరు సౌమ్య స్వభావంతో మధురంగా మాట్లాడి స్వామికి సంతోషం కలిగిస్తారు.

ఇలా వివిధ స్వభావులు పవిత్ర మైత్రీ వైచిత్రిని వెలయిస్తుంటారు.

"జలజాంతస్థిత కర్ణికం దిరిగిరా సంఘంబులైయున్నరే
కుల చందంబున కృష్ణునిన్ దిరిగిరా కూర్చుండి వీక్షింపుచున్
శిలలున్-పల్లవముల్-తృణంబులు-లతల్-చిక్కంబులున్-పువ్వులా
కులు- కంచంబులుగా భుజించిరచటన్గోపార్భకుల్ భూవరా!

కడుపున దిండుగా కట్టిన వలువలో
లాలిత వంశనాళంబు జొనిపి
విమల శృంగంబును వేత్ర దండంబును
జారి రానీక డాచంక నిరికి
మీగడ పెరుగుతో మేళవించిన చల్ది
ముద్ద డా పలి చేత మొనయనునిచి
చెలరేగి కొసరి తెచ్చిన ఊరగాయలు
వ్రేళ్ళసందుల దావెలయనిరికి

సంగడీల నడుమ చక్కగ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెరపి
యాగభోక్త కృష్ణుడమరులు వెరగంద
శైశవంబు మెరసి చల్ది గుడిచె''

–పోతన

శ్రీకృష్ణబాలుడు కాళీయుని మహాహ్రదంలో దూకి కొంతసేపు కాళియుని మర్దించి మదం అణచి ఈహ్రదం విడిచి, వేరొక చోటికి వెళ్ళుమని పంపాడు. అపుడు కొందరు అత్యుత్సాహంతో పులకిత గాత్రులైనారు. కొందరు వ్యాకుల చిత్తులు అయినారు. ఎంత గండం గడిచింది అని కొందరు వివర్ణ దేహులైనారు. కొందరు ఆనందాతిశయంతో మాటలు పెగలక ఘుర్ఘర ధ్వనులు చేశారు. కొందరు నేలపై నుంచి లేవ లేకనేపోయారు. అది కృష్ణుని పైగల ప్రేమ విహ్వాలతకు పారవశ్యస్థితి. సాత్త్విక భావాలు నాలుగూ వారిలో ద్యోతమానమైనాయి.

ఒకసారి అడవిలో దావానలం వ్యాపించింది. దావానలం నుండి గోవులను గోప బాలురను రక్షించుటం కోసం కృష్ణుడు ఆ మంటల్లో దూకి ఆర్పుతున్నాడు. ఇంత పెనుమంటలలోకి కృష్ణుడు దూకాడే అని మిత్రులెల్లా కన్నీళ్ళు కారుస్తూ కృష్ణుని చుట్టుముట్టారు. ఆ మంటలు ఈ మిత్రుల అశ్రుప్రవాహాలలో తడిసి పోయాయా! అన్నట్లు తడిసిపోయాయి. అశ్రుధారులు వర్షిస్తూ గోపబాలురు తమ శరీరాలను కూడా లెక్క చేయలేదు. వారి అభిమానం అట్టిది.

గోపాలదేవుడు కాళీయ సర్పాన్ని మహాహ్రదం నుండి వెడలగొట్టి రాగానే మిత్రాదులు ఆప్తమిత్రుని ప్రాణసఖుని ఆలింగనం చేసుకొని అతిశయ ఆనందం పొందారు. అపుడు వారి పాదాలు తొట్రుపడ్డాయి. మాటలు పెగలలేదు.

సమాన వయస్కులైన మిత్రుల భయరహిత విశ్వాసరతిని సఖ్యం అంటారు. ఈ ప్రేమరసంలో సఖ్యమే స్థాయీ భావం. ఇది సర్వ సంకోచరహితమై గాఢ విశ్వాస సహితమై విశ్రంభం అనే నామంతో ప్రకాశిస్తుంటుంది.

ఇది సఖ్యరతి, ఇది ప్రణయం, ప్రేమ, స్నేహం, రాగం, అని ఐదు విధాలు.

అర్జునుడు అక్రూరునితో ఇలా కబురు పంపాడు. కృష్ణునికి, ఓ అక్రూరా! శ్రీకృష్ణదేవుని ఒకసారి ఈ విధంగా అడిగి చెప్పు – ''కృష్ణా! గరుడధ్వజా! నిన్ను నీ అనుంగు బావమరది పార్థుడు యెప్పుడు గాఢంగా ఆలింగనం చేసుకోగలడు! ఈ మహాభాగ్యం అతనికి ఏనాడు ప్రాప్తిస్తుంది''.

శ్రీకృష్ణభగవానుడు పరంధాముడు, పరమాత్ముడు. ఆ విష్ణుదేవుని ఆదినారాయణుని శంకరాదులు దేవతలందరు స్తుతి చేస్తుంటారు. బ్రహ్మసంపత్తి కంటె ఈశ్వరుని ఐశ్వర్యం కంటె కృష్ణవిభూతి మిక్కిలి విలువైనది.

అట్టి కృష్ణదేవుని దగ్గరగా జేరి ఆయన ఒడిలో తలపెట్టి మాటలు చెప్పాడు అర్జునుడు. కృష్ణుని భుజంపై తన చేయి వైచి నడుస్తుంటాడు. కృష్ణుని తలపైని మయూర పింఛంలోని నలకలు ఏరి అవతలు వేసి పింఛాన్ని సరిచేస్తుంటాడు. అది ప్రణయ రతి. అది కృష్ణార్జునులకే తగింది.

పాండవులు అజ్ఞాతవాసం చేస్తున్నపుడు నారదమహర్షి ఈ విధంగా వారి భాగ్యాన్ని ప్రశంసించాడు.

ముకుందా! గోవిందా! పరమానందమూర్తీ! నీవు పాండవుల ఆప్తమిత్రుడవు, నీవు ఈశ్వరుడవు, నీవు వారికి లభించుట వల్ల రాజ్యనాశనం, వనవాసం, పర గృహదాస్యం ఆది అమంగళాలు కలిగినా అవి వారిని ఏమీ చేయలేకపోయాయి. ఈ కష్టాలు వారికి నీ యెడల గల ప్రేమామృతాన్ని రెట్టింపు చేశాయి. అవి వారికి మేలే చేశాయి. ప్రేమను ప్రవృద్ధం చేశాయి.

## తాపదశలు దశవిధాలు

కృష్ణా! కంసారీ! మురారీ! నీ విరహతాపం మాపై భీషణ ప్రతాపం చూపిస్తోంది. నీ అనుంగు చెలికాండ్రైన సుబలాదులను వాడి వత్తులయ్యేలా దగ్ధం చేస్తోంది. భాండీర వనంపై అధిక ప్రచండతను చూపిస్తోంది. చల్లని యమునా నదిని ఉడికిస్తోంది. ఎంత హిమపాతం వంటి వస్తువును సైతం ఉష్ణతరం గావిస్తోంది.

స్వామీ! గోపాల చక్రవర్తీ! కృష్ణమూర్తీ! నీవు కంస సంహారం చేయటానికి వెళ్ళి ఏండ్లు, పూండ్లు గడిచి పోయాయి. దారుణమైన ఆ యెడబాటు సహించలేక గోపాల బాలుర దేహాలలో పంచభూతాలలో నేలనింగి నిప్పునీరు కృశించి కృశించి పోయాయి. అవశేషంగా ఎక్కడో ఏ రూపంలోనో ఎండి పోయి యున్నాయి. గాలి మాత్రం నాసారంధ్రాలలో విజృంభించి వీస్తోంది.

యదునాథా! నీ ప్రాణ మిత్రుడు వరూధపుని స్థితి మరీ దుర్భరంగా ఉంది. అతని నేత్రాంబుజాలు బాష్ప పూరితాలైనాయి. నిద్ర అనే భృంగ కుమారి నిర్వేదం చేత ఆ నేత్ర పద్మాలను అనుసరించుటకు అంగీకృతి చూపటం లేదు.

నందనందనా! నీవు బృందావనం విడిచి వెళ్ళగనే నా మనస్సు నిరాలంబమై పోయింది. దూది పింజవలె కడుతేలిక అయిపోయింది. స్థిరత్వం కోలుపోయింది. ఇటూ అటూ గాలికి కొట్టుకు పోయే పుష్పపరాగం వలె ఎగిరి పోసాగింది. ఆలంబనం శూన్యమైనపుడు మనస్సు ఏమి చేస్తుంది!

యదుపతీ! జగత్పతీ! నీ యెడబాటు చేత మిత్రులు గోచారణ కార్యక్రమాలు మరచి పోయారు. నృత్యం, గానం మొదలైన లలిత కళలను అభ్యసించటం మానివేశారు. వనంమీద, జీవనం మీద విరక్తి పొంది బ్రతుకుతున్నారు. బ్రతుకు భారంగా తలుస్తున్నారు. వారిలో ఏ పని మీదనూరక్తిలేదు. యాంత్రికంగా ధైర్యం లేక ఎట్లో జీవిస్తున్నారు.

కృష్ణా! నీ విరహ తాపం వలన నీ మిత్రసత్తములు పర్వతాగ్రముల మొలిచిన, చెట్ల వలె ఎండిపోతున్నారు. ఆ చెట్లు తాటలు ఊడిపోయినట్లు నీ మిత్రబలగాలు వేషభాషలు విసర్జించి యున్నారు. ఆ చెట్ల వలెనే రూక్షాలైన శాఖలతో విఫల వృత్తిగలవారై, జీవన శూన్యులై ఎలానో బ్రతుకు లీడుస్తున్నారు.

గోపాల నాథా! కొందరు మిత్రులు నీ యెడబాటు వలన వస్త్రహీనులై విరక్త మనస్కులై యమునా నదీ పులిన ప్రదేశాలలో జీవచ్ఛవాల వలె పడియున్నారు. ఏమైనా వ్యాధి సోకిందా అన్నట్లున్నారు.

ఓ మధురావాసా! నీవు మమ్ము స్మరించకపోవుటచే మా బ్రతుకులు ఉన్మాదంలో మునిగి పోయాయి. విరహ విభ్రమం వలన లోక వ్యవహారాలు అన్నీ మరచిపోయాము. ఒకసారి కటిక నేలపై పొరలాడుతాము. ఒకప్పుడు ఏ కొండ కోనల్లోనో నిద్రిస్తుంటాము. మరొకపుడు నవ్వుతాము. మరొకపుడు పరుగిడుతుంటాము. వేరొకపుడు విలపిస్తున్నాము. ఇది విరహం వలన కలిగిన ఉన్మాద స్థితి.

శ్రీకృష్ణ పరమాత్మయందు కృష్ణ మిత్రులయందు సజాతీయ భావ మాధుర్యం కలుగ జేయు ఈ ప్రేయోరసం అందరికి అనిర్వచనీయ ఆనందం అవిర్భవింపజేస్తుంది.

దాస్యరసంలో వాత్సల్యరసంలో కృష్ణుడు కృష్ణభక్తులు భిన్నజాతీయత కలిగి ఉంటారు. కనుక ఈ ప్రేయో భక్తి రసం సర్వ రసాలలో ప్రియతరం మహత్తరం అయినది. సఖ్యభావరసం గల సహృదయులే ఈ ప్రేయో భక్తి రస మాధుర్యం అనుభవించగలరు.

పశ్చిమసముద్రంలో

# వాత్సల్యభక్తి లహరి

ఆత్మోచిత విభావాదుల చేత వాత్సల్యం స్థాయీ భావంగా పుష్టి చెందుతుంది. అపుడు దానిని 'వత్సలభక్తిరసం' అని పండితులు ప్రవచిస్తారు.

ఈ వత్సల రసానికి శ్రీకృష్ణుని మరియు ఆయన గురు జనులను ఆలంబనం అని పేర్కొంటారు.

**బాలకృష్ణుడు**

బాలకృష్ణుడు శ్యామలాంగుడు, సుందరాంగుడు, కోమలాంగుడు, నీలోత్పల శ్యాముడు, నీలనీరద మేఘశ్యాముడు, అందాల అభిరాముడు, ఆబాల కృష్ణకు చారడేసి కండ్లు, బారడేసి కురులు, పెద్ద పద్మాలంత, ఆ నేత్రాబ్జాలపై ముచ్చటైన ముంగురులు తుమ్మెద దండులాగ మూగుతుంటాయి. ఆ సుందరాంగుని మందహాసాలు వెన్నెలలీను తుంటాయి. గోపికలు అనే కలువలను వికసింపచేస్తుంటాయి. ఆ బాలుడు ఇంట్లో తిరుగుతుంటే కన్నతల్లి యశోదమ్మకు చన్నులు చేపుకువస్తాయి. చనుబాలు కారుతుంటాయి. పరవశించి పోతుంటుందా తల్లి.

బాల కృష్ణుడు నల్లనేరేడు పండు వంటి సుందర దేహుడు. కోమలుడు మంచి లక్షణాలు గలవాడు. తీయ తీయగా తొక్కుపల్కులు పల్కుతుంటే, ఆనందం చిల్కుతుంటుంది. అంతలోనే సిగ్గు పడతాడు. చేతులు మొగానికి అడ్డంపెట్టుకొని వ్రేళ్ళ సందులలో నుంచి, నవ్వులు రువ్వుతూ చూస్తుంటాడు.

నాన్నగారికి నమస్కరిస్తాడు. జేజేలకు జేజేలు కొడతాడు. చేతిలో తాను తినే తాయిలమైనా నెచ్చెలులకు ప్రియమార పెడతాడు. తారంగం పాడతాడు.

ఈ వాత్సల్య రసంలో బాలకృష్ణుడే ఆలంబనం. విభావరూప ప్రకటనలో కూడా ఈ ముద్దు కృష్ణుడే కేంద్రం.

పుత్ర రూపంలో అభివ్యక్త్వం అనభివ్యక్తం అయిన ప్రభావం గల శ్రీకృష్ణ విషయమందు వీడు నావాడు అనే అనుగ్రహ భావం ఉన్నచో వాత్సల్యరతిలోని ఆస్వాదం సిద్ధిస్తుంది. వాత్సల్యం అనుగ్రహ కారణత్వకార్యత్వాలను అనుసరించి భిన్నంగా ఉంటుంది.

'నా పుత్రుడు' అనేది వాత్సల్యం. పుత్రులపై గల హితేచ్ఛ అనుగ్రహం.

మూడు వేదాలు దశ ఉపనిషత్తులు సాంఖ్యయోగం సాత్వతం కృష్ణ మహాత్మ్యాన్ని కీర్తిస్తున్నాయి. అట్టి కృష్ణదేవుని యశోద నా పుత్రుడు అనే వాత్సల్య బుద్ధితో గారవిస్తుంది –

జో అచ్యుతానంద! జోజో! ముకుంద!
రార! పరమానంద! రామగోవింద!
తొలుత బ్రహ్మాండంబు తొట్టె గావించి
నాలుగూ వేదాలు గొలుసులమరించి
బలుపైన ఫణిరాజు పాను పమరించి
చెలులు డోలికలూప చేరి లాలించె – అని

జోలపాట పాడి నిద్రపుచ్చేది.

**తల్లిప్రేమ**

''సఖీ! మా బాలకృష్ణ పసివాడు. ఉత్త అమాయకుడు. మావారు నిత్యం శ్రీమహా విష్ణుదేవుని పూజిస్తుంటారు. ఆ ఆదినారాయణ స్వామి కరుణాకటాక్షాల వల్ల ఏవో పనులు జరుగుతుంటాయి. స్వామి చేయిస్తున్నాడు. బాలుడు చేస్తున్నాడా! ఇతరులు ఈ ఘన కార్యాలన్నీ మా బాబే చేస్తున్నాడని అనుకొంటారు. అది వారి భ్రమ.

విష్ణుదేవుని అనుగ్రహంచేత పూతనాదులు నశించారు. యమళార్జున వృక్షాలూ పెనుగాలికి పడిపోయాయి. గోవర్ధన గిరిరాజమే విష్ణు అనుగ్రహంతో పైకి

లేచి గొడుగువలె ఉండి పోయింది. అద్భుతమైన ఈ కార్యాలతో మా కృష్ణకు సంబంధమేలేదు. అట్టి సంబంధమే నా పుత్రుడు కలిగి ఉంటే బలరాముడునూ నా పుత్రుడే కదా! వాడేల చేయలేక పోయాడు!

మా బాల కృష్ణుడు చిన్నివాడు. విష్ణుదేవుని కృపామృతంతో పోషింప బడుతున్నాడు. ఈ అమానుష కార్యాలు మా కృష్ణుడు చేశాడు అనటం పొసగని మాట''. అని యశోద పలుకుతుంది. ఆ తల్లి వాత్సల్యం అట్టిది.

బంధువర్గంలో పెద్దవారు. విద్యగరపు వారు, లాలనపాలన చేయువారు, గురుజనులు, కృష్ణ లాలనకు పాలనకు ఉత్సుకులైనవారు, దయార్ద్ర చిత్తులు, పూజనీయులు, వందనీయులు, బంధువర్గంలో - పెక్కురున్నారు

యశోద, నందరాజు, రోహిణి, బ్రహ్మాదాచిన గోపాలుర తల్లులు. దేవకి, సవతులు, కుంతి వసుదేవుడు, సాందీపని మున్నగువారు ముఖ్యులు. వారిలో నంద యశోదలు శ్రేష్ఠులు. వీరందరు వాత్సల్యరసంలో విభావాలు.

**యశోద -**

తల్లి యశోద చాలా అందంగా ఉంటుంది. చూడ ముచ్చటైన విగ్రహం. కుది మట్టసంగా మంచి కుదిరికైన కుందనపు బొమ్మవలె ఉంటుంది. చిక్కని పచ్చి పసుపుకొమ్ము వన్నె. విశాల నేత్రాలు కమల పత్రాలవలె ఉంటాయి. వాలుకనుబొమ్మలతో మధురమీనాక్షివలె ఉంటుంది. పట్టుపీతాంబరం గోచీపోసి కట్టుకొంటుంది. నితంబప్రదేశంలో ముత్యాలమొలనూలు బంధించుకొంటుంది.

ఈ తల్లికి పెరుగుచిలికి వెన్నతీయటం వేడుక. నవనీతంతీసి బాలకృష్ణకు నోటికి అందిస్తుంది. అది అలవాటు. ఈ అలవాటులో ఆలస్యమైతే బాలకృష్ణుడు అల్లరి ప్రారంభిస్తాడు. తల్లి చెంగుపట్టుకొని తారంగం పాడతాడు. తైతక్కలాడతాడు.

పెరుగు చిలికే సమయంలో తల్లిశరీరం పారిజాత లతామతల్లివలె కంపిస్తుంది. అది ఒక నృత్యభంగిమవలె అందాలు చిందిస్తుంది. పుత్రప్రేమతో స్తనాలు స్తన్యం స్రవిస్తాయి. కరకంకణాలు ఆ నృత్యభంగిమకు తగినట్లు తాళం వేస్తుంటాయి. కవ్వపు త్రాటితోపాటు బాహువులు విన్యాసం చేస్తుంటాయి. ఆ తల్లి మణిమంజుల తాటంకాలు మెరుగులీనుతూ ఊగుతుంటాయి. ముఖ మండలం స్వేదబిందువులతో ముత్యాలు అద్దినట్లుంటుంది. జుట్టుముడి జారి వాలుజడయై నాగనృత్యం చేస్తుంటుంది.

అలసి సొలసి కూడా ఆ యశోదాసీమంతిని పెరుగు చిలుకుతుంటుంది. అది వేకువయందలి నిత్యకృత్యం. దధిమధనమృదంగ ధ్వనులు క్షీరాబ్ధి శయనుడైన బాలకృష్ణకు మేలుకొల్పులు.

ఆ తల్లి ముంగురులు అందాలసిరులు. అవి సిరిమువ్వలభ్రమర మంజరులు. ఆ తుమ్మెదలు ముఖకమలంపై వ్రాలుతూ లేస్తుంటాయి. ఆమె ఉదయం జడను క్రొమ్ముడిలో బంధిస్తుంది. కానీ కురులు చంచల చంచరీకాలన్నట్లులేస్తుంటాయి. తెల్లని ముఖపద్మంపై సింధూరతిలకం సీమంత కాంతిని వర్ధమానం చేస్తుంటుంది. ఆ కాంతామణి కంఠంలో ముత్యాలహారం ఒకటి మాత్రం వేసుకొంటుంది. అల్పమైన ఆ భూషణాలతో అతిశయంగా కనిపిస్తుంటుంది.

ఆనందాశ్రునయనాలతో ఆ తల్లి ఆనందబాలునే అవలోకిస్తుంటుంది. ఆనందబాలుని ఒడిలోకి తీసుకొంటుంది. బుగ్గగిల్లి ముద్దుపెట్టుకొంటుంది. అంతలోనే 'నాదిష్టే తగులుతుందేమో! బాబుకి, అని మెటికలు విరిచి ముఖం తుడుస్తుంది. దిష్టి తీస్తుంది. ఆ యశోద కృష్ణునివంటి మేఘశ్యామల మేలిమి అంబరాలు ధరిస్తుంది. ఆ చీరచెరగులు జరీ పనితనంతో అద్భుతంగా మెరుస్తుంటాయి. ఆ వ్రజేశ్వరి రాజరాజేశ్వరి.

ఆ మాతృమూర్తి మూర్తీభవించిన వాత్సల్య రసాధిదేవత, ఉషః కాలంలో బాలకృష్ణకు హరినామకీర్తనలతో మేలుకొల్పులు పాడుతుంది. మేలుకొన్న బాబుకు మోము కడిగి వేడి పాలిస్తుంది. పాలిచ్చి లాలపోస్తుంది. లాలపోసి మంత్రవాక్కులతో పొగవేసి తిలకం దిద్దుతుంది. తిలకం పెట్టి రక్షకడుతుంది. రక్షకట్టి కడుపునిండ చనుపాలిచ్చి జోలపాటలతో డోలలోవేసి నిద్ర పుచ్చుతుంది. ఇది వాత్సల్యం రూపుగైకొన్న యశోదామాతృమూర్తి దినచర్య. ఇది ఆ తల్లి నిత్యకృత్యం.

కౌమారాదుల వయస్సు రూపం వేషం శైశవ చాపల్యం, వాఙ్మాధుర్యం- మందహాసం. లీలావినోదం ఈ మొదలగునవి వాత్సల్య రసంలోని ఉద్దీపనాలు.

కౌమారంలో - ఆద్యం, మధ్యమం, శేషం అని మూడు తరగతులు. ఆద్యకౌమారంలోని ఆకారం ముద్దులు మూటకట్టుతుంది. శిశువు నడుం, తొడలు బొద్దుగా ఉంటాయి. కనుగొలకులలో శ్వేతకాంతులు ఉబికి వస్తుంటాయి.

చిన్న చిన్న దంతాలు కాంతివంతంగా వస్తుంటాయి. శరీరం కోమలంగా సుతి మెత్తగా ఉంటుంది. పళ్ళు వస్తుంటాయి. పద్మం లాగా ముఖం కాంతులు కుమ్మరిస్తుంటుంది. మనోహరంగా మందహాసం చేస్తుంటాడు. బాలకృష్ణమూర్తి అందరికీ అల్లారు బిడ్డయే.

కరార విందేన పదార విందం
ముఖార విందే విని వేశ యంతమ్
వటస్య పత్రస్య పుటేశయానం
బాలం ముకుందం మనసా స్మరామి.

ఈ కౌమారంలో బాలకృష్ణ బహు ఆకర్షణీయంగా ఉన్నాడు. పాదాలు పైకెత్తుతుంటాడు. కేరింతలు కొడుతుంటాడు. కాసేపటిలో ఏడుస్తాడు. లాలిస్తే నవ్వుతాడు. బాబు ఏడుస్తుంటే అందరికీ ఆతురత ఆందోళనమే. నవ్వుతుంటే అందరి ముఖాలు అరవిందాలవలె వికసిస్తాయి.

బాలకృష్ణకాలి బొటనవ్రేలు నోటికి అందించుకొంటాడు. ఆ వ్రేలులో ఏ అమృతం వస్తుందో మరల అంతలో కాళ్ళు ఝాడిస్తాడు. కాసేపు విలాసాలు కాసేపు విలాపాలు. ఆ కృష్ణను చూడటంలోనే ప్రొద్దులు క్షణాలవలె గడుస్తున్నాయి యశోదమ్మకు.

బాలకృష్ణ ఎంత అందంగా ఉంటాడను కొన్నావు! ఆ స్వామి మెడలో పులిగోరు, ముఖంపై కస్తూరి తిలకం, కన్నులకు కాటుక రేఖలు, నడుంపై పట్టుకుచ్చుల త్రాడు, చేతులకు ముత్యాల మురుగులు, అందాన్ని వందరెట్లు అధికం చేస్తుంటాయి. ఆ పుత్ర రత్నాన్ని చూచుకొని యశోదమ్మ సంతృప్తి చెందలేక ఇంకా ఇంకా చూస్తూనే ఉంటుంది. ఇంతలో నా దిష్టే తగులు నేమో అనుకొని దిష్టి తీసి పోస్తుంది.

చేత వెన్న ముద్ద, చెంగల్వ పూదండ,
బంగరు మొలత్రాడు, పట్టుదట్టి,
సందెతాయెతులును, సరిమువ్వగజ్జెలు
చిన్ని కృష్ణ! నిన్ను చేరి కొలుతు.

బాలకృష్ణకు మధ్యమ కౌమారం వచ్చింది. ఈ వయస్సులో ముంగురులు

ముఖం మీద పడి ముద్దు ముద్దుగా ప్రేలాడు తుంటాయి. దిగంబరంగా ఉన్నా దివ్యంగా ఉంటాడు. బాలరూపం బ్రహ్మ స్వరూపం కదా! చెవులకు పోగులు వింతకాంతులతో వినూత్న సౌందర్యాన్ని వెదజల్లు తుంటాయి. తొక్కు పలుకులు వస్తుంటాయి. మోకాళ్ళతో దోగాడుతుంటాడు.

ఆ ముంగురులలో నుండి కాంతివంతాలైన కన్నుల చంచల దృక్కులతో ప్రత్యేకంగా కనిపిస్తాడు. దోగాడుతూ వేగం పుంజుకొంటాడు. వాక్కులు మధురాలై వ్యక్తావ్యక్తంగా ధ్వనులను ప్రయత్న పూర్వకంగా ఉచ్చరిస్తుంటాడు. ఆ పుత్రుడు దివ్య చరిత్రుడు.

ముక్కు చివర ముత్యంతోడి బులాకీ ఊగుతుంటుంది. అరచేతిలో వెన్నముద్ద, మొలకు చిరుగజ్జెలు అవి ఆ బాలముకుందానికి ఆభరణాలు.

బాలకృష్ణకు శేషకౌమారం వచ్చింది. నడుం కొంచం సన్నబడింది. వక్షస్థలం విశాలమవుతోంది. శిరోజాలు నొక్కు నొక్కులు కలిగి వంకలు తిరుగుతున్నాయి. గోపాలుడు బంగరు గోచీలగిస్తున్నాడు. పూలదండలు మెడలో ధరిస్తున్నాడు. చిన్న బెత్తం పట్టుకొని పెద్దలను బెదిరిస్తున్నాడు. ఎంత సంతోషం! బెత్తం చూపి నవ్వుతున్నాడు. లేగల దగ్గరికి పరివెత్తుతున్నాడు. తోటి బాలురతో చెట్లెక్కి సయ్యాటలాడుతున్నాడు. వేణువు ఊదుతున్నాడు. శృంగం వాయిస్తున్నాడు. పాటలు పాడుతున్నాడు. చతురమైన మాటలు మాట్లాడుతున్నాడు. హసిస్తున్నాడు. ఇతరులను పరిహసిస్తున్నాడు. గోవులను కాస్తున్నాడు. గోపికలను చూస్తున్నాడు.

గోధూళి ధూసరిత కోమల గోప వేషం
గోపాల బాలక శతై రనుగమ్య మానమ్
సాయంతనే ప్రతి పదం పశుబంధనార్థం
గచ్ఛంత మచ్యుత శిశుం ప్రణతోఽస్మి నిత్యమ్

నందయశోదలు ఇంటిముందు నిలబడి యున్నారు గోవులను మేపుటకు వెళ్ళి బాలగోపాలుడు రాలేదు ఏమిటా! అని మునిమాపువేళ చూస్తున్నారు. నందరాజు గంభీరంగా ఉన్నాడు. కానీ యశోద బాలకృష్ణ ఇంకా రాలేదే అని కాలుకాలిన పిల్లిలాగా లోపలకు బయటకు ఒకటే తిరుగుతోంది. 'మీరు కనుక్కోరు' అని భర్తపై రుసరుసలాడుతోంది. ఇంతలో బాలగోపాలుడు ఆవులతో

వస్తున్నాడు. నందమహారాజు యశోదతో అంటున్నాడు. ''ప్రియా! అడుగో! అబ్బాయి! అటు చూడు. నీ కొడుకు అడుగో వస్తున్నాడు. శిరస్సుపై మయూరపింఛం పలు రంగుల ధగద్ధగలు మెరుస్తుండగా కిరీటంధరించిన యువరాజువలె వస్తున్నాడు. చుట్టూ గోపాలమిత్రులు గో సహస్రాలు కొలుస్తుండగా వస్తున్నారు. ఆ చేతి ములుకోల రాజు చేతిలో కరవాలంవలె మెరుస్తోంది. చూడు! చూడు! ఎంత బాగున్నాడో! అటు చూడు.

''అబ్బాయి రంగుల తలపాగచుట్టుకొని అందులో నెమలి పింఛం పెట్టుకొన్నాడు. ఆ కనుకొలలలో ధావళ్యం అందం అతిశయింప జేస్తోంది కదూ! వంటికి ఆ చొక్కా చాల ముచ్చటగా నప్పింది. చిరుగజ్జెలు కాలి నూపురాలలో మ్రోగుతున్నాయి. గోవుల వెంట మన కన్నయ్య ఎంత అందంగా వస్తున్నాడు. ఆ మురళి వినండి ఎంత బాగా మ్రోగిస్తున్నాడో! ఆ కొమ్ముబూర కూడా అలానే ఊదుచున్నాడు. ఉండు, ఎర్రనీళ్ళు తీయాలి. అలా ఉండమనండి! పిచ్చి తండ్రి!''

ఆతల్లీ బిడ్డల అనురాగాలు అనుపమానాలు తల్లి వాత్సల్యం బాలుని ప్రేమ ఇంత అంత అని వర్ణించలేము –

చప్పుడు సేయకుండు మని జంకె యొనర్చిన అల్గిపోవగా
అప్పుడు బారసాచి తన నవ్వుల విందులు వచ్చి రంచు న
వ్వొప్పగ జీరు తల్లి దెస కొత్తిలి కృష్ణుడు రంతు సేయుచున్
అప్పుడు వచ్చి చన్గుడుచు నవ్వొలయన్ మొలగంట మ్రోయగన్

వల్లవ గృహ నవనీతము
లెల్లను భక్షించి వచ్చి యెరుగని భంగిన్
తల్లి గదిసి చిట్టాడుచు
అల్లన చను బువ్వపెట్టు మువ్వా! యనుచున్

శ్రీ కృష్ణుడు మా యిండ్లకు వచ్చి అల్లరి పనులు చేస్తున్నాడు. నీవు అదుపుచేసుకో! లేనిచో బాలుని మేమే దండించవలసివస్తుంది అని గోపికలు యశోదమ్మ ఇంటిపైకి వచ్చారు. అప్పుడు యశోద – మా బాలకృష్ణ మీయింటికి వచ్చాడా ! అది మీభ్రమ మాబాబు నా దగ్గరే ఉంటాడే !

చన్నుఁ విడిచి చన డిట్టిటు
ఎన్నడు పొరుగిండ్ల త్రోవ లెరుగడు నేడుం
కన్నులు దెరువని మాయీ
చిన్ని కుమారుని రవ్వసేయం దగునే!

అన్యమెరుగడు తనయంత ఆడుచుండు
మంచి వాడీతడెగ్గులు మానరమ్మ
రామలారా! త్రిలోకాభిరామలార!
తల్లులార! గుణవతీమతల్లులార!

మందారమూలే మదనాభిరామం
బింబాధరా పూరిత వేణు నాదమ్
గోగోప గోపీజన మధ్య సంస్థం
గోపం భజే గోకుల పూర్ణ చంద్రమ్.

గోపాల బాలురు అల్లరి పనులు చేస్తున్నారు. 'పిల్లలు ఇంటికి రాలేదే! ఇంతసేపు ఎటు వెళ్ళారా!' అని తల్లిదండ్రులు రోషంతో ఉడికి పోసాగారు. చుట్టు ప్రక్కల అన్వేషించసాగారు.

అరుగో! అబ్బాయిలు వచ్చారు. పుత్రులను చూడగానే ప్రేమ రసం పొంగి పొరలింది. రోషం పారిపోయింది. బిడ్డనుముందుగా తల్లి ఒడిలోకి తీసుకొంది. బుగ్గలు నిమిరి ముద్దాడింది. పాలుపోసి బువ్వ పెట్టింది. తనయుడు తండ్రి ఒడిలోకి జేరాడు. తండ్రి బాహువులతో ఆలింగనం చేసుకొన్నాడు. శిరస్సు మూర్కొన్నాడు. హృదయం చల్లబడింది. తల్లిదండ్రులకు పరమానందం కలిగింది. శిరస్సు మూర్కొనుట, శరీరం నిమురుట మొదలైనవి ప్రేమరసంలోని అనుభవాలు.

మాతృశ్రీ అయిన యశోదకు పుత్రుడు కనిపించగానే చన్నులు చేపుకు వస్తాయి. బాలకృష్ణను దగ్గరకు తీసుకొని ఒడలెల్లా నిమురుతుంది. పాలబుగ్గలపై ముద్దులుంచుతుంది. శిరస్సు మూర్కొంటుంది. గుండెకు హత్తుకొని ఒడిలో పడుకోబెట్టుకొంటుంది. ఇవి తల్లి సేయు సాధారణ క్రియలు.

స్తంభాదులు ఎనిమిది, స్తన్యం స్రవించుటయు. తొమ్మిది వత్సలరసంలో సాత్త్విక భావాలు.

**నందరాజు -**

కృష్ణ జనకుడు నందమహారాజు. వ్రజాధిపతి. హుందాగా ఉంటాడు. ఆనందంగా ఉంటాడు. తలపై వెంట్రుకలు తెల్లబడీ తెల్లబడకుండ తిలతండుల న్యాయంగా ఉంటాయి. కొద్దిగా పొట్ట వచ్చింది.

మర్రి చిగురు రంగు వస్త్రాలు ధరిస్తాడు. మూతిపై మీసాల నుంచి చిరునవ్వుల కాంతులు ముసి ముసిగా ముచ్చట లాడుతుంటాయి. జరీకండువా పొడుగ్గా భుజంపై వ్రేలాడుతుంటుంది. పాదాలపై పట్టుపావడా జీరాడుతుంటుంది. చంద్రబింబంవలె ముఖబింబం శోభాయమానంగా ఉంటుంది.

బాలకృష్ణుడు పట్టుదట్టి కట్టుకొని పులిగోరు మెడలో పెట్టుకొని పంగనామాల గోవింద తిలకం దిద్దుకొని తండ్రి చిటికెన వ్రేలు పట్టుకొని తండ్రి ప్రక్కనే నడుస్తాడు. ఆ బిడ్డను చూచి తండ్రి వక్షస్థలం వాత్సల్యరసంతో రసప్లావితం అయిపోతుంటుంది. ఆ తండ్రిని చూచి బాలకృష్ణ ఆనందంతో చిందులు త్రొక్కుతుంటాడు. వారి మధ్యలోని ప్రేమరసం వర్ణనా తీతం.

ఒకసారి బ్రహ్మ గోపాలకృష్ణ తత్త్వం తెలియక గోవులను వత్సాలను గోపాలురను బ్రహ్మలోకం తీసుకొని వెళ్ళి దాచి ఉంచాడు. అది గ్రహించిన కృష్ణ తానే గోవులుగ, గోవత్సాలుగా, గోపాలురుగా రూపు దాల్చి తమతమ గృహాలకు గోశాలకు వెళ్ళాడు. ఆ బాలురు, ఆవులు, ఆ దూడలు తమవే అనుకొని గోపల్లెలోని తల్లిదండ్రులు ఒడిలోకి తీసుకొని లాలించసాగారు. స్తన్యం ఇచ్చి బుజ్జగించారు. పుత్రప్రేమలోని వాత్సల్య రసంలో జూరలాడారు. పరబ్రహ్మకే స్తన్యం ఇచ్చి ఆ తల్లులు ధన్యులైనారు.

'బాలకృష్ణా ! చిన్నికృష్ణా ! గోపాలకృష్ణా ! రా ! రా ! రారా !' అని యశోద పిలిచి 'నాయనా ! నీకు అందంగా గైరికాది ధాతువులతో తయారు చేసిన తిలకాదులతో అలంకారంచేసి పంపితే అవి గోధూళితో కప్పబడినా! ఇదీ ఒక అలంకారంగా మైపూతలాగా వున్నదే! రారా! అని పయిట చెంగుతో తుడిచి బాబును కుచకలశాలకు హత్తుకొని ప్రేమమయ క్షీరధారలలో అభిషేకం చేస్తుంది.

మాతృదేవత వాత్సల్యరతి అట్టిది.

శ్రీకృష్ణదేవుడు ప్రళయ వర్షధారలతో గోకులం వ్యాకులం చెందుతూంటే గోవర్ధన పర్వతాన్ని గొడుగులాగాబట్టి గోకులవాసులను కాపాడాడు. అంత పర్వతాన్ని పట్టినిలిచిన గోపాలకృష్ణునిచూచి యశోద స్తంభించిపోయింది. ఆలింగనం చేసుకోలేక పోయింది. బాష్పధారలుబికి వస్తున్న నేత్రాలతో కొడుకును చూడ లేకపోయింది. కంఠం రుద్ధమై 'కృష్ణా!' అని పిలవటానికి ధ్వని పెగలకపోయింది. వ్యాకులతతో అలా స్తంభించిపోయింది.

దేవకీదేవి గొప్ప అదృష్టవంతురాలు. నశించిన పుత్రులను మరల పొంది ఆలింగనం చేసుకొంది. ఒడిలోకి తీసుకొని పసికందులను ముద్దాడింది. అపరిమిత ఆనందం అందుకొంది.

కృష్ణా! నీగాత్ర స్పర్శ మహాసుఖాన్ని కలుగ జేస్తోంది. నీ స్పర్శ ఎంత చల్లగా ఉంది! దీనికి సాటిగా కర్పూర పరాగం, చంద్ర చంద్రికా రసం, చందనం, వట్టివేళ్ళపవనం, ఇందీవరం కూడా సరిరావు. పుత్రగాత్ర పరిష్వంగం అట్టిది.

దయకు అర్హుడైన వ్యక్తిపై చూపునట్టి సంభ్రమాదులు లేనిరతి వాత్సల్యం. అది స్థాయీ భావం ఇట్టి స్థాయీ భావానికి యశోదాదులు ఆలంబనమైనారు. వాత్సల్యరతి ప్రౌఢమై అదితనరారింది. ఇది రాగపరాకాష్ఠ. సమయ విశేషంచేత ఇది స్నేహం - ప్రేమ - రాగంగా బయలు వెడలుతుంటుంది. అంతరంగికంగా ఇది ప్రౌఢమైయుంది.

ఉదార బుద్ధియైన నందమహారాజు ప్రవాసం వెళ్ళి ఇంటికి రాగానే పుత్రుని ఒడిలోనికి తీసుకొని మస్తకం నిమిరి ఆఘ్రాణించి, పరమానందం చెందుతుంటాడు.

తల్లి యశోద కృష్ణమురళీధ్వని విని ఇంకా వినాలి అని చెవి యొగ్గి వింటుంది. రెట్టింపు ఉత్సాహం పొందుతుంది. స్తనాల నుండి క్షీరధారలు విడుస్తుంది. ఇంటిలో నుంచి బయటకు బయట నుంచి ఇంటిలోనికి ఎన్ని సార్లు తిరుగుతుందో! చెప్పలేము. 'కృష్ణా ! కృష్ణా !' అంటూ ఎదురు తెన్నులు చూస్తుంటుంది. ఆమె వాత్సల్యరతి అట్టిది.

ముని శ్రేష్ఠులు బాలముకుందుని బహువిధాల స్తోత్రం చేస్తున్నారు. ఈ విషయం యశోదకు అవగతమే. అయినా సంభ్రమం చెందకుండా కృష్ణుని

ఒడిలోకి తీసుకొంటుంది. స్తన్యధారలచే వస్త్రం తడిసి పోతుంటుంది. ఆ తల్లి కృష్ణునికై కురుక్షేత్రాదులకు - పయనిస్తుంటుంది. అది సూర్యగ్రహణ వేళ. వ్రజవాసులు, కృష్ణుడు వస్తారని దేవకీ వసుదేవుల వద్దకు వచ్చారు. దేవకి కృష్ణుని చూచి ముఖం తుడిచి ముద్దు పెట్టుకొంది. పెక్కురు 'వసుదేవనందనా ! కృష్ణా !' అని సంభోదించి, పరమ సంతోషం జెందారు. నందయశోదలు కురుక్షేత్రంలో ఈ దృశ్యం చూచి ప్రేమాతిశయంలో మహోల్లాసం చెందసాగారు. ప్రేమవాత్సల్యరతి అట్టిది.

నేడు సూర్యగ్రహణం. కృష్ణమూర్తిని కనులార చూడాలి అని మిక్కిలి ఉత్కంఠతతో యశోద కురుక్షేత్రం జేరింది.

ఒక తపస్విని యశోదను గుర్తించి, ఇలా ప్రశంసించసాగింది. 'అమ్మా ! వ్రజేశ్వరీ ! నీ వెంత అదృష్టవంతురాలవో కదా ! తల్లీ! నీ చనుకొండల నుండి స్రవించు అమృత కాంతితోడి క్షీరము జాహ్నవియైనది. నీ కనుదమ్ముల నుండి స్రవించు అంజన మిశ్రితశ్యామల బాష్పధారలు యమునయై నీ తనూ మధ్యం అనే ప్రయాగలో పడి ఆనందం కలిగిస్తున్నాయి.

ఆహా ! నీవు ఈ జాహ్నవీ కాళిందీ నదులలో స్నానం చేసిన పుణ్యాంగనవు. నీవు ధన్యురాలవు. నీవు పుత్రముఖం చూడకున్నా నీవు అనంత పుణ్య ఫలరాశి పొందగలిగావు తల్లీ! ఇది నీ స్నేహ వాత్సల్యరతి.

ముకుందా ! అరవిందాక్షా ! గోవిందా ! యశోద తుషానలంపై కూర్చున్ననూ నీ ముఖారవిందం చూడగానే తుషారజలంపై కూర్చున్నట్లే ఆమె సంతోషిస్తుంటుంది. ఆమె అమృత సముద్రంపై కూర్చున్నా నీ ముఖం చూడకున్నచో ఆమె కాలకూటం మధ్యంలో నివసిస్తున్నట్లే బాధపడుతుంది.

**ఇది రాగం వంటి వాత్సల్యరతి.**

శ్రీకృష్ణుడు వ్రజవాటికలోనే ఉండిపోయినాడని దేవకీదేవి 'అయ్యో! నాకృష్ణ చంద్ర ముఖబింబం నేనెప్పుడు ఆనందంగా చూతునో కదా!' అని మిక్కిలి ఆతురత చెందుతున్నది.

**ఇది అయోగంలోని ఉత్కంఠత.**

కుంతీదేవి ఇలా చెప్పి పంపించింది. ''సోదరా ! అక్రూరా ! మా

మేనల్లుడగు శ్రీకృష్ణునితో ఇలా చెప్పు, 'హరీ! శత్రుపురంలోని కుంతి నిన్ను చూడగోరుతున్నది'' అది అయోగదశ.

ఉద్ధవుడు శ్రీకృష్ణ కథామృతాన్ని ఆస్వాదన చేస్తూ ఇంకా ఇంకా వర్ణించి చెప్పుతున్నాడు. యశోదాదేవి ఆలకిస్తోంది. అపుడు యశోదా దేవి స్నేహార్ద్ర హృదయం నుండి స్తన్యధారలు స్రవిస్తున్నాయి. ఆమె నేత్రాలనుండి అశ్రుధారలు ప్రవహించసాగాయి. **అది వియోగ వాత్సల్యరతి.**

శ్రీకృష్ణుడు కంసరాజధానికి వెళ్ళాడు. యశోద కృష్ణుని పంపలేక పంపలేక పంపింది. ఆమె ముఖమండలం నీల ముంగురులతో కప్పివేయబడింది. దేహం శిథిలమై పోయింది. ఆమె భూమిపై మూర్ఛిల్లింది. శరీరానికి గాయాలు తగిలాయి. దేహం కృశించింది. 'హా పుత్రా! హా పుత్రా!' అని ముఖం నుండి చీత్కార ధ్వనులు వెలువడ సాగాయి. ఆమె చేతులతో రొమ్మును బాదుకో సాగింది. **ఇది వియోగబాధ.**

ఈ వియోగంలో సంచారీభావాలు పెక్కున్నాయి. అందులో చింత, విషాదం, నిర్వేదం, జాడ్యం, దైన్యం, చాపల్యం, ఉన్మాదం, మోహం విశేషంగా ఉద్రిక్తమవుతాయి.

''అమ్మా! యశోదా! కృష్ణుని యెడబాటువలన నీ హృదయ స్పందన తగ్గుతున్నది. అధికఆరాటం వలన నీచిత్తం కలతచెందసాగింది. నీ కనుగ్రుడ్లు నిశ్చలములూ, కాంతిహీనములూ అయినాయి. వేడినిట్టూర్పులచే నీ స్తనదుగ్ధాలు స్రవించి, స్రవించి ఇక స్రవించలేక తప్తమవుతున్నాయి. నీవు పుత్ర విరహంతో ఎంతగానో చింతిస్తున్నావు. ఓర్పువహించు తల్లీ!

''శ్రీకృష్ణుడు ద్వారక వీడి రావటంలేదని బాధపడుతున్నావా తల్లీ! యశోదా! అయ్యో! శైశవంగడిచి నూతన తారుణ్యం వెల్లడి అవుతుండగా పుత్రుని ముఖారవిందం చూడలేకపోతున్నానని విలపిస్తున్నావా! నూతన వధువుతో పుత్రుని గృహప్రవేశ మహోత్సవం చేయించలేక పోయినానే అని బాధపడుతున్నావా? అక్రూరుడు నీ తలపై పిడుగు వంటి వార్త పడవేశాడే! దురపిల్లబోకు! ఇలా విషాదం చెందకు!''

యశోదమ్మ ఇలా ఆవేదనం జెందసాగింది. నా అపార సంపదలెందుకు? నాయీ అదృష్ట హీనజీవితమేల! కృష్ణుడు భోగించని ఈ భోగాలేల! స్తన్యధారలచే

హరిని అభిషేకంచేయుని ఈ దుగ్ధమేల! మాధవుని మస్తకం మూర్కొనని నాఘ్రాణమేల? బాలుడు ముట్టని ఈ గోదుగ్ధంబేల? ఈ గో సంపదలేల? మీగడ వాసన వీను ఈ దధిని బాలకృష్ణుడు దొంగిలించకున్న వీని సార్థక్యమేల! అని నిర్వేదం చెందసాగింది.

**జడత**

కృష్ణా! పుండరీకాక్షా! నీవు పశువుల సావిడిలో కఱ్ఱ పుచ్చుకొని తిరుగుతున్నట్లు ఊహించుకొని ఆ తల్లి నేడు జడప్రాయమై కఱ్ఱవలె బిగిసి పోతున్నది. ఆ తల్లిప్రేమ అట్టిది. అది ఆ తల్లిజడప్రాయ జీవనం. జాడ్యం.

బ్రహ్మదేవా! మాతృశ్రీ యశోదాదేవి నోటితో తృణం కొరుకుతూ ద్వేషరోషాలు మానుకొని 'ఒక్కసారి నీ బాల కృష్ణుని నాకు చూపింపవా!' అని నిన్ను వేడుకొంటోంది. దీనాతి దీనానయై, దైన్యంగా అర్థిస్తోంది. ఆలకించు.

**ఉన్మాదం**

ఆ యశోద నందమహారాజును గూర్చి ఇలా పలుక సాగింది 'ఏమి పురుషుడు! సిగ్గులేకుండ మేడలో ఏమిచేస్తున్నాడు! వ్రజపతీ ! వ్రజపతీ ! యని లోకుల అమాయకంగా పిలిచి ఆనందిస్తున్నారు. ఈ వ్రజపతి హృదయం వజ్రసదృశం. వారు వజ్రపతి అనే పిలుస్తున్నారు. బాగా అంటున్నారు! బాలకృష్ణను విడిచి యథేచ్ఛగా గోశాలలో సంచరిస్తున్నాడు! ఏమి మనీషి!' అని చాపల్యం కొలది పతిని నిందిస్తుంది.

'కృష్ణా ! నీ తల్లి పిచ్చిదైనది. ఆ తల్లి 'నాపుత్రుడెక్కడ!' అని కదంబ వృక్షాన్ని అడుగుతోంది! తురంగ సమూహమా ! మీ దగ్గరకు మా కృష్ణుడు వచ్చాడా' అని ప్రశ్నిస్తోంది. తుమ్మెదలను చూచి 'ఓ భృంగకుమారికలారా! మా కృష్ణ వార్త చెప్పు చెప్పు అని బ్రతిమలాడుతోంది యశోద.

ఆమెకు ఉన్మాదం ఎక్కువయింది.

''కుటుంబినీ! నీవు కలత చెందుతున్నావు. ఒక్కసారి కళ్ళు తెరచి చూడు. నీ కృష్ణుడు నీ యెదుటే ఉన్నాడు. గృహిణీ ! మన గృహాలు శూన్యాలు అనుకోకు'' అని. కృష్ణా! నీ తండ్రి కలత జెంది, నీ తల్లి దగ్గర తన దుఃఖం ఈవిధంగా వెలిబుచ్చుతున్నాడు. **ఇది కృష్ణునిపైని మోహం.**

శ్రీకృష్ణమూర్తి బహుకాలం తరువాత వసుదేవుని భార్యలకు కనిపించాడు.

అపుడు కనిపించిన కృష్ణమూర్తిని చూస్తుండగనే వారికి క్షణకాలంలోనే స్తన్య ధారలు స్రవించాయి. నూతన కంచుకాలు ఆర్ద్రమైనాయి. మాతృ హృదయం ఉప్పొంగి పోయింది. **ఇది ఒక యోగ సిద్ధి మాత్రమే.**

శ్రీకృష్ణదేవుడు తల్లులకు నమస్కరించసాగాడు. తల్లులు తమ ప్రియ తనయుని కౌగిటికితీసికొని ముద్దులాడారు. వెంటనే వారి స్తనాలనుండి స్తన్యం స్రవించసాగింది. వారు హర్ష విహ్వల చిత్తలై కన్నీటి ధారలతో కూడా బాలుని అభిషేకించారు.

యశోదాదేవికి కృష్ణుని చూడగానే స్తనద్వయం నుండి నయన ద్వయం నుండి దుగ్ధధారలు, జలధారలు ఉబికి వచ్చాయి. క్షీర, నీరధారలచే బాలకృష్ణుని ఆతల్లి అభిషేకించింది. **ఇది యోగతుష్టి.**

ముకుందా! గోవిందా! నీ ముఖారవింద సౌందర్యం చూడగానే యశోదాదేవికి హర్షం అతిశయిస్తుంది. ఆమె కుచకలశాలు పొంగి క్షీరధారలు పొంగులు వారతాయి. కుచకంచుకాలు ఆర్ద్రమవుతుంటాయి. ఇది నిజంగా **మాతృయోగస్థితి** సుమా!

ఇది వాత్సల్యరస స్థితి. దీనిని నాట్యశాస్త్రవేత్తలు ప్రమాణంగా ప్రదర్శించారు. ప్రాచీన పండితులు వాత్సల్యరసం అని పేర్కొన్నారు. ఈ వాత్సల్య రసానికి స్థాయి భావం వత్సలత. ఆలంబనం పుత్రాదులు.

ఇది రసం కానిచో దాస్యం పుష్టి చెందదు. సఖ్యరసం తిరోధానం అవుతుంది. ఇది కృష్ణునిచే రతి నిర్ణయమయింది. కనుక వత్సల రసానికి నష్టం వాటిల్లదు. ప్రీతం, ప్రేయస్సు, వత్సలం మూడూ మూడు రసాలు. మూడు కలసిన మిశ్రరసం అని కూడా నిర్ణయించి అనుభవించవచ్చును.

బలరాముని కృష్ణ సఖ్యం ప్రీతి వాత్సల్యాలతో కూడినట్టిది. ధర్మరాజు వాత్సల్యం ప్రీతి సఖ్యాల మిశ్రమం. ఉగ్రసేనాదులది ప్రీతి వాత్సల్య మిశ్రితం. గోపికలది వాత్సల్య సఖ్య మిశ్రితం. నకుల సహదేవ నారదాదుల సఖ్యం ప్రీతితో కూడినది. రుద్ర, గరుడ, ఉద్ధవాదులది ప్రీతి సఖ్యమిశ్రితం.

అనిరుద్ధాది మనుమలలో సఖ్యదాస్యభావ మిశ్రమం ఉంది. ఇట్లే మరి కొందరి భక్తులలో భావమిశ్రణం ఉన్నది.

ఇది వాత్సల్య భక్తిలహరి.

పశ్చిమసముద్రం లో

# మధురభక్తి లహరి

గోపికల నిత్య కృత్యంలో గోపాలుడు ప్రాణసమానుడైనాడు. కృష్ణుని యెడబాటు వారి హృదయం సహించేదికాదు. వారు త్రికరణశుద్ధిగా కృష్ణదేవుని ఆరాధించారు. గోవింద నామావళి ఏక కంఠంగా పాడేవారు. కృష్ణుడికై ఏమైనా త్యాగం చేసేవారు.

ఒకసారి లీలామానుష మాధవస్వామి చెరుకు గడలు చీల్చుకొని తింటుండగా చిటికెనవ్రేలు గీచుక పోయింది. నెత్తురు చిమ్మసాగింది. అష్టమహిషులు అక్కడే ఉన్నారు. గుడ్డపేలికకై, నీళ్ళకై పరుగులు తీశారు.

గోపిక చూచిందే తడవుగా చీరచించి నోటితో తడిచేసి వ్రేలికి కట్టుకట్టింది.

ప్రేమభక్తి అంటే అది అన్నాడు కృష్ణస్వామి. ఈ గోపికలను ఉద్ధవ నారదాదులు ఆదర్శభక్తులుగా పేర్కొన్నారు.

ఒక సాయంకాలం గోపాలకృష్ణుడు ఆటలాడుతూ మాయమైనాడు. మహాభక్త హృదయాలను పరీక్షచేయుటమే స్వామి పని -

గోపికామణులు గోపాలునికై వెతకి వెతకి వేసారి మతిచెడి మా కృష్ణ దేవుని జాడ చెప్పుడని మాటలాడలేని మ్రానులను బ్రతిమలాడ సాగారు. చెట్టుకొకరు గుట్టకొకరు తిరిగి కృష్ణప్రాణసఖుణ్ణి అన్వేషిస్తున్నారు.

ఒక మగువ మల్లెపొద దగ్గరకు వెళ్ళి మల్లెలారా! మా మాధవుణ్ణి చూచారా! అని ఏడుస్తూ అడుగుతోంది -

నల్లనివాడు పద్మనయనంబులవాడు - కృపారసంబు పై
జల్లెడువాడు - మౌళి పరిసర్పిత పింఛమువాడు - నవ్వు రా
జిల్లెడు మోమువాడొకడు చెల్వల మానధనంబు తెచ్చె నో
మల్లియలార! మీపొదల మాటున లేడు గదమ్మ చెప్పరే!

మరి కొన్ని పుష్పవనాలకు వెళ్ళి కొందరు ఇలా విలపిస్తున్నారు -

మానినీ మన్మథు మాధవు గానరే!
సలలితోదార వత్సకములార!
సలలితోదార వత్సకవైరి గానరే!
సుందరోన్నతలతార్జునములార!
సుందరోన్నత లతార్జున భంజుగానరే!
ఘనతర లసదశోకంబులార!
ఘనతర లసద శోక స్ఫూర్తిగానరే!
నవ్య రుచిరకాంచనంబులార!
నవ్యరుచిర కాంచన కిరీటు గానరే!
గహన పదవి కురవకంబులార!
గహన పదవి కురవక నివాసు గానరే!
గణికలార! చారు గణిక లార!

అదె నంద నందనుడంతర్హితుండయ్యె
పాటలీ తరులార! పట్టరమ్మ!
హేలావతుల ''కృష్ణ! ఏలపాసితి''వని
ఐలేయలతలార! అడుగరమ్మ!
వనజాక్షు డిచటికి వచ్చి దాగడు కదా!
చూత మంజరులార! చూడ రమ్మ!
మానినీ మదనుతో మారాక నెరిగించి
మాధవీలతలార! మనుపరమ్మ!
జాతి సతుల బాయ నీతియే హరికని
జాతులార! దిశల చాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపించ
జూటు తెచ్చి కరుణ జూపరమ్మ!

కిటియై కౌగిట జేర్చెను
వటుడై వర్ధిల్లికొలిచె - వడి కృష్ణుండై
యిట పదచిహ్నాము లిడె - క్రిం
దటి బాముున ఏమి నోచితమ్మ ధరిత్రీ!

## రాధ ఆరాధన

మధురా రాజ్యం పరిసరాలలో రాసమండలం ఉంది. రాస మండలానికి రాజు వృషభానుడు. ఆరాజు భార్య కళావతి. ఆ దంపతుల కడుపుపండి అందాల బాల పుట్టింది. ఆ బాల పుట్టింది మొదలు కృష్ణుడితోనే ఆడుతూ పాడుతూ కృష్ణుడే లోకంలా ఉండేది. కృష్ణుడితోనే పరుగులు తీస్తూ పందాలాడుతూండేది. అందులో కృష్ణుడు అత్తకొడుకాయె. ప్రేమ బాగా బలపడింది. **రా**సమండలంలో పుట్టిన రమణి హరితో **ధా**వనం చేస్తోంది. అని పండితులు బాలికనుచూచి **'రాధ'** అని అన్నారు. అ పేరే రూఢి అయిపోయింది.

రాధాకృష్ణుల ప్రేమ వల్లికలు క్రమక్రమంగా పెరుగసాగాయి. రాధ ప్రేమలతాంగి అయింది. కృష్ణుడు రసరాజరసాలమైనాడు. ప్రేమవల్లిక కృష్ణరసాల వృక్షాన్ని పెనవేసుక పోయింది. మాధవారాధన రాధలో అధికమయింది. మాధవుడు అరక్షణం అగుపించకుంటే రాధ మానసం పరితపించేది. మానసమంతా మాధవస్మరణతోనే మరిమరి కాగిపోయేది. అచ్యుతునికై ఆరాధన మరీ యెక్కువయ్యేది. ఏకాంత వనాంతరంలో...

''శ్రీయుతమూర్తి, కరుణచిందెడి చూపులతోడ స్వామి వేం చేయును పాదపూజ దయసేయును మా కనుసంబరాన అప్యాయముగా త్వదీయ పథమారయుచున్నవి నేడు పూచియున్ పూయనిపచ్చ పట్టుపరుపుల్ గొని శ్యామల ద్వలీస్థలుల్'' అని అనుకొంటూ ఉద్యానవనంలో కృష్ణ పరమాత్మకై ఎదురు చూస్తూండేది. మనసులో మాధవునికై పరితపిస్తూండేది.

నీ చిరునవ్వు పాటల ధ్వనించెడి మామక మానసమ్ములో
లేచెనురా! ప్రఫుల్ల మురళీరవళీ రమణీయ భావనా
వీచి - దృగంచలమ్ముల ద్రవించి, స్రవించు మనోనురాగముల్
దాచుకొనంగలేని పసిదాననురా ! విసిగించబోకురా !

అని ఏకాంతంలో శ్రీకాంతునికి మొరపెట్టుకొని కన్నీరు పెట్టుకొనేది. కృష్ణదేవుడు వస్తాడని ఎన్నో వెన్నెలరాత్రులు మేలుకొని కాళిందీనదీ సైకతాలలో పూపొదరిళ్ళలో వేణుగానలోలునికై తిరుగసాగేది.

ఇదియది యంచు తేల్చి వచియింపగ రాని విషాద మేదియో
హృదిగదవించుచున్నది - దహింపగసాగె నిరాశ శుష్క మా
బ్రదుకును - స్నిగ్ధ శీతల కృపారసధారల దుర్దినమ్ము నే
సుదినముసేయరా! యదు కిశోర! కృశాంగి ననుగ్రహింపరా!

అని మరికొంతతడవు ఎదురు చూచిచూచి చివరకు ఇలా విలపించసాగింది.

రాధనురా! ప్రభూ! నిరపరాధనురా! అనురాగ భావనా
రాధనమగ్న మానసనురా! కనరా! కరుణింపరా! మనో
వీధి పదేపదే కలత వేయుచునున్నవిరా! పురా రహో
గాథలు - ఈదలేనిక అగాధతమోమయ కాలవాహినుల్

అని రాధాదేవి ఆవేదన చెందగా తెల్లకల్వల వంటి కన్నులు ఎరుపెక్కి పోయాయి. మొగం వాచిపోయింది. మనిషి శుష్కించి పోయింది. కడపటికి కన్నయ్య కారుణ్యం వహించాడు - పొన్నపూవుల పొదలమాటు నుండి మనోమ్మాధవుడు మెదలసాగాడు.

రాధకు పేరలుక వచ్చింది. స్వామి వచ్చి గడ్డం పట్టుక బ్రతిమలాడసాగాడు - ముఖం ప్రక్కకు త్రిప్పుకొంది. కాళ్ళపై పడ్డాడు. రాధకు ఒక్కసారి ఒడలు జలదరించాయి. ఒక్కసారి కరిగిపోయింది.

ఎంత నిర్దయురాలనో! పంతగించి
కృష్ణ! నీచేత నిట్లు మ్రొక్కించు కొంటి
నవ్యవనమాల కంఠాన నలిగిపోయె
చెక్కుటద్దాల తళుకొత్తె చిగురు చెమట
కొౌదమకస్తూరి నుదుటిపై చెదరి పోయె

బర్హి బర్హంబు చీకాకు పడియె మౌళి
పొందసేర్తునె నిన్ను నా పూర్వజన్మ
కృత సుకృత వైభవాన దక్కితివినాకు
విశ్వసుందర చరణారవింద యుగళి
ముద్దుగొని చెక్కు టద్దాల నద్దుకొను అ
దృష్ట మబ్బిన దొక్క రాధికకె నేడు -

అని రాధ పరవశించి పోయింది. అది రాధికా హృదయం. ఇది రాధ ఆవేదన అనురాగ సంవేదన.

ప్రేమ భక్తి చంద్రకాంత ఒక ఉదాహరణగా పద్మపురాణం పేర్కొంటుంది.

చంద్రకాంత ఒక కృష్ణ భక్తురాలు. ఆ చిగురాకు బోణి మిక్కిలి సుగుణవంతురాలు సుకుమారి వివాహం చేసుకోక కుమారిగానే ఉండి పోయింది. బ్రహ్మచర్యం కృష్ణవ్రతంగా పాలించసాగింది. ఆ మంజుభాషిణి మాధవుణ్ణే మనోధవుడుగా భావించింది. ఆ పూబోణి గోపాలుణ్ణి తలంచుకొని పులకించి పోతుండేది. పారవశ్యంలో మైమరిచి పోయేది. కృష్ణదేవుణ్ణి మానసంలో ఆరాధించసాగింది. మధుసూదనుణ్ణి మందారాలతో మకరంద ధారలతో అర్చిస్తూండేది.

ఆ గానకోకిల కృష్ణ గానంచేస్తూ కృష్ణవిగ్రహం ముందు నాట్యం చేస్తూ మయూర నాట్యాన్నే మరపించేది. ఆ ముగ్ధ కృష్ణపేరు వినగానే స్నిగ్ధ అయ్యేది. కృష్ణస్మరణలో ఆనందాశ్రువులు జాలువార్చేది. ఆమె ప్రేమ పరిశుద్ధమైనది. ఆమె కృష్ణ రాగానురాగిణి. కృష్ణఅనుగ్రహంతో ఆమె భక్తి పరిపక్వమై హరికి ప్రీతికూరుస్తోంది.

ఈ మన్వంతరం ఆరాధనలో అలా సాగిపోతోంది.

స్నేహం ప్రణయం ప్రీతి ప్రేమ విలాస విశేషాలు. సాధకుల దేహాదులలో ప్రేమ ఉత్తరోత్తర దశలు విరళంగా ప్రచురితమవుతుంటాయి.

ఉత్తర సముద్రం లో

# హాస్యరసలహరి

వ్రజబాలుడై ప్రేమ భక్తి ప్రదీప్తం చేస్తున్న సనాతన శ్రీకృష్ణస్వామి సదాసంతుష్టిగా నాపై అనుగ్రహ వర్షం కురిపించు గాక!

ఈ భక్తి రసామృత సింధువులోని ఉత్తర దిశా విభాగంలో హాస్య, అద్భుత, వీర, కరుణ లహరులు వర్ణితాలైనాయి. ఇవి ముఖ్యమైన దాస్యాదులవలె భక్తులందు నిత్యం ఎక్కువగా ఉదయిస్తుంటాయి.

విభావాదుల ద్వారా 'హాస్యరసం' పుష్టి చెంది 'హాస్యభక్తిరసం' గా పండితులచే పేర్కొనబడుతోంది. హాస్యానికి హేతుభూతుడైన శ్రీకృష్ణుడు కృష్ణసఖులు ఆలంబనం. శ్రేష్ఠులు, వృద్ధులు, శిశువులు ఈ హాస్యానికి ఆశ్రయులు.

ఒకరోజు కృష్ణుడు తన తల్లీ యశోదతో భయపడుతున్నట్లు ముఖంపెట్టి ఇలా అన్నాడు. 'అమ్మా! నేనే..? ఆ చచ్చు ముఖం వాని వద్దకు వెళ్ళను. వాడు భయంకరంగా ఉన్నాడు. వాడు నన్ను తన జోలెలోవేసుకొని తన ఊరు తీసుకొని పోతాడు. నాకు భయం వేస్తోంది.' అని ముఖం దీనంగా పెట్టాడు. యశోద కృష్ణుణ్ణి ఒడిలోకి తీసుకొని ఓదారుస్తోంది.

ఈ దృశ్యం చూచిన నారదమహర్షి 'ఏమి నటనాచాతుర్యం' అని ముసి ముసి నవ్వులు ఆపుకోలేక నవ్వుకొన్నాడట. **ఇది హాసం.**

కృష్ణ విషయక కార్యాలు చేయు ఒక వృద్ధ వనిత శ్రీకృష్ణుని సమీపించి

ఇలా అంది. ''కృష్ణా! నోరు తెరువు. కలకండతోడి మీగడ పెరుగు ఇదిగో!'' కృష్ణుడు అమాయకంగా తన బంగారు నోరు తెరిచాడు. ఆ వనిత కృష్ణుని నోటిలో ఒక గులాబి మొగ్గ పెట్టింది. ఆ పుష్పరసం వగరుగా ఉండి బాలకృష్ణుడు ముఖం వికారంగా పెట్టాడు.

అది చూచి గోపాబాలుడు పకపక పరిహాసంగా నవ్వాడు.

ఒకరోజు నందమహారాజు గృహానికి ఒక మునీశ్వరుడు దయచేశాడు. ఆ యశోద ''ఓ మునిశేఖరా! ఈ బాలుని చేయిచూడు. హస్తరేఖల భవిష్యత్తు చెప్పు. ఈ శ్యామసుందరుని ఆయుష్యం, ఐశ్వర్యం, ధేనుసంపద వివరంగా చెప్పండి'' అన్నది. ఇది చూచి తల్లి అమాయకత్వానికి తనలో తాను వస్త్రం అడ్డుపెట్టుకొని నవ్వుకొంటున్నాడు శ్రీకృష్ణభగవానుడు. **ఇది మధురహాసం.**

ఈ హాస్యరసానికి శ్రీకృష్ణుని యొక్క, తదన్వయ వ్యక్తుల యొక్క వికృత చేష్టలు వాక్కులు వేషాదులు ఉద్దీపనాలు అవుతాయి.

ముక్కు, చెక్కిలి, అధరాలు విశేషంగా స్పందించటంలో అనుభవాలు. హర్షం, అలసత్వం, ఆకారగోపనం ఈ మొదలైనవి సంచారీభావాలు. 'హాసరతి' స్థాయీ భావం.

హాసరతి ఆరు విధాలు.

1. స్మితం, 2. హసితం, 3. విహసితం, 4. అవహసితం, 5. అపహసితం, 6. అతిహసితం.

మొదటి రెండూ మహాపురుషలందు, తరువాత రెండూ స్త్రీలయందు, చివరి రెండు బాలాదులందు వెల్లడియౌను.

విభావాదులందు వైచిత్రి ఘటిల్లి ఉత్తములలోనూ విహసితం వెల్లడియౌను. స్మితంలో దంతములు కనిపించక నేత్ర కపోలాలందు వికాసం వ్యక్తమౌను.

ఒకరోజు కృష్ణుడు ''రే! సుబలా! ఖల వృద్ధురాలు నేను పెరుగు దొంగిలించానని నన్ను పట్టవస్తున్నది. ఇపుడెటు వెళ్ళేది! దారి చెప్పరా!'' అని అంటూ మహాభయం నటించి పరుగెత్తు కృష్ణుని జూచి దేవతలు మునులు మందహాసం చేయసాగారు. వారిది స్మితం.

హసితంలో దంత దర్శనం అవుతుంది. నేత్ర కపోల వికాసాలు మామూలే.

''రాధ భర్తను'' అనుకొనేవాడి పేరు అభిమన్యుడు. అతని తల్లి జటిల జటిల దగ్గరకు అభిమన్యుడు రాబోతుండటం కృష్ణుడు చూచాడు. జటిల వృద్ధురాలు. కృష్ణుడు అభిమన్యుని వేషం వేసుకొని జటిల వద్దకు వెళ్ళి ఇలా అన్నాడు -

''అమ్మా! నేను నీ పుత్రుణ్ణి అభిమన్యుణ్ణి కదా! నా వేషం వేసుకొని హరి వస్తున్నాడు. చూడమ్మా!''

శ్రీకృష్ణుని ఈ మాటలు నమ్మి జటిల కోపంతో కళ్ళెర్రజేసి కర్రతో వానిని మోదసాగింది.

'నేను నీ కొడుకునే. నన్ను కొట్టకే!' అంటూన్ననూ కన్నకొడుకును జటిల వెడల గొట్టి కృష్ణుని ఒడిలోకి తీసుకొంది. ఇది చూచిన కృష్ణస్నేహితులు దంతాలు కన్పించునట్లుగా హసితం చేశారు.

విహసితంలో దంతదర్శనం నేత్ర కపోల వికాసం కాక చిన్నధ్వని వస్తుంది.

ఒకరోజు సుబలాది మిత్రులతో కృష్ణుడు జటిల గృహానికి - పెరుగు దొంగలిద్దామని వెళ్ళాడు. ఆమె నిద్రపోతున్నట్లుగా ఉంది. అప్పుడు కృష్ణుడు ఇలా అన్నాడు. ''సుబలా! సందేహిస్తావు ఏల! మీగడ పెరుగు జుర్రేద్దాము పద! జటిల గుర్రుపెట్టి నిద్రపోతుంది. కదా!'' అని కపట నిద్రలో ఉండి,అది విన్న జటిల పెద్దగా బోసినోటితో నవ్వుతూ లేచింది. **అది విహసిత లక్షణం.**

అతి హసితంలో చేతులు తప్పట్లు కొడుతూ కాళ్ళూ ఊపుతూ బిగ్గరగా నవ్వటం జరుగుతోంది.

కృష్ణ వృద్ధజరతి సంభాషణ.

కృష్ణ : ''అవ్వా! నీ ముఖం ముడతలు పడి వ్రేలాడుతోంది. కనుక నీవు కోతి ముఖం దానివలె ఉన్నావు. నిన్ను పెళ్ళాడాలని ఒక వానర వృద్ధుడు నన్ను సహాయం కోరుతున్నాడు''

జరతి : ''ఈ ముసలిదానికి మతితప్పిపోయిందా ! నేను బలిధ్వంసి మధుసూదనుడు మురారి అయిన నిన్నే వరించాను. మరెవ్వరినీ వరించను.''

ఈ ముసలిదాని మాటలు విని అచటగల గోపబాలికలు గొల్లుమని తప్పట్లు వాయించి, పెద్దగా విరగబడి నవ్వారు. హాసం సాక్షాత్తుగా కలుగక

పోయిననూ విభావాదుల ప్రభావంవలన కలుగుతుంది.

''జటిలాపుత్రీ! నీ వక్షోజాలు ఆనపకాయలవలె ఉన్నాయి. నీ ముక్కు గొండ్రుకప్ప వలె ఉన్నది. నీ చూపులు ఆడతాబేలు చూపులవలె అందంగా ఉన్నాయి. నీ అధరాలు కాలకఠోర కాదంబరాలను తలదన్ని యున్నాయి. నీ ఉదరం పెద్ద మృదంగాన్ని మించి ఉంది. నీయంతటి ప్రపంచసుందరి ఈ లోకంలో ఎవరున్నారు? వేణువు కూడా నీగళాన్ని జయించలేక పోతోంది. నీవు వ్రజసుందరీ సమూహం పుణ్యం వలన ఇక్కడ జన్మించావు.''

అని హాస్య మాడాడు జటిలాపుత్రితో.

భరతుడు నాట్యశాస్త్రంలో హాస్యాన్ని గూర్చి వివరించాడు. నాటక చంద్రికలో కూడా శృంగార రసాలలో వచ్చిన హాస్యం విపులీకరించబడింది.

ఇది గౌణభక్తి రసాలలో హాస్య భక్తి రసలహరి.



ఋుద్రం లో

# అద్భుతభక్తి లహరి

తగిన విభావాదుల కలయిక చేత విస్మయం భక్తులకు ఆస్వాదనీయమైన భక్తిరసం అవుతుంది. అన్ని విధాల భక్తులునూ విస్మయరతికి ఆశ్రయం వం అవుతారు. అలౌకిక క్రియలను సాధించుటకు శ్రీకృష్ణుడే లంబనం. కృష్ణ చేష్టా విశేషమే అద్భుతరసానికి ఉద్దీపనం.

నేత్ర విస్తారం స్తంభం అశ్రువులు పులకలు ఆదిగా గలవి అను భావాలు. హర్షం జడత్వం, మొదలైనవి సంచారీ భావాలు లోకోత్తర కార్యం రూప ;ం గుణ నిరూపణ మున్నగువాని నుండి జనించిన విస్మయం స్థాయీ

ఈ లోకోత్తర కర్మ 1)సాక్షాత్తు 2)అనుమితం అని రెండు భేదాలు.

సాక్షాత్తు - ఇంద్రియ జన్యం సాక్షాత్తు, ఈ సాక్షాత్తులో 1)దృష్టం ం, సంకీర్తితం అను మూడు భేదాలున్నాయి.

:

ద్వారకా నగరంలో ప్రియురాండ్రయిన పట్టమహిషుల మందిరాలలో లంలో ఒకే వేషంతో బహురూపాలలో వ్యాప్తుడై శ్రీకృష్ణుడు విరాజిల్లసాగాడు.

ఇది చూచి నారదమహర్షి విస్మయంతో నోరు తెరచి జడత్వం పొందాడు.

ఒకేసారి ఒకే దేహంతో ఒకే కృష్ణుడు పదునారువేల భార్యల గృహాలలో రుగా వారిని వివాహం చేసుకొన్నాడు. ఇది ఆశ్చర్యకర విషయం. కాయ

వ్యూహం ధరించు శక్తిగల నారదునికే భగవత్ చర్య ఆశ్చర్యం కలుగజేసింది. కృష్ణుని అలౌకిక కర్మలు అనేకం.

యశోద ఒడిలో పాలు కుడిచే బాలుడెక్కడ! గగనం తాకే శిఖారాలు గల గోవర్ధన పర్వతం ఎక్కడ! ఆ కొండను ఆటబంతి వలె ఎడమ చేతితో ఎత్తి పట్టుకొన్నాడు. అనగా ఆశ్చర్యాతి ఆశ్చర్యం కదా! ఇది ఇంద్రజాలమా! అన్నట్లున్నది.

అమిత విహారుడీశ్వరుడనంతుడు దానొకనాడు మంచి ల
గ్నమున పదారు వేల భవనంబులలోన పదారు వేల రూ
పముల పదారువేల నృపబాలల ప్రీతి పదారు వేల చం
దముల విభూతి నొందుచు యథావిధితో వరియించె భూవరా!

నన్నేపాయడు రాత్రులన్ దినములన్ నన్నే కృపం జెందెడిన్
నన్నే దొడ్డగ జూచు వల్లభలలో నాథుండు నా యింటనే
ఉన్నాడంచు పదారు వేలు తమలో ఊహించి, సేవించి, రా
యన్నుల్ గాఢ పతివ్రతాత్వ పరిచర్యా భక్తి యోగంబులన్

– పోతన

ఒకరోజు 'మన్ను తిన్నావని అన్న అంటున్నాడు. నీవు మన్నేల తిన్నావు. నోరు తెరు, అన్నది యశోద కృష్ణుని చేయి పట్టుకొని. అపుడు బాలకృష్ణుడు నోరు తెరిచాడు, ఆ నోటిలో –

ఆ లలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశిది
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్

కనుగొని,

కలయో! వైష్ణవ మాయయో! యితర సంకల్పార్థమో! సత్యమో!
తలపన్నే రకయున్నదాననో! యశోదాదేవి గానో! పర
స్థలమో! బాలకుడెంత! ఈయని ముఖస్థంబైయజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువో! మహాశ్చర్యంబు చింతింపగన్
బాల మాత్రుడగు సలీలుని ముఖమందు
విశ్వమెల్ల నెట్లు వెలసి యుండు

బాలు భంగి నితడు భాసిల్లు గాని స
ర్వాత్ము డాదివిష్ణుడగుట నిజము

-పోతన.

**శ్రుతం:**

శ్రీకృష్ణుడు సత్యా సమేతుడై నరకాసురునితో యుద్ధం చేయసాగాడు. నరకాసురునివి పదకొండు అక్షౌహిణుల సైన్యం. సత్యభామ కొంతవరకు యుద్ధకళా పాండిత్యం చూపి యుద్ధం చేసింది.

శ్రీకృష్ణుడు మూడు బాణాలు మాత్రం వేసి, పదకొండు అక్షౌఃణుల సైన్యంతో నరకాసురుని సంహారం చేశాడు. ఇట్టి శ్రీకృష్ణుని ప్రభావం విని పరీక్షిన్మహారాజు కన్నులు పెద్దవి చేసి ఆశ్చర్యం ప్రకటించాడు. ఇది కృష్ణ మహత్వం వినినందువలన పరీక్షిత్తుకు కలిగిన ఆశ్చర్యం.

**సంకీర్తితం-**

సత్యలోకంలో బ్రహ్మ తన అనుభవంచెప్పి ఆశ్చర్యపోయి అందరనీ ఆశ్చర్య పరిచాడు.

''కృష్ణుడు, కృష్ణ మిత్రులైన గోపకులు పీతాంబరులు, నీలమేఘ శ్యామ కాంతి తనూ విలాసులు, చతుర్భుజులు. కృష్ణుని మందలోని గోవులు వత్సాలు కూడా ఇట్టివే.''

ఈ విషయం విన్నంతనే నా దేహం స్తంభ దశ పొందింది. నేను వివశుడనై పోయాను.

ఆ బాలురు ఆ గోవులు బ్రహ్మాండ నాయకులు. బ్రహ్మాదులు వారిని జేరిస్తవం చేయసాగారు. ఆ బ్రహ్మలలో నేను ఒక చిన్న రకం బ్రహ్మను.

బ్రహ్మ విస్మయంతో కృష్ణుని ఈ విధంగా వినుతి చేశాడు.

''కృష్ణా! త్రి జగతీ నాయకా!

మాయలు కల్గు వారలకు మాయలు బెట్టెడి ప్రోడ! నిన్ను నా
మాయ గలంచి నీ మహిమ మానము జూచెదనంచు నేరమిన్
జేయగ బూనితిన్ కరుణ సేయుము కావుము యోగిరాజు వా
గ్గేయ! దవాగ్ని దజ్జనిత కీలము గెల్చి వెలుంగ నేర్చునే

ఒకడై యుంటివి బాల వత్సములతో ఒప్పారి నీవంతటన్
సకలో పాసితులౌ చతుర్భుజులునై సంప్రీతి చే గొల్వగా
ప్రకట శ్రీగలవాడ వైతి విపుడున్ బ్రహ్మాండముల్ సూపి ఒ
ల్లక యిట్లొక్కడ వైతి నీ వివిధ లీలత్వంబు గంటిన్ గదే!

ఏలా బ్రహ్మ పదంబు? వేదములకున్ వీక్షింపగా రాని ని
న్నీలోకంబున ఈ వనాంతరమునం దీమందలో కృష్ణ యం
చాలాపాది సమస్త భావములు నీ యందే సమర్పించునీ
వ్రేలందొక్కని పాద రేణువులు పై వేష్టించినన్ జాలదే

ఏ మహాత్ముని మాయ ఈ విశ్వ మంతయు
మోహితాత్మకమయి మునిగి యుండు
అట్టి విష్ణుమాయ అర్భకు లొక్క యే
డెరుగ కుండిరనుట ఏమి వెఱగు?

**అనుమితం**

కృష్ణుడు దావానలం నుండి భాండీర వటవృక్షాన్ని గోవులను గోపాలురను రక్షిస్తుండగా వ్రజ బాలురు కళ్ళార చూచి మహా చమత్కారం అని అభివర్ణించారు.

ప్రేమ లేని వారికీ, ద్వేషపూరితులకూ, కృష్ణ కార్యకలాపాలు విస్మయం కలిగించవు. ప్రేమ గలవారికి విస్మయం కలిగిస్తాయి. ఇది సార్వత్రిక విషయం. ఈ సిద్ధాంతం స్థిరీకరించబడినట్లైతే కృష్ణ కార్యాలు విస్మయం కలిగిస్తాయి.

జీవ గోస్వామి అంటాడు కదా - శ్రీకృష్ణుని యందే అద్భుత రసం సముద్భూతం కాగలదు. అన్ని రసాలు అద్భుత రసంలో ప్రతిష్ఠితమైనాయి.

ఈ విస్మయరతికి అనుగ్రహ మాధుర్యం విషయం. చమత్కారం రససారం. చమత్కారం లేని సత్కావ్యం రసశూన్యం. కనుక చమత్కార పూర్ణ విస్మయమే అన్ని రసాలను పోషించి, ఆస్వాదనమవుతుంది.

అది అద్భుత భక్తిరసలహరి.

ఉత్తర సముద్రం లో

# వీరభక్తి లహరి

ఉచిత విభావాదుల సహకారం ద్వారా ఉత్సాహరతి స్థాయీ భావరూపం వహించినచో 'వీరభక్తిరసం' అంటారు.

ఈ రసంలో యుద్ధవీరం, దానవీరం, దయావీరం, ధర్మవీరం అనే భేదాలతో భక్తులు ఆలంబనంగా ఉటంకించబడింది. ఒక భక్తునిలో యుద్ధోత్సాహం మరొకనిలో దానోత్సాహం మొదలైన రూపాలలో ఉత్సాహం అందరి భక్తులలో వ్యక్తమవుతుంటుంది.

1. యుద్ధవీరం - శ్రీకృష్ణునకు ఉత్సాహం కలిగించాలని సఖులు, బంధువులు, యుద్ధవీరులుగా పేర్కొనబడతారు. ముకుందుడే ఒక్కొకసారి ప్రతి యోద్ధగా ద్రష్టగా లేక ఉత్తమ మిత్రుడుగా సమయాన్ననుసరించి పాత్ర వహిస్తుంటారు.

ఒక మిత్రుడు ఇలా అంటాడు. 'మాధవా! నీవు ఎవ్వరి చేత, ఓడింప బడనని గర్విస్తున్నావు. నేడు నేను నిన్ను హఠాత్తుగా ఓడించి, మిత్రుల ప్రశంసలు అందుకొంటాను. చూడు. కానీ నీవు మోసం చేసి యుద్ధం విరమించ బోకు. ఓటమి రుచి చూడవోయి.'

ఒకసారి శ్రీదాముడు శ్రీకృష్ణుడు గాఢ మిత్రులైననూ యోధ ప్రతియోధుల రూపంలో కాళిందీ తీరంలో నలువురు చూస్తుండగా అహంకారంతో

అహమిహకలతో భయంకర యుద్ధం చేశారు. సుహృద్వరుడు శ్రీకృష్ణుడు. ఒకసారి క్రీడా యుద్ధంలో సఖులు అసంఖ్యాకంగా నిలిచి, నాల్గు వైపుల నుండి దామునిపై బాణాలు విసర సాగారు. కౌశలం చూపి దాముడు ఒక్క కర్రతో నేర్పుగా బాణాలు తగలకుండ తప్పించుకొని ఇవతలకు వచ్చాడు.

దాముడు ఒక్క కర్రనే పంజరంవలె త్రిప్పి పలుబాణాలనుండి తప్పుకోగలిగాడు. అదిచూచి కృష్ణుడు పులకిత గాత్రుడైనాడు. అపుడు కృష్ణుడు దాముని యుద్ధ కళాకౌశలాన్ని బహువిధాల ప్రశంసించాడు.

సహజంగా శూరవీర శిఖామణులకు యుద్ధకళా కౌశలం తమలో తాము ప్రదర్శించుకొందామని ఉత్సాహం కలుగుతూవుంటుంది.

ఒకమాటు శ్రీకృష్ణుడు కుంతీదేవికి వినోదంగా అర్జునితో యుద్ధం చేసి ఓడించాడు.

ఆత్మశ్లాఘం, ఆస్ఫోటం, స్పర్థ, విక్రమం, అస్త్రగ్రహణం మొదలైనవి ప్రతియోధుల వాక్కుల ద్వారా బోధ విషయమై వీర రసంలో ఉద్దీపనాలు అవుతాయి.

ఒక మిత్రుడు అంటున్నాడు. దామోదరా! నీవు కేవలం భోజన పరాక్రమ శాలివే. స్త్రీ వ్యసన శీలుడైన సుబలుని యుద్ధంలో జయించానని ఊరక ఆత్మశ్లాఘం చేసుకోబోకు. గప్పాలు కొట్టుకోవటం మానుకో. నీ భుజ భుజంగ దర్పం అణుగుతుంది. కృష్ణుడనే కలాపి ఇక్కడే నృత్యం చేస్తున్నాడు చూడు.

ఈ ఆత్మ శ్లాఘాది కత్థిత ప్రగల్భాలు అనుభవాలు, ఇవికాక ఆహో పురుషికం, క్ష్వేడితం, ఆక్రోశం, యుద్ధగతి విశేషం, యుద్ధ ప్రయత్నం, యుద్ధభూమిలో నిలబడుట, శరణన్న వానికి అభయ మొసగుట మొదలైనవి కూడా అనుభవాలు అని విజ్ఞులు పేర్కొంటారు.

కత్థితానికి మరొక ఉదాహరణ – కేశిసూదనా! నేను భద్రసేనుడను. నా ప్రభావం నీవెరుగవా! బలరాముడు నాముందు బహుదుర్బలుడు. ఎవరితోనో నీవు యుద్ధం చేస్తాను అంటావేమిటి! నీకు యుద్ధోత్సాహం ఉంటే నన్ను నా భుజాలు చూచి యుద్ధం చేయి.

నా దివ్య భుజదండాలు చూచి ప్రతియోధులు సిగ్గు పడుతున్నారు.

అహోపుషిక అంటే అహంకారంతో తన శక్తిని వెల్లడి చేయుట. ''నేనే గొప్ప యోధుడను. నీవు చాల బలహీనుడవు'' అను ఆక్షేపంతో వ్రజ సముద్రం ఉంది. ఆవ్రజ సముద్రానికి చంద్రుని వంటి వాడు శ్రీకృష్ణుడు. ఆ కృష్ణుడు తన ఆనందానికి హేతుభూతమైన బహు యుద్ధానికి నడుం బిగించాడు. సుదాముడు పులకరించాడు. ఉత్కంఠతతో నాట్యం చేయసాగాడు. సింహనాదాలు చేశాడు.

అట్టి సుదాముని 'అహా పురుషిక' మాటి మాటికి జయమొందుగాక!

**ఇది వ్రజ బాలుర ఉత్సాహారతి.**

బహుప్రదం రెండు విధాలు. 1. అభ్యుదయకం, 2. తత్సం ప్రదానకం.

అభ్యుదయికుడు - శ్రీకృష్ణ అభ్యుదయార్థం భిక్షు తన బ్రాహ్మణ దీనులకు సర్వం దానం చేయువాడు. శ్రీకృష్ణ జన్మదినోత్సవ వేళ విశుద్ధ హృదయంతో నందరాజు బ్రాహ్మణాదులకు ఉత్తమోత్తమ గోవులను దానం చేశాడు. దానితో తృప్తి చెంది, బ్రాహ్మణులు ఏక కంఠంతో ''ఇపుడు నృగ మహారాజు దానకీర్తి లుప్తమయింది'' అన్నారు.

తత్సంప్రదానకుడు - శ్రీహరి తత్త్వం ఎరిగి అహంకార మమకారాల నన్నింటిని దానం చేయువాడు. ఇది రెండు విధాలు. 1. ప్రీతి, 2.పూజ.

బంధు రూపుడైన హరికి దానమీయుటం ప్రీతిదానం ధర్మరాజు రాజసూయం పూర్తిచేశాడు. ఆ సందర్భంగా శ్రీకృష్ణదేవుని ప్రీతి పూర్వకంగా అర్చించాడు. శ్రీకృష్ణునకు శ్రీగంధం విలేపనం చేశాడు. వైజయంతిమాల అలంకరించాడు. సువర్ణ పీతాంబరాలు సమర్పించాడు. మణులు రత్నాలు తెచ్చి పాదపూజ చేశాడు. రాజ్యం భాగ్యం కుటుంబం తన్నుతాను దానం చేసుకొన్నాడు. అన్నీ యిచ్చాడు. 'స్వామికి నేను కొంచమే ఈయకలిగానే' అని వ్యాకుల చిత్తుడయినాడు. ఇది సంప్రీతి దానోత్సాహరతి.

పూజాదానం - బ్రాహ్మణ రూపుడగు భగవంతున కిచ్చునది పూజాదానం.

**పూజాదానం**

బలిచక్రవర్తి వామన బ్రాహ్మణ రూపుడైన విష్ణువుకు దానంచేస్తున్నాడు. శుక్రాచార్యులకు జ్ఞానం ఉపదేశిస్తాడు -

''ఆచార్యా! వేదవిహితంగా యజ్ఞయాగాదులలో నీ వంటి వారెల్లరు సాదరంగా శ్రీమహావిష్ణువును ఆరాధిస్తారు కదా! అట్టి విష్ణువు వచ్చి నాకు, వరాలీయనీ

ఈయన శత్రువుగా మరేదైనా చేయనీ నేను ఆయక కోరిన భూదానం మూడడుగులు తప్పక దానం చేస్తాను సుమా!

శ్రీదేవిని లాలించిన హస్తం నాముందు భిక్షకు వస్తే కాదనుటెట్లు అది నాకెంత అదృష్టం! నా చేయి పైనే కదా!

ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై అంసోత్తరీయంబుపై
పాదాబ్జంబులపై కపోలతటిపై పాలిండ్లపై నూత్న మ
ర్యాదన్ జెందు కరంబు క్రిందగుట మీదై నాకరంబుంట మేల్
కాదే! రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే!

కారే! రాజులు రాజ్యముల్ గలుగవే! గర్వోన్నతిం బొందరే!
వారేరీ! సిరి మూట గట్టుగొని పోవంజాలిరే! భూమిపై
పేరైనన్ గలదే! శిబిప్రముఖులుం ప్రీతిన్ యశః కాములై
ఈరే కోర్కులు వారలన్ మరచిరే ఇక్కాలమున్ భార్గవా!

నొడివినంత పట్టు నుసలక ఇచ్చుచో ఏలకట్టు విష్ణుడేటి మాట? అని గురువుగారికి సమాధానం చెప్పి శ్రీవిష్ణువుకు దానం చేస్తాడు. త్రిభువనాలు ఆశ్చర్యంచెందాయి. ఇది పూజాదానం. దాన కరుణించు విడుచును. విడువకుండ నిమ్ము విమల చరిత!

ఉప స్థిత దురాపార్థత్యాగి అనేది అతి ప్రౌఢ దాస్యభావ విశేషమే. ధుర్యుడు, ధీరుడు, వీరుడు ఈ మూడు విధాల పార్షదులలో మహాభక్తులు 'వీరుడు' పదవి పొందుతారు. వీరు ముక్తు లిస్తామన్నాపోరు.

## దయావీరుడు

దయార్ద్ర హృదయంతో తనదేహాన్ని ముక్కలు ముక్కలుగా కోసి కృష్ణార్పణం చేసినవాడు దయావీరుడు. బాధలు మొదలైనవి దయావీర రసానికి ఉద్దీపాలు. తన ప్రాణాలను సైతం లెక్కగొనక విపన్నులను కాపాడుట, ధైర్య వచనాలు పలుకుట, మున్నగునవి అనువావాలు. ఔత్సుక్యం, మతి, హర్షం, సంచారీ భావాలు. దయోత్సాహరతి స్థాయీ భావం. అధిక దయామయ ఉత్సాహమే దయోత్సాహం.

ఈ దయా వీరులలో మయూర ధ్వజుడు మణిపూస వంటివాడు. భగవంతుడు బ్రాహ్మణ వేషంలో వచ్చి 'నీ శరీరంలోని సగభాగం నాకు కావాలి'

అంటాడు. అందుకు అంగీకరించి, ఇది నా అదృష్టం అని సంతసించి, భార్యను ఒకవైపు పుత్రులను ఒకవైపు నిలిపి తన శరీరాన్ని కోయించి, తన మస్తకం తానే ఖండించి, బ్రాహ్మణునకు దయా దానం చేశాడు.

మాంధాత, శిబి చక్రవర్తి కూడా అట్టి వీరులే!

మయూర ధ్వజాదులకు 'వచ్చినది బ్రాహ్మణుడు కాదు శ్రీహరియే' అని నిజం తెలిసిన దయ ఉండెడిది కాదు. దయలేనపుడు వారు దాన వీరులవుతారు. మయూర ధ్వజాదులు విష్ణు భక్తి పరాయణులైన కృష్ణభక్తులు. బోపదేవాది పండితులు దయావీర దానవీరులను అనుసరించి, వీరరసాన్ని మూడు రీతులుగా స్వీకరించారు.

**ధర్మవీరుడు.**

శ్రీహరిని సంతోషపెట్టుట అనే ధర్మంపై శాస్త్ర శ్రవణం చేయుట గానంచేయుట మొదలైనవి ధర్మవీర రసంలోని ఉద్దీపనాలు. నీతి, ఆస్తిక్యం, సహరనం, యమ నియమాదులు అనుభావాలు, మతి, స్మృతి సంచార భావాలు. ధీరులు ఈ రసంలోని ధర్మోత్సాహరతినే స్థాయీభావం అన్నారు. ధర్మమందు అభినివేశం కలిగియుండుట ధర్మోత్సాహం.

"దైత్య నాశకా! కృష్ణా! నిన్ను సంతోష పెట్టుటకై ధర్మరాజు అగు యుధిష్ఠిరుడు తన పట్టణం నిత్యం యజ్ఞయాగాలు చేస్తూ ఇంద్రుని ఆహ్వానించేవాడు. ఇంద్రుడు వెళ్ళుతుండేవాడు. ఇంట ఉండకుండ ఇలా వెళ్ళుటచే శచీదేవికి పతి విరహం అధికమయింది. ఆ పురంధ్రి విరహతాపంతో ఎడమచేతిని చెక్కిలిపై చేర్చి వ్యాకుల పడుతుండేది.

యజ్ఞం అంటే పూజా విశేషమే. కృష్ణుని అంగభూతుడు ఇంద్రుడు కనుక యజ్ఞంలో ఆహూతులను ఇంద్రునికి సమర్పిస్తారు. కృష్ణ ఆదేశంతో ధర్మరాజు ప్రతి యజ్ఞమూనూ ధర్మంగా చేస్తుండేవాడు.

ధనికాది మహాపండితులు దానాది త్రివిధ వీరాలను స్పష్టంగా స్వీకరించారు. ప్రత్యేకంగా ధర్మవీరాన్ని పేర్కోలేదు.

ఇది వీరభక్తి లహరి.

ఉత్తర సముద్రం లో

# కరుణ భక్తి లహరి

ఆత్మోచిత విభావాదుల కలయికచే శోకరతి భక్తులలో పుష్టి పొంది కరుణ భక్తి రసం అవుతుంది.

అవిచ్ఛిన్న రూపుడగు శ్రీకృష్ణుని యందు ప్రేమ విశేషంగా ఉండుట వలన అభీష్ట ప్రాప్తికి తగిన స్వరూపం కలిగిన వాడగుటచే కృష్ణుడు కరుణ రసానికి విషయమై యున్నాడు.

శ్రీకృష్ణుడు బాంధవులు, ప్రియులు, మిత్రులు, కరుణ రసానికి విషయమై యున్నారు. కనుక కరుణ భక్తిరసానికి మూడు విషయాలంబనాలున్నాయి.

శాంత భక్తులందు తరచుగా కరుణ రసముండదు. శ్రీకృష్ణుని కర్మలు గుణాలు రూపవిలసాలు ఈ కరుణ రసంలో ఉద్దీపనాలు. నోరు ఎండుట, దుఃఖించుట, శరీరం శిథిలమగుట, శ్వాస అతిశయించుట, చీత్కారం కల్గుట, నేలపై పడుట, తన్నుకొనుట, రొమ్ము బాదుకొనుట అను భావాలు.

సాత్త్వికి భావాలు ఎనిమిది - జాడ్యం, నిర్వేదం, గ్లాని, దైన్యం, చింత, విషాదం, ఔత్సుక్యం, చాపల్యం, ఉన్మాదం, మృత్యువు, ఆలస్యం, అపస్మారం, వ్యాధి, మోహం ఈ మొదలైనవి సంచారీ భావాలు.

అనిష్ట ప్రాప్తి ప్రతిరూపమైన శోకత్వాంశం. పరిణితి పొందినరతి శోకరతిగా పరిగణింతురు. ఇది కరుణ భక్తి రసానికి స్థాయీ భావం.

తమ మనస్సులను ఆత్మలను సర్వస్వమునూ, ఆత్మీయులనూ,

కళత్రాలనూ, వాంఛలనూ, సంపదలనూ, సమస్తమూ కృష్ణదేవునకు సమర్పించిన ప్రియ సఖులు బంధుజనులు అందరు గోకుల మాకులంగా జేరి కాళీయ సర్పంచే చుట్టబడి నిశ్చేష్టుడైయున్న బాలకృష్ణను జూచి దుఃఖం, పశ్చాత్తాపం, భయంవలన హతబుద్ధులై భూమిమీద పడిపోయారు.

దారుణ కాళియ హ్రదంలోకి కృష్ణుడు దూకాడు అనగానే, యశోద పెల్లుబికిన దుఃఖంతో వేడి కన్నీటిచే తడిసిన పైట కలదియై, రోదిస్తూండిపోయింది. ఇంద్రియవృత్తులు అన్నీ స్తంభించాయి. ఒక విషమ స్థితిని పొందింది ఆతల్లి. దీనికి ఆలంబనం శ్రీకృష్ణుడు.

ఒకసారి శ్రీకృష్ణ ప్రియురాండ్రు అయిన రాధాదులను, శంఖచూడుడు పరాభవించసాగాడు. అపుడు బలరాముడు అంతటి వాడు ఏమీ చేయలేక పోయాడు. ఆయనకు చంద్రబింబం నల్లబడిపోయింది. ఇది శోకంలో వైవర్ణ్యం. సాత్త్విక భావం. వీరు ఆలంబన భక్తులు.

''ఓ హంసా! నీవు విష్ణుచరణ చిహ్నాలను అనుసరించి, పొమ్ము. బ్రహ్మ వ్రజబాలురను అపహరించి, అపరాధం చేసి కృష్ణుని సంగతి తెలిసికొని కృష్ణుని పాదాలు పట్టి విలపించాడు. బ్రహ్మ అప్పటి నుండి కృష్ణపాద పద్మాలపై తన నాల్గు తలలు మోపి క్షమాపణ వేడుకొన్నాడు.

అట్టి శ్రీకృష్ణపరమాత్మ పాద నఖాలు చూచి, పరమానందం చేత విహ్వలుడై దేవర్షియైన నారదుడు స్వజాతిత్వంచేత ప్రియులై, సాయుజ్యం పొందిన మునులను గురించి శోకించటం ప్రారంభించాడు.

సాంసారికులు మహాత్ముల అనుగ్రహం పొంది భగవత్పాదపద్మమాధుర్యం అనుభవించ కల్గుతారు. కానీ, విముక్తులు అట్టి సౌకర్యం పొందలేరు. కనుక దేవర్షి నారదమహర్షి సాయుజ్యంపొందిన మునులను గూర్చి శోకించాడు. సాయుజ్యం పొందవచ్చు కానీ కృష్ణపాదపద్మమాధుర్యం పొందటం దుర్లభం.

ఒకసారి సహదేవుడు గోవింద చరణారవిందాల మాధుర్య స్ఫూర్తిపొంది, ఆనందవిహ్వలుడై ఆనందంపట్టలేక ఇలా విలపించాడు. అమ్మా! మాద్రీ! ఇపుడు ఎక్కడున్నావమ్మా! తండ్రీ! నీవు ఏలోకాలకు వెళ్ళావు! ఆహా! ఇక్కడ ఇప్పుడు శ్రీకృష్ణదేవుని నిబిడానందదాయకాలైన పాదపద్మాలు చూడలేక పోయినారు కదా!

ఎంత సుఖదాయకాలు! అవి.

వీరందరు ఆలంబనులైన స్వప్రియ జనులు.

శ్రీకృష్ణ మహైశ్వర్య జ్ఞానం గలచోట కృష్ణునిపై అనిష్టం ఉండదు. అనిష్టం లేక పోతే శోకోత్పత్తి ఉండదు. ఐశ్వర్య విషయంలో అజ్ఞానం గాఢప్రేమ విశేషం వల్లనే కలుగుతుంది. అవిద్య. ద్వారా కలుగదు. మాయతీతుడైన సిద్ధ భక్తునిలో అవిద్యకు అధికారం లేదు.

కృష్ణప్రేమ ఉత్కటతను పొంది, ప్రాదుర్భవించిన శోకం అనిర్వచనీయ సుఖానికి అతీతాంగా ఉండి ఉత్తమ గతికి ఆధారమవుతుంది. కానీ రౌద్ర, భయానక, బీభత్స గౌణరసాలు భక్తికి సన్నిహితాలుకావు.

ఇది భక్తి రసామృత సింధువు. ఈ సింధువును తెలుగు మెరువు నిద్దంపుటద్దంలో చూపాను. ఇది 1552 లో రూపగోస్వామి చేత గోకుల బృందావనంలోని భజన స్థలంలో వెలువడిన పవిత్ర గ్రంథం. ఇది చైతన్య ప్రభువుకు ప్రియమైన గ్రంథం. ఇది 'కృష్ణ భక్తి' గా మలచబడింది.



# త్రిపుటి

# అభినందన సందేశం

సికతాపి సితా వసుధా
సముద్భవ సుధా భవేచ్ఛ యద్బంధో
భక్తి రసామృత సింధో
స్పర్శేన నమామి తం వచోఽతీతమ్

'భక్తిరసామృత సింధువు' అనే యే బంధువు యొక్క స్పర్శ చేత ఇసుక చక్కెరగా మారుతుందో అవని అమృతానికి ఆశ్రయమవుతుందో వాక్కులకు అందరాని వానికి నమస్కరిస్తున్నాను. సాయికృష్ణ పరమాత్మకు అభివందనాలు.

ఆయన భక్తి రసమనే అమృత సముద్రం. ఉప్పునీటి సముద్రం స్పర్శ వలన తీరస్థమయిన ఇసుక ఉప్పగా ఉంటుంది. అదేవిధంగా అమృతంలో నిండిన సముద్రం యొక్క స్పర్శవలన భూమి అమృతత్వం పొందుతుంది. ఇసుక తియ్యని చక్కెరగా మారుతుంది. ఆ విధంగా మార్పుచేసే, మహిమచూపే మహానుభావుడు మాటలకు అందడు. అయినప్పటికీ మనస్సు ద్వారా పట్టుకొని మాటల సాయంతో కృష్ణస్వామిని సేవించుకోవాలి.

భక్తిరసమే అమృత సింధువు. ఒకవిధంగా ఇదే సుస్పష్టమైన, నిర్దిష్టమైన అర్థం కావచ్చు. ఎందువల్లనంటే భక్తిని రసంగా ప్రతిపాదించటమూ, ప్రతిష్ఠించటమూ, ఆయన లక్ష్యం.

రసచర్చ అలంకార శాస్త్రానికి సంబంధించిన విషయం. 'నాట్యం రసాశ్రయం' అని అన్నపుడు దృశ్యకావ్య ప్రపంచంలో కూడా రస ప్రసంగం స్థానం చేసుకున్నది. 'కవిత్వం రసవంతంగా ఉంది' అని అన్నపుడు రస ప్రసంగం స్పష్టమే. ''వాక్యం రసాత్మకం కావ్యం'' అన్నప్పుడు రసం లక్షణంలోనే లక్షణంగా వచ్చి కూర్చుంది. అందుచేత సాహిత్య శాస్త్రజ్ఞులు రసవివేచన చేశారు. ఈ వివేచనలో కొందరు శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత, రసములను ఎనిమిదింటిని పరిగణించారు. కొందరు శాంతమును కూడా కలిపారు. కొందరు శాంతమే ప్రధానరసం అన్నారు. మరికొందరు శృంగారమే రసరాజం అన్నారు. కొందరు కరుణ రసమొక్కటే రసమన్నారు. కొందరు ప్రేయోరసం, వాత్సల్యరసం మొదలైనవి ఇంకా కలిపారు. లొల్లటుడు ''అనంతా వైరసాః'' అని రసాలు అనంతంగా ఉన్నాయని ఉటంకించాడు.

మరి 'రసోవైసః' అని కీర్తింపబడిన భగవంతుణ్ణి ఆశ్రయించుకున్న రసమేమిటి? అదే భక్తిరసం.

రసమన్నప్పుడు స్థాయి భావాన్ని చెప్పాలి. ఇదే విభావ, అనుభావ, సంచారీ భావముల చేత రసమవుతుంది. శృంగారానికి స్థాయియైన రతినే శ్రీరూపగోస్వామి భక్తికి స్థాయిగా చెప్పారు. అలంకార శాస్త్రంలో ఉండే విభావాదుల నన్నింటినీ లక్షణ పూర్వకంగా లక్ష్యం ప్రదర్శిస్తూ భక్తి రసాన్ని సాంగోపాంగమంగా ప్రతిష్ఠ చేశారు. ఇంతే కాక భక్తి అంటే ఏమిటో విశదంగా స్వభావ భక్తి, సాధన భక్తి, ప్రేమభక్తి మొదలైన అంతర్భేదాలతో సోదాహరణంగా నిరూపించారు. శాంతరసం, సఖ్యరసం, వత్సలరసం, హాస్యరసం, అద్భుతరసం, వీరరసం, కరుణరసం వివరించారు.

అలంకార విద్యార్థికి పై సంగ్రహ పరిచయం సంతృప్తి కలిగించదు. అన్యులకు ఇంతకు మించి చెప్పితే భారమెక్కువై అసంతృప్తిని కలిగించవచ్చు. అందువల్ల ఈ మాత్రం సూత్రం అందించడం చాలు అని అనుకుంటున్నాను. అస్తు.

ఇప్పుడొక విషయం చూద్దాము. అలంకార శాస్త్ర గ్రంథాలను అనేకులు అనువదించారు. కొందరు మూల గ్రంథంలోని శ్లోకాల్ని పద్యాలుగానూ, వచన భాగాలను వచనంగానూ ఆంధ్రీకరించారు. కొందరు లక్షణం సంస్కృతంలో ప్రదర్శించి, తెలుగులో వివరించి లక్ష్యమయిన శ్లోకాన్ని తెలుగు పద్యంగా అనువదించారు. ఇదంతా సామాన్య పాఠకునికి భార భూతమవుతుందనడంలో ఎంత మాత్రమూ అతిశయోక్తి లేదు.

పై విషయాలన్నీ విస్పష్టంగా గ్రహించుకున్న వివేచనాపరులు రసతత్పరులు శాంతిశ్రీ గారు. వారు అనేక గ్రంథాలను సృష్టి చేశారు. అనేక గ్రంథాలకు అను సృష్టి చేశారు. వారు కవులు, వ్యాఖ్యాతలు, వక్తలు, భక్తులు. శాంతిశ్రీ గారు రచనలోని అందచందాల్నే కాక సహృదయ పాఠకుని అలపు సొలపుల్ని కూడా అంచనా వేయగల దక్షులు. రచయితకు నచ్చినంత మాత్రాన పాఠకునికి కూడా నచ్చుతుందని చెప్పడం కష్టం. పాఠకుని నాడి తెలిసినవాడు తగిన రీతిలో ఒక మంచి విషయానికి తాను ఆకర్షించబడి చక్కని వ్యాఖ్య చేస్తాడు. శ్రీజంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి గారికి బాగా తెలిసివుంటుందని నా అభిప్రాయం.

శాంతిశ్రీ గారు సుగంధపుష్పాలతో ఆంధ్ర భారతిని ఆరాధించి, అలరించిన సుకృతి వతంసులు.

వీరు తమ పండిన అనుభవంతో భక్తిరసం నిండిన గుండెతో **'కృష్ణభక్తి'** తెలుగు తల్లి ముంగిటికి తెచ్చారు. అపురూపమైన అమృతాన్ని అందరి అంగిటికి అందించారు.

నాకు తెలిసినంతవరకు భక్తిరసామృత సింధువును ఇంతవరకు శ్రీ జొన్నాభట్ల వాసుదేవశాస్త్రిగారు ఒక్కరు మాత్రమే అనువదించారు. వారు మూల గ్రంధాన్నంతటినీ తెలుగులిపిలో ఇస్తూ తమ అనువాదాన్ని పూర్తిగా వచనంలో ఇచ్చారు. మూలవిధేయంగా వున్న ఆ గ్రంథం ముచ్చటగానే ఉంది. కారణం గ్రంధనిర్మాణంలోనే ఉంది. వేరే అనువాదాలు లేకపోవటానికి కారణమేమిటి? ఈ ''భక్తిరసామృత సింధువు'' గ్రంథమా! అలంకార గ్రంథమా! భక్తి గ్రంథమని భక్తులూ, అలంకారశాస్త్రగ్రంథమని శాస్త్రాధ్యేతలూ భావించారు. ఉపాదేయం అనుకున్నప్పుడు వేరే ఉపాయాన్ని ఆలోచించ వలసిన అవసరం లేదు.

శాంతిశ్రీగారు భక్తిరసామృత సింధువులో తలమునకలుగా మునిగి తేలియాడి ఓలలాడి ఉంటారు. ఆ పారవశ్య మధురానుభవానికి పరులకు కూడా దారి చూపాలి. ఆ ఆనందాన్ని తాము మాత్రమే 'అమృతమస్తు' అని అనుభవించడం స్వార్థమని అనుకుని ఉంటారు. అందువల్ల పరార్థం, పరమార్థం సాధించే ప్రయత్నం చేశారు. ''అనభ్యాసే విషం శాస్త్రం'' నిత్యాభ్యాసం లేకపోతే శాస్త్రం విషం వలె ఉంటుంది. శాస్త్ర విషయాలను అభ్యాసం చేస్తుంటే అంతరార్థ సౌందర్యం దర్శించగల్గుతారు. అది అమృతమవుతుంది. శాంతిశ్రీ గారు అందుకున్న కలాన్ని భక్తి మార్గంలో నడిపించి, మూల గ్రంథంలోని ఉదాహరణల్ని సరసంగా సందర్భ సముచితంగా అనువదించడమే కాకుండా పోతన్నగారి భక్తిరస స్రోతస్సులైన పద్యాలను అదనంగా ఉదహరిస్తూ, దీన్ని సాక్షాత్తు రససింధువుగానే తీర్చిదిద్దారు. పాఠకులు కళ్ళతో చూస్తున్నారో! చెవులతో వింటున్నారో! కళ్ళే చెవులుగా చేసుకొని శేషత్వం వహించి, శేషశాయిని తన్మయత్వంతో తలుస్తున్నారో! పిలుస్తున్నారో! చెప్పలేము. శాంతిశ్రీ గారి లేఖినికున్న ఆ సమ్మోహన శక్తికీ, సంగీతాత్మక రక్తికీ నమోవాకాలు.

ఈ గ్రంథంలో ప్రార్థనాత్మక నాందీ రూపంగా శాస్త్రి గారు ఈ విధంగా వ్రాశారు.

''శ్రీకృష్ణ చంద్రుడు అఖిల రసామృతమూర్తి. ఆ స్వామి సౌందర్య కాంతి చంద్రికా ప్రసారాలచేత అసంఖ్య తారకల వంటి గోపికలను వశపరచుకొనిన రాధామనోహరుడు. అట్టి శ్రీకృష్ణస్వామికి జయోஉస్తు! జయోஉస్తు! జయోஉస్తు!

ఆ తరువాత పీఠికా ప్రాయంగా చివర తామై, ఒక ప్రార్థనను పద్యంలో, తమ ఇష్టదైవమైన శ్రీసాయీశ్వరునకు సమర్పించుకున్నారు.

''ఓ సాయి కృష్ణ ప్రభూ!, సహృదయ భక్తవర్యుల సంతృప్తికై జగన్మంగళం కాంక్షిస్తూ, నా అల్ప బుద్ధితో ఈ రసామృత సింధువును ఈదుటకు ప్రయత్నిస్తున్నాను. నీవే నాకు రక్ష. నీవు అందించే శక్తితో మాత్రమే దీనిని ఈది వేయగలను.

''నేను నీచేతిలో ఒక పనిముట్టు మాత్రంగా ఉంటాను. రచన నీవే సాగించు. నీవే తప్ప ఇతః పరంబెరుగ. సంరక్షించు భద్రాత్మకా! సాయీశ్వరా!

శ్రీకృష్ణా! మురళీధరా! వికచరాజీవాక్ష! లోకేశ్వరా!
రాకాచంద్రనిభాననా! జనమనఃప్రాణావనా! స్వామి! ఏ
కైకారాధ్య జగద్గురూ! హృదయవాసా! సాయిగోపాల దే
వా! కాంక్షింతుత్వదీయ సేవనము నిత్యంబున్ ప్రసాదింపవే

ఈ తరువాత మూల గ్రంథంలో గ్రంధ ప్రణాళిక ఉంది. కానీ 'పాలసముద్ర తరంగాలు' అనే పేరుతో విషయసూచికను చెప్పియుండడం వలన దీనిని అనువదించకుండా విడిచి పెట్టడం ఔచిత్యమండితం అయింది. అంతే కాదు విషయంలోకి ప్రవేశించడానికి వీలుకలిగింది. భక్తికి నిర్వచనం చెప్పి దానికి ఉదాహరణల్ని చూపించారు.

ఉదాహరణల్ని వివరించడంలో శాంతిశ్రీ గారు పాఠకుల్ని తమ సమ్మోహన జాలంతో బంధించి తమవెంట తీసుకవెళతారు. ఏదో పూర్వ శ్లోకానికి తాత్పర్యం చెపుతున్నట్లుగా అనిపించకుండా మన యెదుట కూర్చొని మన ప్రతిస్పందనను గమనిస్తూ మనల్ని తమ మంత్రజాలంతో ఆకర్షించి, ముందుకు తీసుకు వెళతారు. మూలంలోని శాస్త్రీయ వివేచనను విడిచి పెట్టలేదు. అయినా పాఠకుని బుద్ధి ఉదాహరణ సారస్యం మీదనే లగ్నమవుతుంది. ఇది పూర్తిగా శాంతిశ్రీ గారి వ్యాఖ్యాతృ నైపుణ్యం. ఇటువంటిది ఎన్నో జన్మల పుణ్యంవల్ల లభ్యంకావాలి. లేదా తన ప్రత్యక్ష దైవమైన భగవాన్ శ్రీసత్యసాయిబాబా అనుగ్రహ విశేషంవల్ల లభ్యం కావాలి. ఎలా అయినా ఆ మాధుర్య భోక్తలు భక్తులే.

మొత్తం గ్రంథమంతా రసస్నిగ్ధములైన ఉదాహరణలతో భక్తుల్ని ముగ్ధుల్ని చేస్తుంది. మధ్య మధ్య పోతన్నగారి పలకరింపులతో పులకరించకుండా ఉండలేము.

ఒక్క భాగవతం కాదు. ఒక హరివంశం కాదు. బ్రహ్మాండపురాణం, స్కాందం, లింగపురాణం, విష్ణుధర్మం, పంచరాత్రం, కృష్ణకర్ణామృతం, లలితమాధవం, విదగ్ధమాధవం వంటి గ్రంథాలు అనేకం.

అగస్త్య సంహిత, హరిభక్తి విలాసం వంటివి మరికొన్ని ముకుందదాసు వంటి మహా భక్తులు వచనాలు సింధువుకు విలువ తెచ్చాయి.

ఎన్నో ఎన్నో అనర్ఘ రత్నాలు తమ మనోహర దీప్తులతో అమృత సింధువును ధగద్ధగితం చేస్తున్నాయి. ఒక్కొక్క భావ రత్నాన్ని కళ్ళకద్దుకొని మననం చేసుకుంటూ ఉంటే పాఠకుడు ఎటువంటి నర్మ మర్మ మార్దవ మధుర రస సింధువుకు ఏతాము ఎత్తుతాడో కదా!

ఇది మాటలతో చెప్పనలవి కానిది. ఎవరికి వారే మనస్సులో అంతర్మనస్సులో అనుభవించగలది మాత్రమే.

ఆ విధమైన అమృతానుభూతిని అందరూ అందుకుంటారనీ, అందు కోవాలనీ, నా ఆశంస. ఇది ప్రత్యక్ష పరమాత్మ అయిన సాయి కృష్ణుని అనుగ్రహ ఫలం. ఇది నా అభిసంధి.

విజయసంధి

3-10-1995

**స్ఫూర్తిశ్రీ**

సాయిసుధ - శ్యామలా నగర్,

గుంటూరు

# ❀ శాంతిశ్రీ రచనలు ❀

- జ్యోతిర్మయి–ఖండకావ్యము
- త్యాగమయి–వాసవి కావ్యము
- ఉదాహరణత్రయి
- హనుమన్మండలి–హనుమాన్ చాలీసాకు తెలుగు
- సుందర మందారం
- నారద భక్తి దర్శనం
- తియ్యనిపాటల తిరుప్పావై
- అర్చన – వెంకట సాయి ఖండకావ్యము
- శివానంద లహరి
- నిత్య సౌందర్యలహరి
- భాగవత సప్తమ స్కంధ వ్యాఖ్య
- శ్రీ విష్ణు సహస్ర కమలము
- శ్రీ సనత్సు జాతీయము
- దీర్ఘ శరణాగతి (మధ్యాక్కరలు)
- మయూర క్రేంకృతి
- అష్టావక్ర సంహిత
- శాంతి బాల
- ఈశ్వర విశ్వరూపము – నమక చమక వ్యాఖ్య
- రామ సూర్యారాధన
- భక్తి రసాయనము
- హృదయపుష్పాలు
- శ్రీ సత్యసాయి సమర్చన
- ఉద్ధవ గీత
- వేదవల్లి – తైత్తరీయ వ్యాఖ్య
- శ్రీ సత్యశ్రీ కిరణాలు
- శ్రీ సత్యసాయి నిత్య పూజా విధానము
- శ్రీ కృష్ణభక్తి